# ఆంధ్ర సచిత్ర వార పత్రిక




9-5-69
40, పైసలు

దగ్గు, జలుబులు నీర్సమును కలిగిస్తాయి — యితర వ్యాధులకు దారితీస్తాయి

# బలము మరియు ఆరోగ్యమునకు వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి

దగ్గు, జలుబులతో రోగ నిరోధక శక్తిని గోల్పోతారు. మీరు నీర్సముగా వుంటారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశ ముంటుంది. గనుక వాటర్‌బరీస్ కాంపౌండ్ క్రమంగా త్రాగండి. దీనిలోగల ఓషధులు ఆకలిని వృద్ధి పరుస్తాయి. కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి. యితర వ్యాధులు కలగకుండా రోగ నిరోధక శక్తిని యిస్తాయి. దీనిలో చేర్చబడిన 'క్రియోసోట్' మరియు 'గయోకోల్' దగ్గు, జలుబులనుండి ఉపశమనము కలిగిస్తాయి.

**వాటర్‌బరీస్ కాంపౌండ్ – అత్యంత నమ్మకమైన టానిక్**




వార్నర్-హిందుస్థాన్ లిమిటెడ్

WH 8075 TL

నా ఖండిస్తూ, విద్యార్థులను వాటితో తమ అమూల్యమైన కాలాన్ని పాడు చేసుకోవద్దని, హెచ్చరిస్తూ, ప్రకటనలు చేస్తారని ఆశిస్తున్నాం. కాని ఇంతవరకు ఆయన నుండి అటువంటి ప్రకటన రాకపోవడం చాలా విచారంగా ఉంది.

ఇప్పటికీ మించిపోయినది ఏమీ లేదు. ఆయన ఇప్పటికైనా తన అభిమాన సంఘాలను ఖండిస్తూ ప్రకటన చేస్తే, ఎంతో మంది విద్యార్థుల జీవితాలను బాగు చేసిన వారవుతారు.

బి. టి. కృష్ణ, (వాల్తేరు)

* * *

ముగ్గురు మూర్ఖుల మొదటి సమావేశము లోనే ఇది హాస్యం కోసం నిర్దేశింపబడినది కాదని, కొన్ని నిర్దుష్టమైన ప్రయోజనాల ఆవశ్యకత పాఠకుల ముందుంచటం ఈ శీర్షిక ఉద్దేశ్యమని తెలిసి సంతోషించాం.

గతవారం పత్రికలో ముగ్గురు మూర్ఖులు సినీనటుల అభిమాన సంఘాలపై చేసిన విమర్శలు ప్రయోజనాత్మకంగా లేవని తెలుపుటకు చింతిస్తున్నాము. ఇంతవరకు ఈ శీర్షికలో వెలువడ్డ ప్రతి విషయము ప్రతివారి మనస్సులో కొన్ని ఆలోచనలు రేకెత్తించినవి. కాని, గత వారము అభిమాన సంఘాలపై చేసిన విమర్శలు కఠినాతి కఠినంగాను, కేవలము హాస్యం కోసం వ్రాసినట్లని పించినది. పలురకములైన హాస్య శీర్షికలు పత్రికలో చాలా వున్నాయి. వాటిలో ఉన్న హాస్యం పత్రికకి చాలా నిండుతనం తెప్పిస్తున్నది.

నిజానికి ఈ విమర్శలు భుజాలు తడుముకో నవసరం లేకుండా రామారావు, నాగేశ్వరరావు గార్ల అభిమాన సంఘాల పైననేనని ప్రతివారికి తెలుసు. ఈ అభిమాన సంఘాలు శీర్షికలో వెలువడ్డంత ఘోరంగా ఏమీ లేవు. కారణం అవి అభిమాన సంఘాలు మాత్రమే. ముగ్గురు మూర్ఖులన్నట్లు గాఢము కావు, ప్రగాఢము కావు. దక్షిణదేశంలో ముఖ్యంగా తెలుగునాట ఈ అభిమాన సంఘాలు, అభిమాన సంఘాలుగా మాత్రమే ఉంటున్నాయి కాని ఆరాధనా సంఘాలుగా మారలేదు.

ఉత్తరదేశంలో తమ అభిమాన సంఘం తాలూకు నటుని చిత్రము యొక్క కాపీలు మొదటి వారము లోనే డిస్ట్రిబ్యూటరుకు చేరిపోయే ప్రమాద మొస్తే, ఆ అభిమాన సంఘం, ఆ చిత్రాన్ని పదే పదే చూసి, కనీసం ఆ చిత్రాన్ని యాభై రోజులాడించి పంపిన ఆరాధనా సంఘాలు కోకొల్లలు. ఆయా సంఘం సభ్యుల సంఖ్య వేలలో ఉంటుంది కాబట్టి అక్కడ అది సాధ్యమేమోకాని, గుర్తింపు కాబడ్డ

# ఉత్తరాలు

ఇద్దరు నటుల పేరు మీద అభిమాన సంఘాలు ఆ మహానటులను కించపర్చే సంఘాలుగా ఒకరు కొకరు తయారయే తెలుగునాట అది సాధ్య పడదేమో. మన పద్మశ్రీ హీరో లిద్దరిని తలచు కొని గర్వపడని తెలుగు సినీ ప్రేక్షకుడుండడను కొంటాను. మరి, వారి అభిమాన సంఘాలుండటం కూడా ఉచితమే. అభిమాన సంఘం అన్నంత మాత్రాన తెరపైన నటుడు కనపడగనే హైరానా పడనవసరం లేదు. నిజమే. కాని దానిని ఆధారంగా చేసుకొని అభిమాన సంఘాలను మొదటి అక్షరం మొదలుకొని చివరి దాక విమర్శించడం సబబుగా తోచదు. ఇంతవరకు ఈ శీర్షికలో నిజాన్ని, నిజంగా మాత్రమే చదివాము కాని, చిలవలు, పలవలు కల్పించి వ్రాయగా చదవలేదు. ముఖ్యంగా ముగ్గురు మూర్ఖులనే ప్రయోజనాత్మకమైన శీర్షికలో ఇలా వ్రాయడం దురదృష్టకరం. విమర్శ, విమర్శ గానే వుండాలి. దానికి రంగు పూస్తే కువిమర్శగా మారుతుంది.

ప్రయోజనాత్మకమైన పత్రికలు, వాటి విలువలు తెలిసిన పెద్దలు నాతో ఏకీభవిస్తారని భావిస్తున్నాను.

కె. ఎస్. ఎస్. ఎన్. శర్మ (నందిగామ)

## వ్యాసాలు

'నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య ఏమిటి' అన్న సరోజినీదేవిగారి వ్యాసం చాలా బాగుంది. కట్నం నేటి సంఘంలో ఒక పెద్ద దురలవాటు అని చక్కగా చెప్పారు.

కానీ ముగింపులో కన్యలని కన్నతల్లిదండ్రులు కొంత వ్యక్తి స్వాతంత్ర్యం తమ కన్యల కిచ్చి కులాంతర, మతాంతర వివాహాల కడ్డు చెప్పరు అన్న వాక్యంలో అతిశయోక్తి వుందనిపిస్తుంది. వరకట్న నిషేధం (అమలులో) మతాంతర వివాహాలను ప్రోత్సహించదు. పూరీ శంకరాచార్యుల వారంతటి మహాత్ములు అంటరాని తనం హిందూ ధర్మ సమ్మతం అనే ఈ రోజుల్లో, పాత చింతకాయ పచ్చడి భావాలను జీర్ణించుకున్న మన పెద్దలు (కొందరు మాత్రమే) కేవలం కట్నంలేక పోవటం వల్ల, మతాంతర వివాహాలను తలపెట్టారు. దానికి వ్యక్తిలో మార్పు రావాలి. సంఘంలో మార్పు జరగాలి. దానికి సరోజినీదేవిగారు, తోటి ఆంధ్ర ప్రజానీకం మార్గాలకోసం, అన్వేషణ చెయ్యాలి.

కె. పి. విఠల్‌రావు, (న్యూఢిల్లీ)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 9–5–'69
శ్రీసౌమ్యనామ సం॥ వైశాఖమాసం బ॥ అష్టమి
సంపుటము : 61 సంచిక : 37

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు నటజీవితంలో 25 ఏళ్లు నిండిన సందర్భంగా రజతోత్సవాలు జరుగనున్న దిరజతోత్సవ చిత్రంగా విడుదలవుతున్న ఏ. వి. ఎం. వారి 'ఆదర్శ కుటుంబం'లో శ్రీ నాగేశ్వరరావు.

# ప్రణాళికలలో కొత్త అంశం ప్రారంభమా?

ఇటీవలే ముగిసిన (నేషనల్ డెవలప్‌మెంట్ కవున్సిల్ లేక) జాతీయాభివృద్ధి మండలి సమావేశం భారత రాజ్యాంగం చరిత్రలో ఒక ముఖ్య ఘట్టానికి గుర్తు. కేంద్ర—రాష్ట్ర సంబంధ బాంధవ్యాలు చెడిపోవటం మొదలు పెట్టాయనటానికి చిహ్నం. ఇదివరకు కాంగ్రెసు ప్రభుత్వాలు లేని రాష్ట్రాలేకాక కాంగ్రెసు పరిపాలన కింద ఉన్న రాష్ట్రాలు కూడా కేంద్రాన్ని ఎదిరించటం పరిపాటి అవవచ్చు.

జాతీయాభివృద్ధి మండలివారు సూచించిన ప్రణాళికని రాష్ట్ర ముఖ్యమంత్రులు ఏకగ్రీవంగా ఆమోదించలేదు. కాంగ్రెసు ముఖ్యమంత్రులు తమ తమ రాష్ట్రాలకి ఎక్కువ డబ్బు కావాలన్నప్పటికీ ప్రణాళిక స్వరూపాన్ని కాదనలేదు. ప్ర. ము. క వారు తమ అయిష్టాన్ని అధికారయుతంగా తెలుపలేదు. ప్రణాళికని ఖండించినవారు కమ్యూనిస్టులు, ప్రత్యేకంగా కేరళ ముఖ్యమంత్రి ఇ. ఎమ్. ఎస్. నంబూద్రిపాద్ గారు

## చెయినా-ఇండియా-రష్యా

'ఆల్టర్నేటివ్ పాలిసీస్ ఫర్ ది ఫోర్త్ ప్లాన్' అనే తమ పుస్తకంలో శ్రీ నంబూద్రిపాద్‌గారు ప్రణాళికని ఎలా మార్చాలో సూచించారు. ఆ పుస్తకంలో ఒకచోట ఇలా రాశారు: 'విదేశీ సహాయం ఇండియాకి ఎంత అవసరమో చెయినాకీ అంత అవసరమే. తన ప్రణాళికలు ప్రారంభించే కాలంలో చెయినాకి సోవియట్ యూనియన్‌వద్ద సహాయం లభించింది. తర్వాత సోవియట్ యూనియన్ చెయినాకి ఇచ్చే సహాయాన్ని—ధనసహాయం, సాంకేతిక సహాయం కూడా—ఆపివేసింది. దీనివల్ల చెయినా ఆర్థిక పరిస్థితి కుంటుపడలేదు సరికదా ఇంకా వేగంగా అభివృద్ధి చెందసాగింది. ఇది ఎందరో ఎదురుచూడని పరిణామం.'

ఈ వ్యాఖ్యని పరిశీలించటం అవసరం. ఏదో ఒక ప్రతిఫలం ఆశించకుండా ఏ దేశంవారూ విదేశ సహాయం ఇవ్వరు. రష్యా—చెయినాల మధ్య ఏర్పడిన విరోధాలవల్లనే రష్యా విదేశ సహాయాన్ని ఆపివేసిందనే సూచన శ్రీ నంబూద్రిపాద్‌గారి వ్యాఖ్యలోనే కన్పిస్తుంది. రేపు భారతదేశం—రష్యాల మధ్య ఏదయినా అభిప్రాయ భేదం వస్తే రష్యా మనకికూడా సహాయం ఆపివెయ్యగలదు కదా?

తూర్పు యూరప్ సహాయానికి సంబంధించిన ప్రాజక్ట్సులకి స్పేర్‌పార్ట్సులు ఆ ఆ దేశాలవద్ద పుచ్చుకోవచ్చు ననుకున్నారు; తీరా అడిగేటప్పటికి ఒక్క చెకోస్లొవాకియా తప్ప ఎవరూ స్పేర్‌లు ఇవ్వనన్నారు! ప్రస్తుతం మనకి ఎన్నోరకాల యంత్ర సామగ్రికి కావలసిన అప్పు తూర్పు యూరప్‌లో లభ్యం అవుతోంది. కాని, ఈ సామగ్రి మనకి అనవసరం.

## నిర్బంధాల అప్పు

పాశ్చాత్య రాజ్యాలవారుకూడా భారతదేశంలోకి దిగుమతి అయ్యే సరుకుకి అప్పు ఇస్తున్నారు. ఈ రకం అప్పుకీ కమ్యూనిస్టుదేశాల అప్పుకీ ఉన్న భేదం ఏమిటంటే, పాశ్చాత్యదేశాలు ఇచ్చే అప్పు యంత్రసామగ్రికి మాత్రం పరిమితం అయి ఉండదు. అయినా ఈ అప్పుతో దానిని ఇచ్చే దేశాల సామగ్రిని మాత్రమే కొనవచ్చు. అందువల్ల ఇదికూడా నిర్బంధం కల అప్పుకిందే లెక్క.

'డెఫిసిట్ ఫయినాన్సింగ్' — విధానానికి జన్మకారకులు తాతా—బిర్లాలు అయితే విదేశీ సహాయానికి జన్మకారకులు శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు, అనవచ్చు.

యుద్ధం తర్వాత బ్రిటన్ మనకి ఇవ్వవలసిన డబ్బుని లండన్‌లో జమకట్టి ఉంచింది. ఆ కాలంలోనే ప్రణాళికల ప్రయత్నాలు మొదలయ్యాయి.

రెండవ పంచవర్ష ప్రణాళికలో రెండు పెద్ద లోపాలు ఉన్నాయి. యంత్రాలు సక్రమంగా నడిచేందుకు కావలసిన దిగుమతులనీ, రవాణా వివరాలనీ లెక్కలోకి తీసుకోలేదు ప్రణాళికా సంఘంవారు. అప్పటిలో శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు వాణిజ్యశాఖ మంత్రిగా ఉండేవారు. వారు ఈ లోపాలకి మరొక పెద్ద లోపం చేర్చారు. 'విదేశ ద్రవ్య సమస్య' అనే దానిని సృష్టించారు. ఈ సమస్య పరిష్కారం కోసం ప్రపంచ బాంకువారు సహాయంచేసే దేశాల సమావేశం ఏర్పరిచారు. ఇంతలో లండన్‌లో ఉన్న డబ్బు కాస్తా కరిగిపోయింది.

## మహలనోబిస్-యుగం

ఇటువంటి పరిస్థితులలో ప్రొఫెసర్ మహలనోబిస్—కలుగచేసుకున్నారు. ప్రణాళికలకి భారతదేశం శక్తికీ సంబంధం లేదన్నారు; కేవలం అభివృద్ధి సాధించే ప్రణాళికలు మొదలుపెడితే అంతా అదంతట అదే సద్దుకుపోతుందన్నారు. రెండవ ప్రణాళికకన్నా పెద్ద మూడవ ప్రణాళిక తయారయింది...

బాంకులవారికి ఇతరుల ధనంతో వ్యాపారం చెయ్యటం బాగా అలవాటు. భారతదేశంలో పెట్టుబడి పెడతామని ఎన్నోరకాల వ్యాపారాలు చేసేవారు ప్రకటించారు. ఈ ప్రకటనలకి అనువుగా ఉండే మూడవ పంచవర్ష ప్రణాళికని ప్రపంచ బాంకువారు ఆమోదించారు.

తక్కినవారు 100 కోట్ల డాలర్లు ఇస్తే తామూ ఇస్తాము అన్నారు అప్పటి అమెరికా అధ్యక్షులు.

## బైరాగుల ఆశీర్వాదం

అంతకిముందే జాన్. ఎఫ్. కెన్నెడీ అమెరికా అధ్యక్షులుగా ఎన్నిక అయ్యారు. ప్రణాళికమీద సంతకాలు పడగానే లాలా గుల్జారీలాల్ నందా ప్రసాదం పంచిపెట్టారు; ప్రణాళికకి సాధువులు, బైరాగులు మొదలయినవారి ఆశీర్వాదాలు ఇప్పించినవారు ఆయనే. అంతా ఈ ఆశీర్వాదం

చలవేసనని ఆయన సెలవిచ్చారు. పండిత పీతాంబర పంత్, ప్రొ. మహలనోబిస్‌లు కూడా తమ ఆనందాన్ని వెలిబుచ్చారు.

అప్పులు పుట్టాయి.
సుఖజీవనం మొదలయింది.
అప్పులమీద వడ్డీలు పెరిగాయి.
తీర్చేకాలం మొదలయింది...

ప్రణాళికలు తయారు చేసేవారూ, వాటిని విమర్శించే వారూ కూడా రెండు సంగతులు మరిచిపోతున్నారు.

ఒకటి, ప్రణాళికలో ఎంతో దండగ కర్చు అయింది. పెద్ద, పెద్ద కర్మాగారాలు, ప్రాజక్టులూ తయారయ్యాయి వీటిని ఉపయోగించే అవకాశం కనిపించదు అయినా, వాటికోసం విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పెంచుతున్నారు ఇంత శక్తిని ఏమిచేస్తారు? అలాగే రైలుపట్టాల ఉత్పత్తి, గొట్టాల ఉత్పత్తి, మెషిన్ టూల్ల ఉత్పత్తి — వీటన్నిటిలోనూ వినియోగించలేని శక్తి ఉంది అంతేకాక, కేబిల్స్ ఫాక్టరీ, అస్సాంలో మరొక నూనె శుద్ధి కర్మాగారం పెట్టటానికి ప్రయత్నాలు చేస్తున్నారు.

**వసూళ్లు-వ్యయాలు**

రెండవది, ప్రణాళికా నిపుణులు అందరూ కొత్త వసూళ్ళు ఎలాగ అని ఆలోచిస్తున్నారేకాని కర్చులు తగ్గించే మార్గాలకోసం వెతకటం లేదు తమ రాష్ట్రాల హక్కుల విషయంలో అంత పౌరుషం చూపించే ముఖ్యమంత్రులు తమకింద నున్న సామ్రాజ్యాలలో విద్య, ఆరోగ్యం, సామాజికాభివృద్ధి, గృహవసతి వగయిరా) పొదుపు ఎందుకు తీసుకు రారాదు? ఈ పొదుపువల్ల మిగిలే డబ్బుని సద్వినియోగం చెయ్యవచ్చు

**పరాన్నభుక్ ...**

ఈ సందర్భంలో కమ్యూనిస్టుల పాత్ర గమనించతగ్గది. వారు ఎల్లప్పుడూ పరాన్న భోజనాన్నే బలపరుస్తారు. 'ఎందుకు?' అంటే, 'వారికీ వీరికీ ఎన్నో సంబంధాలు ఉంటాయి కాబట్టి' అని సమాధానం ఇవ్వవలసి వస్తుంది.

నంబూద్రిపాద్ చెయినా గురించి చెప్పాడు చెయినాలో ఎవరినీ ఊరికే కూర్చుని తిననివ్వరు. సెక్రెటేరియట్‌లో కానివ్వండి, చెట్టుకింద కానివ్వండి గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటే ఊరుకోరు. అవసరమయితే కాన్సన్‌ట్రేషన్ కాంప్‌కి పంపిస్తారు. భుక్తి గడిచినంతకాలం ఉద్యోగం గురించి అంతగా పట్టించుకో నవసరం లేదని పాశ్చాత్య ఆర్థిక శాస్త్రజ్ఞులుకూడా అంటున్నారు. ఇక ఉత్పత్తి సంగతి తీసుకుంటే, ఊరికే గోతులు తీసి పూడిస్తే అది వ్యాయామం అవవచ్చుకాని ఉత్పత్తి మాత్రం కాదు. ప్రస్తుతం కేంద్ర సచివాలయంలోని ప్రభుత్వోద్యోగులలో కనీసం 33 శాతం పని లేకుండా ఉన్నారు రాష్ట్ర ముఖ్యమంత్రులు ఈ విషయాన్ని గురించి ఆలోచించాలి.

ప్రతిదినం ప్రభుత్వ పత్రికా సమాచార శాఖ (పి ఐ బి) ఎవరో ఒకమంత్రి లేక ఉపమంత్రి చేసే ఆవిష్కరణకోసం ఆహ్వానపత్రాలు విడుదల చేస్తూ ఉంటుంది.

**ఎవరి కర్చు?**

ఇటీవలే పార్లమెంటులో ఒక బస్ స్టాండుని నగరం మేయరుగారు ఆవిష్కరించారు. అలాగే జంతర్‌మంతర్ టికెట్టు ఆఫీసుని అట్టహాసంగా ఆవిష్కరించారు తపాల బిళ్ళలు ఇక్కడ తప్ప మరే దేశంలోనూ మంత్రులు విడుదల చెయ్యరు కొంతకాలం క్రితం ఒక శవదహనశాలకి ఒక మంత్రి ప్రారంభోత్సవం చెయ్యడం జరిగింది ఈ హంగామాకి అయ్యే కర్చంతా ఎవరు భరిస్తున్నారు? ప్రజలే, అని వేరే చెప్పనవసరంలేదు.

న్యూఢిల్లీవల్ల దేశానికి అయ్యే కర్చుని గురించి రాస్తే పెద్ద గ్రంథం అవుతుంది. ఇక మంత్రుల విదేశ పర్యటనల సంగతి సరేసరి. మునుపు 'రాయల్ ఎయిర్‌ఫోర్స్' వారు ప్రకటనలలో అనేవారు — 'ఆర్. ఏ. ఎఫ్ లో చేరి ప్రపంచాన్ని పర్యటించండి!' అని. ఇప్పుడు 'భారత మంత్రివర్గంలో చేరి ప్రపంచాన్ని పర్యటించండి!' అనే నినాదం ఎంతో ఉచితంగా ఉంటున్నది.

ప్రణాళికలు ప్రజల అభివృద్ధికోసం గాని సిద్ధాంతాలకోసం కాదు.

సరే! ఇప్పుడు నంబూద్రిపాదులు ఢిల్లీతో పోటీకి వస్తున్నారు. ఇదీ ఒకందుకు మంచిదే స్వేచ్ఛతో కూడిన చర్చకి అవకాశం ఉంది ●

# రచయితలకు మనవి

**కథలు, వ్యాసాలు**

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామాగల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు

ప్రచురణకి స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

**నవలలు**

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాగల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంపనవసరం లేదు 100 అరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

**కార్టూన్‌లు**

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాగల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా. వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత శ్రద్ధగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము; కాని, వాటి విషయములో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

# ముగ్గురు మూర్ఖులు




'అధికారపక్షమైన కాంగ్రెసు పార్టీకి ప్రజల్లో పలుకుబడి తగ్గిపోతూఉందని అందరూ అంటున్నారు. కాని ప్రధానమంత్రిణి అయిన యిందిరానెహ్రూగాంధీయెక్కడ ఉపన్యసించినా ఆ సభలకు వేలాది ప్రజలు హాజరు కావడం లేదా? ఈ సభలన్నీ ప్రజల్లో ఆమెకు గల పలుకుబడిని తెలియజేయడం లేదా?' అని ప్రశ్నించాడు చంచ్రలావు.

'ఇందిరానెహ్రూగాంధి సభలకు వేలాది ప్రజలు వచ్చినంతమాత్రాన ప్రజలు ఆమె నాయకత్వాన్ని అంగీకరించి, కాంగ్రెసు పార్టీని బలపరుస్తున్నారని అనుకోవడం సరియైనది కాదు. ఇదివరకు జవహర్‌లాల్ నెహ్రూ సభలకు లక్షలాది ప్రజలు వచ్చేవారు. తరువాత లాల్‌బహదూర్ శాస్త్రి సభలకు కూడా వేలాది ప్రజలు వచ్చేవారు. ఇప్పుడు యిందిరా నెహ్రూగాంధీ సభలకు ప్రజలు వస్తున్నారు. రేపు నువ్వు ప్రధానమంత్రివి అయితే నీ సభలకు కూడా వేలాది ప్రజలు వస్తారు. ప్రజల్లో యిందిరానెహ్రూగాంధీకి పలుకుబడి ఉందని నువ్వు అనగానే నాకు బుచ్చయ్య సంగతి జ్ఞాపకానికి వచ్చింది' అన్నాడు చూడామణి.

'ఏమిటా బుచ్చయ్య సంగతి?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'అచ్చయ్య అనే కాంగ్రెసు శాసన సభ్యుడు ఉండేవాడు. అతను శాసన సభకు యెన్నిక అయిన సంవత్సరంలోనే చనిపోయాడు. అందుచేత ఆ నియోజక వర్గంలో ఉపయెన్నిక వచ్చింది.'

'అనేకమంది కాంగ్రెసు సభ్యులు ఆ స్థానానికి అభ్యర్థిత్వాన్ని కోరుతూ అప్లికేషన్లు పంపారు. అభ్యర్థిత్వాన్ని కోరినవారిలో వృద్ధనాయకులు ఉన్నారు, యువకులు ఉన్నారు, స్త్రీలు ఉన్నారు. హరిజనులు ఉన్నారు. గిరిజనులు ఉన్నారు. అల్ప సంఖ్యాక వర్గాలవారు ఉన్నారు కాని కాంగ్రెసు పార్టీ యీ అప్లికేషన్లన్నింటినీ త్రోసిపుచ్చి మరణించిన అచ్చయ్య కుమారుడైన బుచ్చయ్యనే ఆస్థానానికి అభ్యర్థిగా నిర్ణయించింది.'

'బుచ్చయ్య తన తండ్రి స్థానాన్ని తనకు యిప్పించవలసినదిగా కోరుతూ కాంగ్రెసు పార్టీకి అప్లికేషను పంపించియుండలేదు. కాబట్టి యీ విషయంలో బుచ్చయ్యతో మాట్లాడడానికి కాంగ్రెసు పార్టీ పిచ్చయ్యను పంపించింది.'

పిచ్చయ్య వెళ్లి, బుచ్చయ్యను కల్సుకొని కాంగ్రెసు పార్టీ నిర్ణయాన్ని అతనికి తెలియజేశాడు. తనను కాంగ్రెసు పార్టీ అభ్యర్థిగా నిర్ణయించినందుకు బుచ్చయ్య కాంగ్రెసు నాయకులకు తన కృతజ్ఞతను తెలియ జేయవలసినదిగా పిచ్చయ్యను కోరాడు. ఆతరువాత అతను యేమీ మాట్లాడలేదు. అందుచేత బుచ్చయ్య దేన్ని గురించో సందేహిస్తున్నట్లుగా పిచ్చయ్య ఊహించాడు.'

'కాంగ్రెసు పార్టీ ఆశయాలను గురించి నువ్వు సందేహిస్తున్నావా?' అని బుచ్చయ్యను ప్రశ్నించాడు పిచ్చయ్య.

'అబ్బే, అటువంటిదేమీ లేదు.'

'అయితే డబ్బు గురించి సందేహిస్తున్నావా?'

'అబ్బెబ్బే., డబ్బును గురించి ఆలోచించవలసిన అవసరం లేదు. పది యెలక్షన్లకు సరిపోయే డబ్బును మానాన్నగారే గడించారు'.

'అయితే యింతకూ నీ సందేహం యేమిటి?'

'ఏమీ లేదు. మీరు నాకొక్కహామీని యివ్వాలి'.

'ఏమిటది?' అని ప్రశ్నించాడు పిచ్చయ్య.

'పెద్ద విషయం యేమీ కాదు. కాంగ్రెసు అభ్యర్థిగా యెన్నికలో పోటీ చేస్తాను కాని నా నిమిత్తం యెన్నికల ప్రచారం చేయడానికి మన ప్రధానమంత్రిణి యిందిరానెహ్రూగాంధీ మాత్రం నా నియోజక వర్గానికి రాకూడదు' అని బుచ్చయ్య అన్నాడు.

ఆమాటలు విని పిచ్చయ్య ఆశ్చర్యపోయాడు. 'ఇందిరా నెహ్రూగాంధీ నీ యెన్నికల ప్రచారానికి వస్తే యేం?' అని తిరిగి ప్రశ్నించారు పిచ్చయ్య.

'ఏమీలేదు. వాళ్ళనాన్న నియోజకవర్గమైన ఫూల్పూర్‌లోనే కాంగ్రెసు పార్టీ అభ్యర్థి అయిన మాలవ్యాను ఆమె గెలిపించలేక పోయింది. ఇక మానాన్న నియోజక వర్గంలో నన్ను ఆమె గెలి

పించ గలదా?' అని బుచ్చయ్య యెదురు ప్రశ్న వేశాడు., అని బుచ్చయ్య సంగతిని చూడామణి చెప్పాడు.

'ఆమె తండ్రి నియోజకవర్గంలోనే ఆమె పార్టీ అభ్యర్థి ఓడిపోయి ఉండవచ్చును. అంతమాత్రాన ఆమె బుచ్చయ్య ఎన్నికల ప్రచారానికి వస్తే నష్టం ఏమిటి? ఏఅభ్యర్థి అయినా, తన నిమిత్తం ప్రచారం చేయడానికి పెద్దనాయకులు తన నియోజకవర్గానికి రావాలని కోరుతాడు. అటువంటప్పుడు యిందిరా నెహ్రూ గాంధీ తన నిమిత్తం ప్రచారం చేయకూడదని బుచ్చయ్య యెందుకు కోరాడు?' అని చూడామణిని ప్రశ్నించాడు, చంచలరావు.

'బహుశా బుచ్చయ్య 'కరెంటు' 1—3—69 సంచికను చదివి ఉండవచ్చును. ప్రజల్లో యిందిరా నెహ్రూగాంధీకిగల పలుకుబడిని తెలియజేసే వార్త అందులో ఒకటి ప్రచురింపబడింది.

'ఈ సంవత్సరం జరిగిన యెన్నికల సందర్భంలో యిందిరానెహ్రూగాంధీ బీహారు రాష్ట్రంలోని 122 అసెంబ్లీ నియోజక వర్గాల్లో కాంగ్రెసుపార్టీ తరుపున ప్రచారం చేసింది. వాటిలో 103 నియోజక వర్గాల్లో కాంగ్రెసు అభ్యర్థులు ఓడిపోయారు. ముజఫర్‌పూరు కాంగ్రెసు పార్టీకి బలమైన ప్రాంతం. అక్కడ ఆమె కాంగ్రెసు పార్టీ తరపున తీవ్రంగా ప్రచారం చేసింది. వెంటనే అక్కడ కూడా కాంగ్రెస్ అభ్యర్థులు అత్యధిక సంఖ్యలో ఓడి పోయారు.'

'ఉత్తరప్రదేశ్‌లోకూడా యిలాగే జరిగింది. రాయ్‌బెరిల్లీ ఆమె స్వంత నియోజకవర్గం. రాయ్‌బెరిల్లీ లోక్‌సభస్థానంలో యెనిమిది అసెంబ్లీ స్థానాలుఉన్నాయి. వాటిలోని ఆరు స్థానాల్లో కాంగ్రెసుపార్టీ అభ్యర్థులు ఓడిపోయారు. ఇక ఫూల్‌పూరు సంగతి సరేసరి.'

'ఈ వార్తను చదివిన తరువాత యే కాంగ్రెసు అభ్యర్థి అయినా, యిందిరానెహ్రూగాంధీ తన నియోజకవర్గంలో ప్రచారం చేయాలని కోరగలడా?

'ఆమె యెక్కడ ఉపన్యసించినా, వేలాది ప్రజలు వచ్చారు. కాంగ్రెసు పార్టీని బలపరచ వలసినదిగా ఆమె ప్రజలను కోరింది. ఆమె ఉపన్యాసాన్ని విన్న తరువాత ప్రజలు కాంగ్రెసుపార్టీకి వ్యతిరేకంగా ఓట్లువేసి కాంగ్రెసు అభ్యర్థులను అత్యధిక సంఖ్యలో ఓడించి వేశారు. ఈ యెన్నికల ఫలితాలు ప్రజల్లో ఆమెకు యెంత మాత్రం పలుకుబడి లేదనే విషయాన్ని రుజువు చేయడం లేదా?'

'క్రికెట్టు ఆట విషయంలో పత్రికలు యెన్నో వివరాలను ప్రకటిస్తుంటాయి. ఒక్కో ఆటకాడు యెన్ని పరుగులు చేసిందీ, ఆ పరుగుల్లో యెన్ని నాలుగులు, యెన్ని ఆర్లు ఉన్నదీ, యెన్ని నిముషాల్లో ఆ పరుగులు చేసినదీ మొదలైన వివరాలనన్నింటినీ పత్రికలు ప్రచురిస్తాయి. అలాగే దేశంలోని నాలుగు రాష్ట్రాల్లో యీ మధ్యను జరిగిన యెన్నికల సందర్భంలో యిందిరానెహ్రూగాంధీ యెన్ని నియోజక వర్గాల్లో కాంగ్రెసుపార్టీ తరపున ప్రచారం చేసిందీ వాటిలో యెన్ని నియోజకవర్గాల్లో కాంగ్రెసుపార్టీ అభ్యర్థులు గెలిచినదీ, పత్రికలు వివరంగా ప్రకటిస్తే బాగా ఉంటుంది. ప్రజల్లో ఆమెకు యెంత పలుకుబడి ఉందో అప్పుడు అందరకూ తెలుస్తుంది' అన్నాడు చూడామణి.

'1966వ సంవత్సరం మేనెల మొదటి వారంలో యిందిరా నెహ్రూగాంధీ బొంబాయిలోని షణ్ముఖానంద హాలులో మాట్లాడుతూ, యిలాగ అంది. 'నాకు కాంగ్రెసు పార్టీతో అవసరం లేదు. ప్రజలు నాతో ఉన్నారు'.

'అంటే కాంగ్రెసు పార్టీని కూడా కాదని ప్రజలు తనను బలపరుస్తారని ఆమె అనుకొంది. అందుకనే కాంగ్రెసుపార్టీలో యెవరైనా తన అభిప్రాయాలను వ్యతిరేకిస్తే, ఆమె లోక్‌సభను రద్దుచేసి ప్రజల వద్దకు వెడదా'మని ఆమె వారిని బెదిరిస్తూ ఉండేది. కాని యికమీదట ఆమె అలాగ బెదిరించలేదు' అన్నాడు చిదంబరం.

'ప్రజలు నాతో ఉన్నారు' అని యిందిరా నెహ్రూ గాంధీ అన్నది' అని నువ్వు చెప్పగానే నాకు ఒక జోకు జ్ఞాపకానికి వచ్చింది'అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఇదివరకు ఒక నాయకుడు అన్నాడుట, 'ప్రజలు నా వెనుక ఉన్నారు' అని 'ఏం తరుముకొస్తున్నారా?' అని వెంటనే ప్రతిపక్ష నాయకుడు ప్రశ్నించాడట.'

'అలాగఉంది యిందిరా నెహ్రూగాంధీ చెప్పిన మాట. అయినా యికమీదట ఆమె కాంగ్రెసు పార్టీని బెదిరించలేదని నువ్వు అనుకొంటున్నావు. కాని అది సరియైనది కాదు. ఇకముందు ఆమె యింకో రకంగా కాంగ్రెసుపార్టీని బెదిరించవచ్చును'.

'ఆమె యే నియోజక వర్గంలో కాంగ్రెసు తరుపున ప్రచారం చేస్తుందో, అక్కడ కాంగ్రెసుపార్టీ ఓడిపోతుందని యిప్పుడు రుజువైపోయింది గదా! ఇప్పుడు కాంగ్రెసు పార్టీలో యెవరైనా ఆమెను వ్యతిరేకిస్తే వారిని ఆమె యిలా బెదిరించవచ్చును. 'లోక్‌సభను రద్దుచేసి ఎలకన్లను పెడదాం. ఇప్పుడు యెవరైతే నన్ను వ్యతిరేకిస్తున్నారో, వారి నియోజక వర్గాలకు వెళ్ళి వారిని గెలిపించవలసినదిగా నేను ప్రజలను కోరతాను. అప్పుడు వారు యెలా గెలుస్తారో నేను చూస్తాను.'

'అప్పుడు ఆమెను వ్యతిరేకించిన కాంగ్రెసు సభ్యులందరూ భయపడి కుక్కిన పేనుల్లాగ ఊరుకొంటారు. అందుచేత ఆమె యిప్పుడు కాంగ్రెసు పార్టీని మరింత తీవ్రంగా బెదిరివచ్చును' అన్నాడు చూడామణి.

'సరే ఆ విషయాన్ని అలాగ విడిచిపెట్టు. అచ్చయ్య స్థానంలో తమను అభ్యర్థులనుగా నిర్ణయించవలసినదిగా కోరుతూ యెంతోమంది కాంగ్రెసు సభ్యులు అప్లికేషన్లను పంపించారు. కాని అచ్చయ్య కుమారుడైన బుచ్చయ్య మాత్రం అప్లికేషను పంపలేదని చెప్పావు. అటువంటప్పుడు కాంగ్రెసుపార్టీ, ఆ అప్లికేషన్లనన్నింటినీ త్రోసిపుచ్చి అప్లికేషను పంపని బుచ్చయ్యకు కాంగ్రెసుపార్టీ అభ్యర్థిగా యెందుకు నిర్ణయించింది?'అని చంచలరావు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఇప్పుడు మనదేశంలో 'నెహ్రూమార్కు' ప్రజాస్వామ్యం అమలులో ఉంది. దీని ప్రకారం శాసనసభా సభ్యత్వం మొదలైన పదవులన్నీ వంశ పరంపరగా రావాలి. అంటే పదవుల విషయంలో ముందుగా మనం వారసత్వపు హక్కుల్ని పరిశీలించవలసి ఉంది. ఈ హక్కువల్లనే గదా, యిందిరా నెహ్రూగాంధీ ప్రధాన మంత్రిణి కాగలిగింది.'

'ఇంతవరకు కాంగ్రెసుపార్టీ అనుసరిస్తున్న విధానాన్నిబట్టి చూస్తే పదవుల విషయంలో వారసత్వపు హక్కులను యీ వరుసలో నిర్ణయించవచ్చును. ఒక శాసనసభ్యుడు చనిపోతే సదరు స్థానానికిక పోటీ చేసే హక్కు ఆ చనిపోయిన శాసనసభ్యుని భార్యకు చెందుతుంది. మరణించిన శాసనసభ్యుని భార్య ముసలిదయిపోయినా, లేక భార్యయే శాసనసభ్యునికంటే ముందుగా మరణించినా, సదరుహక్కు అతనికుమారునికి చెందుతుంది. కుమారుడు లేకపోతే ఆ హక్కు కుమార్తెకు ఉంటుంది. మరణించిన శాసనసభ్యునికి సంతానం లేకపోతే అప్పుడు ఆ హక్కు అతని సోదరులకు, పెదతండ్రులకు, పినతండ్రులకు, వారి కుమారులకు వరుసగాచెందుతుంది. పదవి అనేది యెప్పుడూ ఒక కుటుంబాన్ని దాటి పైకి పోకూడదు. మరణించిన శాసనసభ్యునికి బొత్తిగా వారసులు యెవరూ లేకపోతేనే, యితరుల అభ్యర్థిత్వాన్ని గురించి ఆలోచించవలసి ఉంటుంది'అని పదవుల వారసత్వపు హక్కులను గురించి వివరించాడు చూడామణి.

'నువ్వు చెప్పింది బాగానే ఉంది. కాని దీన్ని గురించి ఆలోచిస్తుంటే నాకు మరొక విషయం అర్థం అవుతున్నది. మరణించిన శాసనసభ్యుని స్థానానికి అతని వారసుణ్ణే అభ్యర్థిగా నిర్ణయించడంలో చాలా ప్రయోజనం ఉన్నది' అన్నాడు చిదంబరం.

'ఏమిటా ప్రయోజనం?' అని చూడామణి ప్రశ్నించగా చిదంబరం చెప్పడం ప్రారంభించాడు.

'ప్రజలు తమకు ప్రాతినిధ్యాన్ని వహించే హక్కును తమకు నచ్చిన అభ్యర్థికి యిస్తున్నారనేది కేవలం సిద్ధాంతమే కాని ఆచరణలో అలాగ జరుగుతున్నదా? చాలా చోట్ల ప్రజలు డబ్బు పుచ్చుకొని ఓట్లు వేస్తున్నారని మనం వింటున్నాం. అంటే ప్రజలు తమకు ప్రాతినిధ్యాన్ని వహించే హక్కును అమ్ముకొంటున్నారన్నమాట. శాసనసభ్యుడు సదరుస్థానాన్ని ప్రజలవద్ద కొనుక్కొంటున్నాడనే కదా దీనికి అర్థం.'

'ప్రతి అయిదేళ్ళకు ఒకసారి యెన్నికలు జరుగుతాయని అందరకూ తెలును కాబట్టి సదరు శాసనసభా సభ్యత్వాన్ని అయిదేళ్ళపాటు ఆ వ్యక్తి అనుభవించడానికి ప్రజలు అతనికి అమ్మివేశారు. ఆ అయిదేళ్ళ లోపునే శాసనసభా సభ్యత్వాన్ని కొనుక్కొన్న వ్యక్తి చనిపోయినట్లయితే, అతని చరస్థిరాస్తులతో పాటు శాసనసభా సభ్యత్వం కూడా అతని వారసులకు చెందాలి కదా!'

'నాగరికత యెంతగా పెరిగినా, ప్రజల్లో యింకా పాపభీతి ఉంది. అందుచేత ఓటరు మహాశయులు మరణించిన శాసనసభ్యునివద్ద యిదివరకు కొంత ప్రతిఫలాన్ని పొంది ఉన్నారు. కాబట్టి యిప్పుడు అతని వారసునిపైన మొగ్గును చూపించడం సహజం. ఉపయెన్నికలో కూడా, ఓటర్లు ఆ వారసుని వద్ద ఋణమో, సణమోపుచ్చుకొంటారనుకో. అది వేరే విషయం. దీన్నిబట్టి కూడా మరణించిన శాసనసభ్యుని స్థానంలో అతని వారసుడే గెలవడానికి యెక్కువ అవకాశం ఉందికదా! అన్నాడు చిదంబరం.'

'ఇప్పటికే చాలా ఆలస్యం అయింది'అంటూ చంచలరావు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు.




**వి. హెచ్. వి, విజయనగరం**

నేను ఒక ప్రాణమిత్రుని చెల్లెలిని ప్రేమించాను. కట్నం కానుకలు లేకుండా వివాహం చేసుకోవాలని అనుకున్నాను. కాని మిత్రుని చెల్లెలిని చేసుకొంటే తప్పని సంఘం ఎత్తి పొడుస్తుందేమోనని అనుకొంటున్నాను...

అయినవారికి సహాయం చేయడానికి నామర్దా పడేది ఒక్క తెలుగువాళ్లే ననుకుంటాను!! సంఘం ఎత్తి పొడుస్తుందని కట్నం కానుకలే అడుగుదామనుకుంటున్నారా. తరువాత పెళ్లి చూపులకు వెళ్లి పిల్ల నచ్చలేదని చెప్పినా నాకు ఆశ్చర్యం కల్గదు.. సిగ్గుగా ఆలోచించక ఆర్థికంగా భార్యని పోషించ కల శక్తి ఉంటే గో ఎ హెడ్ అండ్ మారీ!

**సౌమ్యశ్రీ, హైదరాబాదు**

జర్నలిజంలో ఏ యే పరీక్షలున్నాయి. వాటికి ప్రైవేటుగా కట్టడానికి వీలవుతుందా ?

డిప్లమా, డిగ్రీ పరీక్షలున్నాయి, వీలు లేదు, కనీస విద్యార్హతలు డిగ్రీ.

**ఎన్. ఎన్. కె, విశాఖపట్నం**

అక్కయ్యా! మిమ్మల్ని చూడాలని మీతో మాట్లాడాలని ఉంది. ఎలా?

నేను అక్కడికో నువ్వు ఇక్కడికో రావడం తప్ప దారిలేదు స్వర్ణా. నేను త్వరలో వస్తాలే. . . . .

**సుమలత, విజయవాడ**

వరంగల్లు రచయిత్రుల సమావేశంలో మీరు ఊదరగొట్టి (అందులో ఉన్న ఆత్మీయత నేనెప్పుడూ మరువలేను) స్టేజి ఎక్కించి కథ వ్రాయించి చదివించారు నా చేత. గుర్తున్నానా మీకు? నేను సుమలతను!

మంచిదానివే. ఎలా మరిచి పోతాననుకున్నావు? బెజవాడలో నువ్వున్నట్టు తెలియదు. లేకుంటే మొన్న చూసేదాన్నే. ర. స. సూ. పంపించాను. అందుకో!

**బి. ఎస్, మల్లెంపూడి**

మీరెన్ని చదువుకున్నారు?

ఏబులమో, అరవీసో జ్ఞాపకం లేదోయ్!

మా బావ పేరేమిటి?

చీ పోదూ, సునందా, సిగ్గేస్తుంటే!

మీ పాపల పేర్లేమిటి?

ముద్దుపేర్లు ముగ్గురికీ—డెవిల్స్!

**యస్. డి. బి, కదిరి**

మొట్టమొదట ఒక అమ్మాయికి ప్రేమలేఖ రాసేటప్పుడు చేయి వణుకుతుంది...

పడ్డావనుకో ప్రేమలో!

**టి. పి, కొత్తవలస**

ఆడ పిల్లలకు వివాహం చేసినప్పుడు అప్పగింతలప్పుడు తల్లితండ్రులు కంటనీరు పెడతారెందుకు?

మన యింట పెరిగిన యీ మొక్క పరాయింట చేరాలి ధైర్యంగా గౌరవప్రదంగా ఎలా పెరుగుతుందో కదా — అన్న బెంగ— ఆ కన్నీరు. ప్రమీలా! దుఃఖం కాదు.

**ఎస్. ఆర్. పి, పల్లబసాయిపల్లె**

ఈ విశాల విశ్వంలో లేని వస్తువొకటి చెప్పండి చూద్దాం.

మనిషిమీద మనిషికి గౌరవం, తగినంత డబ్బు, ప్రాణంపై విలువ, కుర్రవారికి వ్యక్తిత్వం, ఆడపిల్లలకి ధైర్యం, ఆడదానికి ఓపిక ఎన్నో కన్పించడం లేదు బ్రదర్, ఒకటే అడిగితే —చిక్కే.

**సి. జె, సికిందరాబాదు**

స్నేహానికి నిర్వచనం ఏమిటి?

నిర్వచనం దేనికి? మనిషిని మనిషి అర్థం చేసుకుంటే ఏర్పడేదే కదా స్నేహం!

ధనవంతునికీ బీదవానికీ కోరికలలో చేతలలో గల వ్యత్యాసము ఏమిటక్కయ్యా?

కోరికలు గుర్రాలైతే అందరూ ఎక్కుతారు సోదరీ, ఎటొచ్చీ ధనికుడు వాస్తవికతలో నెగ్గుకొస్తాడు. పేదవాడు కలలోంచి తేరుకోడు— అంతే.

కవయిత్రి కావడం కంటే రచయిత్రి కావడం చాలా సులభం అనుకుంటాను నిజమేనా?

ఛందస్సు వృత్తాలూ వంటపడితే కవిత్వం అంత సులభం యింకేటి ఉండదు. దేనిమీదపడితే దాని మీద మత్తేభమో చంపకమాలో అల్లేయొచ్చు!

**పి. ఎన్, లాలంకోడూరు**

మీ అల్లుళ్లి కావాలని వుంది.

ఇంటల్లుళ్లమీద ఇంటరెస్టు లేదు బ్రదర్. సారీ

నవ్వే ఆడదాన్ని ఏడ్చే మగవాణ్ణి నమ్మకూడదంటారు ఎందుకని?

అది పాతకాలపు నమ్మకం. నవ్వుతూనే బరువు బాధ్యతలు మోస్తున్నారు ఆడవాళ్లు. ఏడుస్తూ కూడా ఆడదానికి చేయూతా ఓదార్పూ, తగిన గౌరవం యివ్వలేకుండా ఉన్నారు పురుషసింహాలు..

**వి. కావేరి, కుప్పం**

అక్కయ్యా, నేను ఏదైనా పని చేద్దాం అనుకుంటాను. కాని మధ్యలోనే ఆటంకాలు...

ఆటంకం రాగానే పని మానేస్తావనుకుంటాను కావేరీ, అలాఅయితే ఎప్పటికీ ఏ పనీ పూర్తవదు.

**డి. ఎస్, విజయవాడ**

...నన్ను ఏం చెయ్యమంటారు? ముందు నుయ్యి వెనుక గొయ్యిగా ఉంది. ఈ సమస్య ఎలా పరిష్కారం అవుతుంది?

ట్రైనింగు అయిన మీరు ధైర్యంగా ఏదో ఉద్యోగంలో చేరి ఆర్థికంగా స్వంతకాళ్లమీద నిలబడండి. బ్రతకగలిగిన ఆడదాన్ని ఏ భర్తైనా యిప్పుడుకాకుంటే కొంతకాలానికేనా గౌరవిస్తాడు.

**జి. వి. పి. ఆర్, సిని**

టెర్లిన్. నైలాన్ చీరలు కట్టి అవయవాల సొంపులను బహిర్గతం చేస్తున్న నేటి స్త్రీలకన్నా ఆకులు ఒంటినిండా కప్పుకొని మానధనాన్ని కాపాడు కొన్నటువంటి ఆదిమవాసులు నయం అనిపిస్తుంది. ఏమంటారు రామలక్ష్మిగారూ.

చిత్తం. ఈనాటి మీ మగవాళ్లు 'ఆదిమవాసులు' కారుకదా అని టెర్లిన్ నైలాన్లు నాడాతున్నాం. లేకుంటే గ్రాస్‌స్కర్ట్‌లు ధరించే వాళ్లమే.

**కె. ఎస్. ఆర్, బెక్కం**

మీరు పాకశాస్త్ర ప్రవీణులని విన్నాము. ఏమంటారు? ఔనంటారా?

చిత్తం . . . . మా యింట అంతా క్షేమం! నా వంట తిని కూడా!!

బి. ఏ. సుబ్బారావుగారు తమ కుమార్తెను ఓ మహమ్మదీయునికిచ్చి నిఖా జరిపించారని విన్నాను. ఎంతవరకు నిజం?

అక్షరాలా. అభ్యుదయ భావాలుగల సుబ్బారావుగారి శ్రీమతి కూడా ముస్లిమ్ వనిత అని మీకు తెలియదా?

# ది క్రోక్ గార్త్ బొమ్మలకథ










—మూడేళ్ళ క్రితం హిమాలయాలలోపల ఎక్కడో ఒక విమానం కూలింది... మొత్తం డెబ్బయి మంది చచ్చిపోయారు, వారిలో మేరియన్ భర్త ఒకడు... ఆమె ఒకర్తే మిగిలింది.....

— తనూ చనిపోయి ఉండేదే.....కాని అక్కడి మనిషి ఒకతను ఆమెని విరిగిన విమానం ముక్కల్లో చూశాడు.....

— చంద్రాయేనా?

— అవును..... చంద్రాయే! ఆమెకి సేవచేసి తిరిగి ప్రాణం పోశాడు..... చివరికి ఆమెని అతి కష్టం మీద, ఎంతో దూరం ప్రయాణంచేసి ఒక పల్లెటూరికి తీసుకువచ్చాడు.










—ఎక్కడో కూలిన విమానం దగ్గిరే ఆ ప్రాంతం వంటరి వాడొకడు ఉండటం వింతగా లేదూ...

—మేరియన్ కోసం అతనంత కష్టపడటం ఇంకా వింతగా లేదూ! కాని చంద్రా చేసిన పని అదే మిత్రమా...... కావలిస్తే, న్యూస్‌పేపర్ ఫయిళ్లలో చదువు! అందుకనే ఆమె అతన్ని తనతోనే ఉండమంది....

—అతనికి ఇంగ్లీషు రాయటం, చదవటం నేర్పారు... మొత్తానికి ఆమెకి ఎంతో కావలసిన పరిచారకుడయ్యాడు..... మనిషి తెలివికలవాడే అనుకుంటాను......

—ఊఁ.... అతనికి నేనంటే ఎందుకంత ద్వేషం?










—చంద్రాకి నువ్వంటే ద్వేషమా? నాన్సెన్స్!

—ద్వేషమా, భయమా?...... మనశ్శాస్త్రం పుస్తకాలు నెయ్య లేదు కాని ఒక మనిషి కళ్ళను బట్టి అర్థం చేసుకునే తెలివి నాకుంది......

—నో, నో.... అర్థం లేనిదిదంతా!

—సరే, నా అనుమానాలు తప్పేనేమో...... వదిలెయ్యి, ప్రొఫ్!

—కొన్ని మయిళ్ళ అవతల....

(—గార్త్!....గార్త్ ప్రమాదం....!)










—జిమ్మీట్రెంట్ తాలీమ్‌ఖానా...గార్త్ తరుచూ వెళ్ళేచోటు.

—ప్రొఫ్‌కి పెళ్ళా? భలే! ఎలా ఉంటుందావిడ గార్త్?

—అన్ని విధాలా తగిన మనిషి.....

— ఇంతదాకా అడిగి ఉండడు కాని జరిగేది తథ్యం అనుకుంటాను.

—ప్రొఫ్‌గారి మంచికే కదా!

ప్రొఫ్ ఇంటి వద్ద.....

—ప్లీస్, బెర్టీ..... నే నడిగేదేమీ అంత పెద్ద విషయం కాదు.....

—మేరియన్..... నేను.....నేను. నువ్వేమి అడిగినా చేస్తాను..... కాని మన మధ్య రహస్యా లుండ కూడదు.... ఎందుకని నే నడగటం అంత పెద్ద విషయమా?










—నాకు కొన్ని గ్రాముల లూమియమ్ కావాలి బెర్టీ, అంతేగా! నేనేమయినా గూఢచారి ననుకుంటున్నావా?

—లేదు.... వ్యాపారంకోసం గూఢచారివని కూడా అనుకోటం లేదు మేరియన్......

—లూమియమ్‌కి ప్రయోజనం ఇంత దాకా లేదు.... ముందు మాట చెప్పలేము..... ప్రస్తుతానికి అది ఒక వింత పదార్థం అంతే....

—నాకూ తెలుసు! ప్రమాదవశాత్తు నువ్వు కనిపెట్టిన కొంచెం వింత లోహం అది. నా కెందు కివ్వవు?

—ఎందుకంటే, నీ కెందుకు కావాలో నాకు తెలియాలి..... కేవలం లూమియమ్ కోసం నా పట్ల అసక్తి చూపిస్తున్నావా అని ........










—అసలు లూమియమ్ అనేది ఉందని నీ కెలా తెలుసు మేరియన్? నీకు కొంచెం ఇస్తే దానితో ఏమి చేస్తావు?

—మేరియన్ ముఖంలో కలవరపాటు కనిపిస్తుంది......

—నేనా..... నేను...

—బెర్టీ! నాకు తెలీదు! ఎందుకో భయంగా ఉంది! నువ్వంటే నా కెంతో ఇష్టం. కాని నీకే అపనమ్మకం కలిగేట్లు చేస్తున్నాను.....

—భయపడక.... నేనున్నానుగా...

(ఇంకా ఉంది)

## ఆసుపత్రిముందు హత్య

ఢిల్లీలో ఇర్విన్ హాస్పిటల్ ముందు 22 ఏళ్ళ రియాజుద్దీన్ అనే అతన్ని ఇస్లాముద్దీన్ అనే అతను పొడిచి పారిపోయాడట. వెల్లింగ్టన్ ఆసుపత్రిలో చేర్చిన కాస్సేపటికి రియాజుద్దీన్ చనిపోయాడట. హంతకుడు, హతులు యిద్దరూ రాకబ్‌గంజ్ జుమ్మా మసీదు ప్రాంతానికి చెందిన వారేనట. హంతకునికోసం పోలీసుశాఖ గాలిస్తోంది.

## అకాల మృత్యువాత

అకాలమృత్యువు అనేకరూపాల్లో వస్తూంటుం దంటారు. గాలిపటాలు పిల్లలు సరదాకి ఎగుర వేస్తారు. అకాలమృత్యువందులోకి జొరపడితే..... జమ్మూనగరంలకి ముగ్గురు చనిపోయి, ఏడుగురు తీవ్రంగా గాయపడ్డారు. ఉధాంపూర్ జిల్లాలో ఆరుగురు చనిపోయి, తొమ్మిందుగురుగాయ



పడ్డారు. కాతువ జిల్లాలో ఇద్దరు చనిపోయారు. ఇద్దరు గాయపడ్డారు. మొత్తం యీ చని పోయిన, గాయపడిన వాళ్ళందరూ పిల్లలే, తన్మయత్వంలో మేడమీంచో, లేక ఎత్తైన ప్రదేశం నుంచో పడ్డవారే— తిండిగింజలకు శికాణాలేదు మొర్రోఅనే యీ రోజుల్లో కూడా లక్నోలో ఐదు వేలరూపాయల కిమ్మత్తుచేసే గాలిపటాలమ్ముడవుతాయట సుమారు.

* * *

ఫిరోజుపూర్ జైలునుంచి కొంతమంది ఖైదీలను మార్చి 4వ తేదీన వేరొక జైలుకు మార్చినందుకు ఖైదీలు తమ నిరసన తీవ్రంగా చూపించారట. ఎన్ని విధాల నచ్చచెప్పబోయినా వినక, పోలీసులమీద గునపాలూ, రాళ్ళూ, రప్పలూ రువ్వారట. దాంతో పోలీసులు లాఠీచార్జి, మీదుగా భాష్పవాయుప్రయోగానికి, ఆక్కణ్నుంచి కాల్పులకూ వెళ్ళినందువల్ల ఓ, నలుగురు ఖైదీలు చనిపోయారట. ఈ యుద్ధంలో ఎక్కువమంది పోలీసులూ గాయపడ్డారట.




## రవీంద్ర సరోవర్‌లో దానవకాండ

కలకత్తాలోని రవీంద్ర సరోవర్ అనే చోట ఓ సంగీత కార్యక్రమం జరిగిందట. ఈ కార్యక్రమానికి స్త్రీలు కూడా వచ్చారట. తిరామైక్ ఎంటి సౌకర్యాలు ఎక్కువగా లేనందువల్ల సంగీతం ఆరంభమవడానికన్నా ముందే శ్రోతలు గోల ప్రారంభించి, సంగీతం ఆరంభమయినా ఆపలేదట. ఆలోగా కరెంటు పోయిందట. అసలే గొడవ చేస్తున్న శ్రోతల్లో మగవారుకొందరు తమకు అందుబాటులో కూర్చున్న పరాయిస్త్రీల మీద విరుచుకు పడ్డారట. స్త్రీల చీరలువిప్పదీసేశారట. జాకట్లు, బాడీలు చింపి, వూడలాగేశారట. వారిని చెరచారట. ఈ అమానుషచర్య భరించలేని స్త్రీలు భయంతో పారిపోయిపక్కనే వున్న ఏట్లో పడిపోయారట. తెల్లారిఆప్రదేశం చూస్తే ఆ హాలంతా చీరలతోనూ, చిరిగిపోయిన జాకట్లతోనూ, బాడీలతోనూ, పగిలిపోయినగాజుల ముక్కలతోను నిండిపోయివుందట. 'ఇలాటిదానవకాండ జరగడం యిదే మొదలు' అన్నారట పోలీసు కమిషనర్. అంతకన్నా ఏమనగలరెవరైతే మాత్రం!

* * *

పాట్నాలో ఒక స్కూలులో మెట్రిక్ పరీక్ష రాస్తున్న యోగేంద్ర ప్రసాద్ అనే అతను తనని యథేచ్ఛగా కాపీ కొట్టుకోనివ్వని ఉపాధ్యాయుని మీద దవుర్జన్యం చేశాడట. అతని వద్ద కాపీ కొట్టే కాగితాలే గాక, ఓ పెద్ద జాతి విన్న కత్తి వుందట.

* * *

## వరాహావతారం...

మార్చి 26వ తేదీనాడు ఋత్విక్‌ఘటక్ అనే సినిమా డయిరెక్టరు జాధవ్‌పూర్ విశ్వవిద్యాలయం విద్యార్థులకి 'కోమల్ గాంధార్' అనే తమ నాటకం పరిచయం చేస్తూ అన్నారుట గాంధి కిందనుంచి పయిదాకా పంది. ఈనాడు అతన్ని 'జాతిపిత' అని మీదకి ఎక్కించుకుంటున్నాము అని ఈమాటలు కల అతని ప్రసంగం ప్రతిని పంచిపెట్టారుట.., ఇది 19-4-69 'ఆర్గనయిజర్' పత్రికలో పడిన వార్త!

## ప్రియురాలిని వదలలేక కొత్త పథకం

లియాన్ (ఫ్రాన్స్)లో ఒకాయన తన ప్రియురాలి ప్రవర్తన నచ్చక, ఆమెను వదలి వుండలేక ఓవింతపథకం కనిపెట్టాడు. 9వ తారీకున 56 సంవత్సరములు వయస్సుగల గాబ్రియెల్ తన ప్రియురాలిని ఎత్తుకుపోపోడానికి ప్రయత్నించేసరికి తాగిన మైకంలోవున్నపియరీ కోక్వాల్డ్‌కి వెర్రి ఆవేశంవచ్చి గాబ్రియెల్‌ని చంపేశాడట. కానీ, అతని ప్రియురాలు లూయీ ఫ్రాక్సి గాబ్రియెల్ శవంమీదపడి, 'హా ప్రియా ననువదలిపోతివా?' అని ఏడ్వ ప్రారంభించేసరికి మరింత ఆవేశంతో కోక్వాల్డ్ ఆమెతల నరికేశాడుట. అనక తన ప్రియురాలి ఎడబాటుసహించలేక ఆమె తలను ఓ ప్లాస్టిక్ సంచిలో పెట్టి తన కూడా తిప్పుకోనారంభించాడట. 'అతను వుద్యోగరీత్యా వూరూరా తిరిగి సరకులు అమ్మేలట. మధ్యే మార్గంలో యీ సంచి సోదాతో వ్యవహారమంతా బయట పడితే జరిగిన విషయాన్ని అతినే వివరించాడట. ఇతని వయస్సు 38 సంవత్సరాలట.

* * *

జలంధర్‌కు చెందిన కాలా అనే గ్రామానికి చెందిన ఒక అమ్మాయిని రిక్షావాళ్ళు అమానుషంగా చంపారు. మార్చి 20వ తేదీన ఆమె తనొక స్నేహితురాలి యింటికి వెళ్తున్నానని యింట్లో చెప్పి, తన ప్రియుడితో తిన్నగ హోషియార్‌పూర్ వెళ్ళిందట. కూతురు ప్రవర్తన మీద అనుమానం వున్న తండ్రి ఆమెను వెంబడించి, ఇద్దర్నీ ఒక సినిమా హాలు ముందు పట్టుకుని ఆ కుర్రాడిని తల వాచేలా తిట్టి, కూతురుతో యింటికి బయలుదేరాడట. దారిలో కొందరు రిక్షావాళ్ళు అతన్ని అడ్డగించి, ఆమెను ఎత్తుకుపోయి, పొలాలలో ఆమెను చెరిచారట. దాంతో ఆమె అక్కడికక్కడే చనిపోవడంతో ఆ శవాన్ని అక్కడే పారేసి పారిపోయారట. ఇలాటి వారికి ఏ రకం శిక్ష విధించాలి అన్నది మను ధర్మశాస్త్రంలో మటుకుండి వుంటుందా!

* * *

# నిధికి కాపలాగా నల్లత్రాచు

జైపూర్‌కు చెందిన అకోరియాలో చాముండి మాతకు బలిచ్చినది 20 ఏళ్ల కుర్రాడనిపోయిన సారి రాసిన దాంట్లో పొరపాటు దొర్లిపోయింది. మాతకు బజరంగ్ అనే 50 ఏళ్ల వడ్డంగి పనిచేసుకునే అతన్ని బలియిచ్చారు. 'ఇతను బ్రహ్మచారిట. ఈనరబలిలో పోలీసులకు కూడా వాటావుందట. తనకు అధిక వాటాయిస్తేయీ కేసును అణచివేస్తానని పోలీసు సూపరెండెంట్. గోకారియా లంచం పుచ్చుకున్నాడట. పాతర గుప్తధనం నిధి దొరుకు తుందనిచెప్పినప్రదేశానికి పోలీసులు వెళ్లేసరికి. ఓనల్లతాచు ఝుమ్మనివచ్చి బుసలు కొడుతూ ఆవేశంలో పడగనిప్పి కాపలా కాసిందట. నిధులను పాములుకాపాడుతాయి అన్న సామెత ప్రకారం. బలగం చేతులు జోడించి నమస్కరించేసరికి పామువెళ్ళిపోయిందట. ఆశ్చర్య మదంభులు......

* * *

లండన్ రోడ్డు ట్రాన్స్‌పోర్ట్‌లో ఎంతో మంది సిక్కులున్నారు. అయితే యీ సిక్కులు గడ్డాలు వుంచుకోరాదని, తలపాగలు చుట్టుకోరాదని, యూని ఫారం నియమం ప్రకారం వుండాలని చేసిన తీర్మా నాన్ని నిరసిస్తూ బ్రిటన్ సిక్కు కమ్యూనిటీ (సంఘం) లీడర్ సోహన్‌సింగ్ జోలి అనే ఆయన ఆ తీర్మానం తీసివేయకపోతే బ్రిటన్‌లో వున్న సిక్కు లందరూ ఆత్మాహుతి చేసుకోవలసి వుంటుంది. అని ప్రకటించారట. 'ప్రతి పదిహేను రోజులకు ఒక్కొక్కరం చొప్పున మేము ఆత్మహత్య చేసు కుంటాం. ముందు నేను చనిపోతాను. నా వెనుక పదిహేనురోజులకు చనిపోవాల్సిన అతని పేరూ నేనే సూచిస్తాను. అలాగే ఒక్కొక్కరూ తమ తరువాత చనిపోవలసిన వారి పేరు సూచిస్తారు. అంతే' అన్నారట. దాబుణం. సర్పయాగం కన్నా యిది ఘోరంగా వుంది.

# పొరపాటు...!

సూరత్‌లో ఒకాయన రెండు వేల అయిదు వందలు పెట్టి ఓ ట్రాన్సిస్టరు కొన్నాడట. దాని అసలు ఖరీదు 250 రూపాయలేనట. అతడు వంద రూపాయల నోట్లను పది రూపాయల నోట్లను కుని యిచ్చేసి, ఆనక మళ్ళీ వెళ్ళి షాపువాని నడిగే సరికి తర్‌లేదు పొమ్మన్నాడట.

* * *

దాల్మియా నగర్‌కి చెందిన ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్స్ ఆసుపత్రిలోని డాక్టరు ముర్తాజాని కొట్టి చంపేశారట. ఆసుపత్రిలో వున్న ఒక రోగి చుట్టాలకూ, డాక్టరుకూ వచ్చిన ఘర్షణ పెరిగి ఆవిధంగా తేలిందట.

* * *




దాల్మియా నగర్ ఫ్యాక్టరీ రసాయనవిభాగం సూపర్ వైజర్ శ్రీ విజయసింగ్ అనే ఆయన గుండెపోటుతో మరణించారట. ఆయనమరణించ డానికి డాక్టరిచ్చిన మందే కారణమయ్యిందని, తప్పుడు మందిచ్చారని దాల్మియానగర్ వుద్యోగులు ప్రభుత్వ భీమా ఆసుపత్రి ఆవరణలో డాక్టర్ ముస్తజాను కొట్టి చంపేశారట. ఈమధ్య మానవుల్లో ఓరిమి నశిస్తోంది—స్తోందివిటి, నశించింది.

* * *

బలరాంపూర్‌కి చెందిన ఒక కాలేజిలోని యిద్దరు కుర్రాళ్ల మధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గున మండి తగులబడుతోందట. అయితే 'టీ తాగుదాంవస్తావా అని ఒకవిద్యార్థి తన విరోధిని అడిగాడట. అతనికేం చెప్పాలో తోచక తల వూపి కూడా వెళ్ళాడట. ఇద్దరట టీ తాగి బయటికివచ్చారట. వెళ్లొస్తా నని చెప్పి సైకిలు ఎక్కిన ఆవిద్యార్థిని టీ యిప్పిం చిన విద్యార్థి తక్కున కత్తితో పొడిచి చంపే శాడట.



# బలవంతంగా వృద్ధునికి వేసక్టమీ

గోండాకి చెందిన తులసిపూర్‌లో కుటుంబ నియంత్రణశాఖవారు గయిందప్రో అనే ముసలాయన మీద తమ ప్రతాపం చూపించారట. భూములు ఉచితంగా యిస్తున్నామనీ, అలా కావాలంటే ఓ. సంతకం చేయాలనీ చెప్పి ఆయన్ని తమ శిబిరానికి పిల్చుకొచ్చి టక్కున వేసెక్టమీ ఆపరేషను చేసేశా రట. ఆయన దాంతో లబో దిబోమని గోలపెట్టా డట. పెళ్లయి, అత్తారింటికి వెళ్ళిన ఒక కూతురు, ఎదిగిన యిద్దరు కొడుకులు వున్న యీయన భార్య చనిపోయి మూడేళ్ళయిందట. ఏవిటీఘోరం అన్యాయం. అక్రమం, దురంతం, దుర్మార్గం— హూవీటు ఆస్క్?

* * *

మోగాకి 30 కిలోమీటర్ల దూరంలోవున్న ఒక టీ తాగిన పాపానికి ఒకే కుటుంబానికి చెందిన నలుగురు మనుష్యులు గంటలకి హరీ యన్నారట. 17 4—69 ఉదయం తల్లి, ఇద్దరు కొడుకులూ, కూతురూ టీ తాగారుట. ఒక గంటలో నలుగురూ చనిపోయారట.

# టుప్రీంలు

ఢిల్లీలో శ్రీ వెంకటేశ్వరస్వామివారి దేవా లయంలో వెండిపాత్రలు పోయి, ఆశ్చర్యకరంగా మళ్ళీ అవి యథాస్థానంలోనే వున్నాయట.

బొంబాయి కస్టమ్‌శాఖవారు ఒకే యింట్లో 100 కోట్ల విమ్మత్తుచేసే విదేశీ వస్తు సముదా యాన్ని పట్టుకున్నారట. ఇంత పెద్ద మొత్తాన్ని చరిత్రలో ఇంతవరకూ పట్టుకోలేదు. 10 లక్షలు ఖరీదుచేసే 74 వెండి దిమ్మలు, ఓ లక్ష ఖరీదు చేసే టెరిలిన్ బట్టలు యింకా యింకా ఎన్నో దొరికా యట. కొద్ది నెలల్రకితం యిదే యింటిలో బంగారు సోదాలో ఏడు లక్షల ఖరీదుచేసే గడియారాలు దొరికాయట. అన్ని కోట్ల రూపాయలతో స్మగ్లింగ్ చేసే అసాధ్యుల్లో యిద్దరు ముగ్గురు సమిష్టిగా చేరితే దేశాన్నే కొనెయ్యలేరూ!

ఢిల్లీలోని ఒక కంపెనీ తమ కంపెనీకి ఒక అంద మైన ఆడటైపిస్టు, ఆడ ఎకౌంటెంటు కావాలని ప్రకటించిందట. అయితే అందంగా ఉండాలనీ, చక్కగా పరిశుభ్రంగానూ ఉండాలనీ నిబంధనల్లో వుందట—వాట్సర్ దట్ క్లాజ్!

1968 సంవత్సరాంతంనాటికి ఢిల్లీలో 66,552 మంది నిరుద్యోగులున్నారనీ, 1400 మంది పట్టభద్రులున్నారనీ ఆ శాఖ తెలియజేసింది.

# 'కింగ్ కెనే డూనో రాన్గ్' లేక కంచె చేను మేసిన కథ

'అద్దాల యిళ్ళలో వున్నవారు ఇరుగు పొరుగు వారిళ్ళమీద రాళ్ళు రువ్వరాదు' అన్నార టామధ్య శ్రీ కామరాజు అనుభవం అన్న ముక్కలకు అర్థం ఉండకపోదుకదా!

ఆదాయపు పన్ను, ఆస్తి పన్ను శాఖలలో భూకంపం వచ్చి, పెక్కుమంది బయటపడ్డారు.

ఆర్థికశాఖ అంచనాల ప్రకారం శ్రీమతి ఇందిరా గాంధి, శ్రీ దినేష్‌సింగ్, శ్రీ కె. కె. షాగారలు తమ ఆస్థి వివరాలను ఆ శాఖ అంచనాకన్నా చాలాతక్కువ చూపించారట. ముగ్గురిలో ఏ ఒక్కరూ కూడా మూడేసి లక్షలకు ఓ పైసా కూడా తక్కువ చేయ రని ఆశాఖ అభిప్రాయం. అంతా ఒకే తప్పు చేసినా ఎవరెంత చేశారనేదే ప్రశ్న.

శ్రీ దినేష్‌సింగ్ ఎంత లేదన్నా మూడు లక్షల కిమ్మత్తు చేస్తారని విదేశీ వ్యవహారశాఖ మంత్రి అన్నారట దినేష్‌సింగ్ 1962 లో తన ఆస్థి 1 08 లక్షలు తగ్గించి చూపారట శ్రీ కె కె షా 1965-66 లో తన ఆస్థిలో 78 వేలను తగ్గించి చూపారట 67-68 లెక్కల ప్రకారం శ్రీమతి ఇందిరాగాంధి ఆస్థి 3 32 లక్షలట 1965-66 లో ఆమె తన ఆస్థిలో 20,001 రూపాయలు తగ్గించి చూపారట

దేశ ప్రముఖులు ఆస్థి వివరాలను కూకటి

## ఒకవారం విపరీతం

వేళ్ళతో, పాతాళలోకంలోంచి పీకి బట్టబయలు చేసి, బయటకులాగిన ఆ శాఖ ఉద్యోగస్థుల ధైర్య సాహసాలకు మెచ్చుకోవడం, వారి త్రవ్వకంమధ్యలో ఆగిపోయినా ఆశ్చర్యపడకుండా వుండడం ప్రజల వంతు

లోక్‌సభలకి జనసంఘం యం పి శ్రీ కన్వర్ లాల్ గుప్త అడిగిన ఋయానా సంబంధమైన ప్రశ్న లకు శ్రీ మొరార్జీదేశాయ్ మవునం వహించారో, లేక మౌనం వహించారో తెలలేదుకాని, సమాధానం మాత్రం చెప్పలేదు. మొత్తం యీ మహాయ జ్ఞంలో శ్రీమతి గాంధి, ఫక్రుద్దీన్ అహమ్మద్ దినేష్‌సింగ్, సత్యనారాయణసిన్హా, కె. కె. షా, కరన్ సింగ్, పరిమళఘోష్, కె. సి. పంత్, పురుకిన్‌గుహ, సురేంద్రపాల్‌సింగ్ మొదలైన పదిమంది పేర్లు బయటికి వచ్చాయి. అంటే పదిమందే వున్నారని మాత్రంకాదు.

ఆదాయపుపన్ను చట్టం ప్రకారం ఎంత ఆస్థి నయితే పన్ను కట్టకుండా దాచుకున్నారో ఆ మొత్తా నికి నూరునుంచి—రెండు వందల శాతంవరకూ జుల్మానా విధించవచ్చునట మరి శ్రీమతి గాంధి వంటివారలంతా యీ చట్టాన్ని గౌరవిస్తారో లేదో!

తమ ఆస్తులను భార్యలపేరపెట్టి హాయిగా కాలుమీద కాలేసుకు కూర్చున్నవారున్నారు ఢిల్లీలోని మహారాణిభాగ్‌లోని భాలీరామ్ భగత్ భార్యపేరున్న మేడ ఎంత లేదన్నా ఏడు లక్షల ఖరీదు చేస్తుం దని, స్వతంత్రపార్టీకి చెందిన శ్రీ లోక్‌నాద్ మిశ్రా తెలియజేస్తే శ్రీ భగత్‌మాత్రం రెండు, మూడు లక్షలలోపే నన్నారట ఈ యజ్ఞంలోకి ఆయన పేరు మాత్రం ఎక్కలేదు. భార్యల పేర ఆస్తులు వున్న అదృష్టవంతు లింకా ఎందరు వున్నారో!

శ్రీ మొరార్జీ దేశాయ్ తన కిచ్చిన ప్రశ్న లన్నిటికీ కొంతకాలం (అందెంత కాలమో!) లో సమాధానాలు బల్లమీద గుప్పెయ్యగలనని హామీ యిచ్చారట.

చట్టం అంటూ ఏర్పరచాక ఆ చట్టం చుట్టం కూడా దాన్ని మీరకూడదు— కుదరదు కూడా! చైనా దేశంలో నో సామెత వుంది. 'చూపుడు వేలుపెట్టి ఎదుటివానిలో లోపం చూపిస్తే, నీ చేతిలోని మూడు వేళ్ళు వెనక్కి తిరిగి నీలో లోపాన్ని చూసుకో అని అంటుంటాయట.' ఈ సామెత పుట్టుక వ్యర్థం కాదు.

తాము గాజు యిళ్ళలో వుండి.....

దిలీప్ కుమా రివ్వాలి, రాజకపూర్, దేవానంద్ యివ్వాలి, వైజయంతీమాలివ్వాలి, వహిదా యివ్వాలి. యివ్వా లివ్వా లివ్వాలోయ్. అంటుంటే ఎలా!

ఇంకా యిలా ఎంతెంత మంది గాజు యిళ్ళు పగులుతాయో!

వెయిట్ అండ్ సి.

వేచి చూడుము

'కింగ్ కెనెడూనో రాన్గ్' అన్న ముక్క ధైర్యం ప్రెంచి విప్లవంతోనే కొట్టుకు పోయింది.

ఇది ప్రజా ప్రభుత్వం.

అంటే!!!



ఈవ్స్ వీక్లీ గోద్రెజ్ కంపెనీ కలిసి నిర్వహించిన అందాల పోటీలో సింధాల్ సుందరిగా ఎన్నికయిన కుమారి ఊర్మిళ సనందకి మద్రాసు గవర్నరు సర్దార్ ఉజ్జల్‌సింగ్ బహుమతుల నందజేస్తున్నప్పటి చిత్రం. వెనకవున్న ఆమె, పోటీలో ద్వితీయంగా ఎన్నికయిన కుమారి పర్సిస్ పటేల్. తృతీయ స్థానంలో కుమారి కెరొలిన్ లామొలీ ఎన్నికయ్యారు.

## నిధికోసం నరబలి

చౌమాండి మాతకు నరబలి యిస్తే గుప్త ధనం దొరుకుతుందని నమ్మిన 50 ఏళ్ళ బజారంగ్ ఖాటి అనే అతను మరో యిద్దరి సహాయంతో ఒక కుర్రాణ్ణి బలియిచ్చి (టాంక్ జిలా రాజస్థాన్) అకోరియాలో గుప్తధనం కోసం త్రవ్వి, ఆనక భయపడి, పారిపోయారట. బలి యిచ్చిన బాలుని శవం అకోరియా గ్రామంలో ఒక నూతిలో దొరి కిందట. గొంతుకోసి, ఆ నెత్తురుతో దేవికి తర్పణ యిచ్చారట. శవం తలమీద కూడా గాయంవుందట. ఈ నరబలి ఇచ్చేవారిని కఠినంగా శిక్షించకపోతే నరబలులను ప్రోత్సహిస్తున్నంత తప్పు యిక—

* * *

1968 లెక్కల ప్రకారం జపానులో 86921 జంటలు వివాహ రద్దులు పొందాయట.

సౌత్ వియత్నాంకి చెందిన సైగాన్‌లో గత 15 నెలలో 62701 మందికి వెనిరియల్ వ్యాధులు (సుఖవ్యాధుల వంటివి) వచ్చినట్లు లెక్క తేలిందట. వీటిలో 50 శాతం పద్నాలుగు, ఇరవై వయస్సు మధ్యవారికేననీ తేలింది దీని భావమేమి!

# మరోరకం మనిషి

సుమ్మన్



కిటికీ లోనుంచి తోటలోకి చూశాను.

చీకటి వెలుతురు కసితీరా కౌగలించుకొంటు న్నాయి. గాలి వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లుగా ఆగి ఆగి వస్తోంది. ఆకాశం ఎర్రబడి కన్నీటి చారలు పులుము కుంది. బహుశా యిప్పటివరకు ఏడ్చి ఏడ్చి వుంటుంది.

వాతావరణం నాకు చాల ఆనందంగా వుంది.

ఇటువంటి వాతావరణంలో కూర్చోటం నాకు చాల యిష్టం. గంటల తరబడి అక్కడే కూర్చుని ఆనందం, హాయి అనుభవించేవాడిని.

అంతేకాదు, ఇటువంటి దృశ్యమే నాకు ఎప్పుడూ కనబడాలని కోరుకొనేవాడ్ని.

పడకుర్చీ తెచ్చి బయట వేసుక్కూర్చున్నాను.

ఆకాశం వంక చూస్తూ వెనక్కి వాలాను. పడ కుర్చీలో కూర్చున్న వాడెవడూ వెనక్కి వాలకుండా వుండలేడు.

ఇంకా కొంచెంసేపు వుంటే మసిబొగ్గులాంటి చీకటి పులుము కొంటుంది తోటలోనుంచి కీచు రాళ్ళమోత, అక్కడక్కడ మిణుగురు పురుగుల మెరుపులు, గూళ్ళకు చేరిన పక్షులు ఒకదాని నొకటి కోపంతో పొడుచుకుంటూ, మధ్యమధ్యలో విస్పష్టంగా వస్తున్న అరుపులు విని నేను తన్మ యత్వం చెందేవాడ్ని.

అటువంటి తన్మయత్వం నాకు యింకా ఎక్కడా లభించేది కాదు

ఇంకా సూరిబాబు రాలేదనుకుంటూ గేటు మూసి వుంది. సూరిబాబు వస్తే నేను యింత ఆనందంగా కూర్చోటానికి వీల్లేదు. వాడు నన్ను డిస్టర్బ్ చేస్తాడు.

వాడిది వెధవ మెంటాలిటీ

చాల సున్నితమైన ఆడపిల్లల భావాలు వాడివి అసలు వాడు ఆడపిల్లలానే వుంటాడు శరీరం చాల సున్నితంగా, చెంపలు, చేతులు, వేళ్ళు చాల మెత్తగా వుంటాయి. వాడు నవ్వితే ఆడపిల్ల నవ్వి నట్లే వుంటుంది. వాడినడకలో కూడ ఆడతనం కన బడుతూ వుంటుంది.

వాడంటే నాకు చాల కోపం ఎందుకంటే. ఎప్పుడూ ఆనందంగా వుంటాడు, నవ్వుతూ వుం టాడు. వాడినవ్వు చూసి నాకు మండి పోయేది

సున్నితమన్నా, నవ్వటమన్నా చెడ్డ చిరాకు నాకు. నవ్వటం ఓ పోజు. ప్రతివాడూ అదే పోజు పెడ తాడు. వీళ్ళను చూస్తే నాకు భలే చిరాకు

అన్ని విషయాలలోను నేను సూరిబాబు వ్యతి రేకులం నాకు, వాడికి పడదు వాడి అభిప్రాయాలు వేరు. నా అభిప్రాయాలు వేరు. మా యిద్దరి అభి ప్రాయాలు ఏనాడూ, ఏ విషయంలోనూ ఒక్కటి కాలేదు. అయినా యిద్దరం ఒకే గదిలో వుండ గల్గు తున్నాం. అదే ఆశ్చర్యం.

అసలు నాకు సూరిబాబుకి స్నేహం కలిసింది కూడ బహుశా పరస్పర విరుద్ధమైన మనస్తత్వం వలననేమో

మొదటిసారి నేను సూరిబాబు గదిలో వున్నపుడు అసూయ పుట్టింది వాడిని చూసికాదు, వాడి టేబిల్ మీదవున్న బొమ్మను చూసి

ఆ బొమ్మ ఎందుకంత అందంగా వుంది?

నాకు మహా చెడ్డ కోపం వచ్చింది ఇంకా అందం కోసం కాబోలు సూరిబాబు దానిచుట్టూ యిన్ని గులాబీలు పోశాడు.

బోడి గులాబీలలో ఏమి అందం వుంది?

క్షయరోగి కక్కిన రక్తపు ముద్దలులా వుంటాయి ఆ బొమ్మ అంత అందంగా వుండటానికి వీల్లేదు.

సూరిబాబు ఫ్లాస్కులో కాఫీ గ్లాసులో పోసి యిచ్చాడు. వాటిని తాగుతూ మండుతున్న గుండెతో చాలసేపు ఆలోచించాను.

సూరిబాబు ఏదో చెబుతున్నాడు తను జీవితాన్ని చాల హాపీగా గడిపేస్తాడట పువ్వులన్నా, మంచి హృదయమన్నా తనకి యిష్టమట. హాస్యం అంటే చెవి కోసుకుంటాడట (రెండుచెవులు బానే వున్నాయి. ఎప్పుడు కోసుకుంటాడో?) ఏదో చెబుతున్నాడు.

నేను వినటం లేదు.

కాసేపు అలా వాడు ఏకపాత్రాభినయం చేసిన తర్వాత 'ఏదైనా పోదాం, ముఖం కడుక్కొస్తాను' అని బాత్‌రూంలోకి వెళ్ళాడు

టేబిల్ మీద బొమ్మను నేను జేబులో పెట్టేసు కున్నాను. అలా దొంగతనం చేయుటంలో చాల హాయి అన్పించింది నాకు. నా అంతట నేనే నంతో షాన్ని పోగుచేసుకుంటున్నట్లుగా వుంది

తరువాత సూరిబాబు నేను బయటకు వచ్చే శాము. వాడితో అంతకుముందు కంటే చాల ఆనందంగా మాట్లాడాను. వాడితో కలసి పోయి కేరింతలు కొట్టాను.

నా గదిలోకి పోయిన తర్వాత ఆబొమ్మను మరొక సారి చూశాను

ఎందుకింత అందంగా వుండాలి? ఎవడో స్టుపిడ్ చేసుంటాడు తనలో వున్న అసంతృప్తిని తీర్చుకోలేక యిటువంటిదాన్ని తయారు చేసి వుంటాడు

ఫ్రాయిడ్ ప్రకారం వాళ్ళంతా కవులు, శిల్పులు కళాకారులు. కాని నా ఉద్దేశం అదికాదు ధైర్యంలేక స్వజాతి సంపర్కంలో పడి తనలోని బలహీనతల్ని కప్పి పుచ్చటానికి అభినయించే ఓరకం క్రీచర్లు

నాకు రచయితలన్నా, కళాకారులన్నా సదభి ప్రాయం లేదు మరునాడు ప్రొద్దున్నే సూరిబాబు నాగదికి వచ్చాడు ఏడ్పు ముఖంతో. బహుశా రాత్రి

అంతా నిద్రపోయివుండడు కళ్ళు ఎర్రబడ్డాయి ముఖం పీక్కుపోయింది వాడిని అలా చూస్తూ నాలో నేనే ఆనందం పొందాను

'ఫూల్! నిన్న సాయంత్రం సభ్యత తెలియకుండా ఎంత సంతోషంగా వున్నాడు కేరింతలు కొడుతూ ఎగిరి పోయాడు

కాని యిప్పుడు ఆ ముఖం చూడండి

వీడు ఎప్పుడూ యిలాగే వుంటే ఎంత బాగుణ్ణు

'ప్లీజ్ నా బొమ్మ నా కిచ్చేయ్ ఆ బొమ్మ నా ప్రాణం' అన్నాడు సూరిబాబు.

'ఏ బొమ్మ?' అడిగాను

'నిన్న నువ్వు పట్టుకొచ్చిన బొమ్మ.'

'నీకెలా తెలుసు నేను తెచ్చానని?'

'నిన్న నువ్వుతప్ప ఎవ్వరూ నాగదిలోకి రాలేదు నువ్వు ఆ బొమ్మవంక అనేకసార్లు చూడటం గమనించాను నీకది కావాలంటే మరెక్కడయినా కొనుక్కోవచ్చు కాని, దొంగతనం .. ఐ హేట్ యిట్ వెరీమచ్'

నేను పగలబడి నవ్వాను వాడిని చూసి

'బొమ్మ తెచ్చుకోటం తప్పా, ఆ బొమ్మ నాకు కావాలి నువ్వు యివ్వవని నాకు తెలుసు నీకు తెలియకుండా తెచ్చుకోవటంలో తప్పేముంది?'

'తప్పే నేను సహించలేను ఆ బొమ్మ శారద నాకు యిచ్చింది ఆ బొమ్మలో శారదను చూసుకుంటాను ఆ చిలిపి నవ్వులు, అందమైన ముఖం ముందు వున్నట్లుగానే వుంటుంది'

నా కనుబొమలు ముడిపడ్డాయి విసుగ్గా అడిగాను

'శారద ఎవరు?'

'నాకు ప్రాణంతో సమానం చాల అందంగా వుంటుంది ప్రక్క పాపిడి, తెల్లటి పలువరస—కోల ముఖం, అందమైన నవ్వు, చక్కని నడక'

నాకు కోపం మండిపోయింది డర్టీ అందాన్ని గురించి వర్ణించుతున్నాడు రోగ్. గట్టిగా అరిచాను

'ఫూల్! ఐ ఓన్లీ అస్క్ హూయీజ్ శారదా?'

'నా మరదలు వైజాగ్‌లో బియస్సీ చదువుతోంది మేమిద్దరం ప్రేమించుకున్నాం పెళ్ళి చేసుకోవాలను కొంటున్నాం'

అలా చెప్పేటప్పుడు సూరిబాబు ముఖంలో అదోరకమైన తృప్తి నాకు కనబడింది వాడి ఎర్రబడిన కళ్ళలో కూడ నాకు వింత వెలుగు కనబడింది. అది నేను చూడలేను సూరిబాబునే కాదు, ఏ మనిషినీ చూడలేను

ఏడుస్తున్న కళ్ళు ఎంత అందంగా వుంటాయి

'అయితే, ఆ బొమ్మ నీకు కావాలి కదూ?' అన్నాను కొంచంసేపు తర్వాత వాడిలోకి కోపంగా చూస్తూ

వాడు ఆశగా నావంక చూసి 'అవును కావాలి నువ్వు చాల మంచివాడివి యిస్తావని నాకు తెలుసు అందుకే వచ్చాను' అన్నాడు

వాడిచేయి పుచ్చుకొని కిటికీ దగ్గరకు తీసుకువెళ్ళి బయటకు చూపించాను ఎండిపోయిన గడ్డి పరకల మీద ముక్కలు ముక్కలుగా వున్న బొమ్మని చూసి వాడు మారిపోయాడు కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. ఏడుస్తూ అన్నాడు. 'నన్ను చంపేశావ్'

నేనేమీ మాట్లాడలేదు తరువాత వాడు చాలసేపు నాగదిలో వుండి వెళ్ళిపోయాడు. వాడు నా గదిలో వున్నంతసేపు నాకు సంతోషంగానే వుంది ఎందుకంటే వాడు ఏడుస్తున్నాడు గనుక

మళ్ళా ఆరోజు సాయంత్రం నాగదికి వచ్చిన సూరిబాబుని చూసి నేను ఆశ్చర్యపోయాను వాడితో పాటు సూట్‌కేసు, బెడ్డింగ్ వున్నాయి

'ఏమిటి యిలా వచ్చావు?' అడిగాను కనుబొమలు ముడిచి.

'యివ్వాల్టినుంచి నేను నీతోపాటే వుంటాను'

'ఎందుకని? నువ్వు యిక్కడ వుండలేవు?'

'ఇక్కడే వుండగలను నువ్వు ఒట్టి జంతువువి నా స్నేహంతో నిన్ను మార్చివేస్తాను నువ్వు, నీ అభిప్రాయాలు అన్నీ మారిపోవాలి నువ్వు తిట్టినా బయటకు తోసినా వెళ్ళను'

నేను తిట్టలేదు, బయటకు తోయలేదు వాడు నా గదిలోనే వుండసాగాడు

సంవత్సరం తర్వాత కూడ నేను ఏమీ మారలేదు వాడి ప్రభావం నా మీద పడలేదు నేను మారటానికి అందరిలాగ చంచలుడ్ని కాదు నా అభిప్రాయాలు, నా మనస్తత్వం జీవితాంతం మారవు నా అభిప్రాయాల ఆరాధనలోను, నా మనస్తత్వపు నీడలోను నాకు ఎక్కడలేని సుఖం లభించుతుంది ఆ సుఖం చాలదూ బతకటానికి?

నేను చిన్నప్పటినుంచి ప్రత్యేకంగా పెరిగాను బడి వదలిన తర్వాత గేటు తోసుకొని యింట్లోకి వెళ్ళటమంటే విసుగు పుట్టేది. కాంపౌండ్ వాల్ దూకి వెళ్ళేవాడిని. ఎవరు చెప్పింది వినేవాడిని కాదు నాకు తోచిందేదో చేసే వాడిని

చిన్నప్పటినుంచి ఆనందంగా వుండటం నాకు చాల యిష్టం ఆ ఆనందం నాకు జూలాయి వెధవలలా పువ్వులలోనూ, ఆడపిల్లల నవ్వులలోనూ, వాళ్ళ అందంలోనూ కనుపించేదికాదు. ఎవరైనా బాధపడ్తూవుంటే, ఏడుస్తూవుంటే సంతోషించేవాడిని దీర్ఘ వ్యాధితో మూల్గుతున్న వాడిని చూసి హాయిని అనుభవించేవాడిని. కురూపితనాన్ని, దరిద్రాన్ని మోస్తున్న ఆడవాళ్ళను చూస్తే నాకు తృప్తిగా వుండేది పిల్లలు నడుస్తూ జారిపడిపోయి కాళ్ళూ చేతులు విరగ్గొట్టుకున్నా, నిప్పులో చేతులు కాల్చుకొని ఏడుస్తూవున్నా నన్ను నేను మరిచిపోయి చూసేవాడ్ని

ఆడించాలని యింటి చుట్టూవున్న పిల్లల్ని ప్రోగుచేసే వాడిని అందులో కొంతమంది చాల అందంగా వుండేవారు వాళ్ళను చూస్తే నాకు చాల అసూయగా వుండేది ఏమీ తెలియనివాడిలా వాళ్ళను గిల్లే వాడిని కొరికే వాడిని. వాళ్ళు కెవ్వుకెవ్వున ఏడ్చేవారు వాళ్ళు ఎంత ఎక్కువగా ఏడిస్తే అంత ఎక్కువ ఆనందాన్ని నేను పొందేవాడ్ని

ఈ ప్రపంచంలో ఎప్పుడూ సంతోషంగా వుండటానికి వీల్లేదు. ప్రతివాడు బాధతో చావవలసిందే ఆ బాధను చూస్తే నాకు చల్లటి అనుభూతి కల్గుతుంది

నాకు శాటాన్, రావణాసురుడు, ఎఖిల్స్, రాజనాల, ప్రాణ్ అంటే ప్రాణం. వాళ్ళ ఫోటోలు ఆల్బమ్‌లో పెట్టి రోజూ చూస్తూ వుంటాను నాకు మరొక శత్రువు వుంది అది ఆడవాళ్ళ అందం అందంగా వున్న ఆడవాళ్ళను చూస్తే నేను పిచ్చివాడినై పోయేవాడ్ని వాళ్ళ అందాన్ని హత్య చేయాలని, వాళ్ళు చాలా ఘోరంగా చచ్చిపోవాలని అనుకొనే వాడ్ని వాళ్ళు కురూపులుగా మారిపోతే ఎంచక్కా చూడొచ్చు అనుకొనేవాడ్ని.

గేటు తోసిన చప్పుడయింది

ఆలోచనలనుంచి తేరుకొని చూశాను

సూరిబాబు గేటువేసి నా దగ్గరకు వచ్చాడు. వస్తూనే అడిగాడు

'యివ్వాళ ఏమైనా ఉత్తరాలు వచ్చాయా?'

'రాలేదు' అన్నాను వాడి ముఖంలోకి చూసి

వాడి ముఖం జేవురించింది కొంచం నీరసించిపోయాడు

ఆ ఉత్తరం ఎక్కడినుంచి రావాలో నాకు తెలుసు శారద వ్రాస్తుంది రెండురోజులకో ఉత్తరమైనా వీడికి వ్రాస్తుంది ఉత్తరం వచ్చినరోజున కొండెక్కినంత సంతోష పడ్తాడు రాని రోజున కొండ మీదనుంచి పడ్డట్టుగా వుంటాడు

ఈ ఉత్తరాలు వ్రాసుకునే వాళ్ళను చూస్తే నాకు పరమ అసహ్యం ప్రత్యక్షంగా ఏమి చేయటానికి ధైర్యం చాలని వాళ్ళు ఉత్తరాలు వ్రాసుకోటం ద్వారా తీర్చుకుంటారు

సూరిబాబు నాకు ఎదురుగా కుర్చీ లాక్కుని కూర్చుని అన్నాడు 'బహుశా శారద దగ్గరనుంచి యిదే ఆఖరిసారేమో నాకు లెటర్ రావటం'

'ఎందుకని?' అడిగాను

'చెప్పుకో చూద్దాం' తల వెనక్కి చేతులుపెట్టి కాళ్ళు ఆడించుతూ ఖుషీగా అడిగేసరికి నాకు కోపం వచ్చింది

'ఇంకెవడినో ప్రేమించి వుంటుంది కొన్ని రోజులలో వాడితో పెళ్ళయి పోతుంది పెళ్ళయిన తర్వాత వ్రాస్తే ఆ వెధవ ఊరుకోడు కాబట్టి యిప్పుడు ఓ అమర ప్రేయసిలో ఓ పోజుపెట్టి యిన్నిగ్లిజరిన్ కన్నీళ్ళు, వెన్నెళ్ళ ఉత్తరం వ్రాస్తుంది. అందమైన అడదాన్ని నమ్మవద్దని నేను చెప్పాను కాని నువ్వు నమ్మలేదు ఫూర్‌ఫెలో!'

'ఓరి అందమైన ఫూల్! శారద ప్రేమించిన మాట నిజమే. పెళ్ళాడే మాట నిజమే కొద్దిరోజులలో జరిగే మాట నిజమే. అయితే నాతోనే. పెళ్ళయిపోతే ఉత్తరాలు వ్రాసుకోవలసిన పని, నీ గదిలో వుండవలసిన పని వుండదు తెలుసా?' వాడి కళ్ళు మిలమిల మెరిసాయి

వెధవ పోజు, వీడూన్నూ— వీడొక్కడేనా ప్రేమించేది— వీడొక్కడేనా పెళ్ళి చేసుకొనేది - ఏమిటో వెధవ సంతోషం

'ఒరేయ్ శారద నిన్ను మోసం చేస్తే ఏం చేస్తావురా?' అడిగాను

'ఓరి పిచ్చినాన్నా మనిషి రాక్షస సంతతమైన అభిప్రాయాలురా సుఖం అంటే ఏమిటో నీకు తెలియదు [illegible] పువ్వులలోని మెత్తదనం నీకు తెలియదు నువ్వు [illegible]'

నాకు కోపం నెత్తికి అంటింది చితక తన్నుదా మనిపించింది ఎముకలు విరగగొడ్తే పైత్యం కాస్త వదలి పోతుంది. కోపం తమాయించుకొని అన్నాను 'ఒరేయ్ నీలాంటి వెధవల్ని చాల మందిని ఎరుగు దును. ప్రేమ పేరుతో ఎన్ని అడ్డమైన పనులు చేసేది నాకు తెలుసు నాకు ప్రేమంటే నమ్మకం లేదు. నేను ఏ ఆడదాన్ని ప్రేమించను ఏ ఆడ దైనా ప్రేమించానని నావెంటబడితే కాల్చి పారే స్తాను'

'అది నీ ఖర్మ నేనేం చేయను?'

వాడు గదిలోకి పోయి బెడ్‌మీద వెల్లకిలా పడు కొని కొంచంసేపు రూఫ్‌కేసి చూసి కళ్ళు మూసు కున్నాడు

నేను కుర్చీ లోపలకు తెచ్చుకుని వాడివంక చూస్తూ కూర్చున్నాను.

కళ్ళు మూసుకుని వాడు ఆలోచించుతున్నాడు బహుశా, వాడూ శారదా టెక్నికలర్‌లో డ్యూయెట్ పాడుతూ వుంటారు సన్నగా జాలువారుతున్నమంచు క్రింద కౌగలించుకొని పడుకొని వుంటారు

యివేగా కలలు . . . . . . . .

మధ్యలో నవ్వుకొంటున్నాడు చెంపలమీద రంగు తృప్తిగా పులుము కొంటోంది

నాకు చిరాకు ముంచుకొచ్చింది. ఈ వెధవగాడి కలల్ని తలచుకొంటూ కూర్చోటం నాకెందుకు? అసలు వీడి మూలాన నేను తల ఎందుకు చెడగొట్టు కోవాలి?

మళ్ళా కుర్చీని బయటకు యీడ్చుకుపోయి దానిలో కోపంగా కూర్చున్నాను

బయట చీకటి చిక్క బడింది చలిగాలి మం ఱుగా మారటానికి అవస్థపడుతోంది గుడ్లగూబలు ప్రేమించుకుంటున్నట్లుగా పాడుతున్నాయి

# మరో రకం మనిషి

నేను బరువుగా కళ్ళు మూసుకున్నాను

నన్నెవ్వరూ ప్రేమించరు నేను ఎవరిలోనూ కలవను. సూరిబాబుకిలా నాకు ఏ శారదా ఉత్తరాలు వ్రాయదు—

ఎందుకని?

నాలోవున్న లోపం ఏమిటి? నేను బలహీనుడ్నా? సూరిబాబుకంటే శారదకంటే బలహీనుడ్నా? వాళ్ళ దారులకు వేరుగా నేను ఎందుకు ఎడుస్తున్నాను?

వారంరోజులు యిట్టే గడిపిన తర్వాత నేను ఆ గదిలో ఒంటరిగా కూర్చుని ఆలోచించుకొంటు న్నాను మాట మాటకి నాలో నాకు తెలియని అసంతృప్తి ముల్లులా గుచ్చుకొంటోంది

తలుపు తట్టిన చప్పుడయితే వెళ్ళి తలుపు తీశాను. కాకీ గుడ్డలతో దవడలు లోతుకు తోసుకు పోయి జుట్టు చిందరవందరగా పడి చెమటలు కక్కు కొంటున్న పోస్ట్‌మాన్ ఓ కవరు చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు

సూరిబాబు అడ్రసు వుంది పైన

అది ఎక్కడి నుంచి వచ్చిందో యిట్టే గమ నించాను వెనక్కి తిప్పాను. అంటించిన చోట ఎవరూ చింపి చదవకూడదనే సిగ్నల్ కాబోలు పెన్సిలుతో గీతలు గీసి వున్నాయి

ఈ కవరులో సూరిబాబు భవిష్యత్ ఆధారపడి వుంది బహుశా శారదా వాళ్ళ నాన్నని పెళ్ళి విష యం అడిగి వుంటుంది డబ్బు వున్న తన కూతురి పెళ్ళి డబ్బులేని సూరిబాబుతో ఒప్పుకొని వుండడు యిక ఈ జన్మలో మనిద్దరికి పెళ్ళి జరగదని, మరచి పొమ్మని వ్రాసి వుంటుంది

నేననుకున్నట్లుగా జరగకపోతే .

నేననుకున్నట్లు జరిగిపోతే ప్రథమంగా సంతో షించేవాడ్ని నేనే

తలుపులు దగ్గరకు వేసి కవరు చింపాను. అందులో యిలా వుంది.

డియర్ బావా!

నువ్వు వెంటనే బయలుదేరి రావాలి. మన కోరికలు ఫలించాయి నీకు ఆస్తిలేక పోయినా డాడీ నీకు, నాకు పెళ్ళి చేయటానికి ఒప్పుకున్నాడు. మనం ప్రేమించుకున్న విషయం కూడ చెప్పాను. త్వరలో ముహూర్తం కూడ పెట్టించేస్తాడు

డాడీ ఒప్పుకోడేమోనని ఎంతో పరితపించాను. నా కోరికలు ఫలించాయి, ఈ సంవత్సరంలో నేను చాల మారిపోయాను బావా పెంకితనం పోయింది. నన్ను చూసి నేనే ఆశ్చర్యపోయేంత మారిపోయాను. దీని కంతకు కారణం నువ్వే. నాకు లభించే అదృ ష్టాన్ని తలచుకొంటూ పొంగిపోతున్నాను. త్వరలో వివాహ మండపంలో కలుసుకుందాము.

నీ కోసం డాడీ, అమ్మా అంతా ఎదురు చూస్తూ వుంటాము.

నీదాన్ని
శారద

చదువుతున్నంత సేపు నాకు వెర్రెత్తిపోయింది. గుండెలో పెట్రోలు కాలుతున్నట్లుగా వుంది.

ఎవడీ డాడీ వెధవ కూతురికి జవాబు చెప్పుకో లేని చవట వాజమ్మ

చాల సేపు ఆ డాడీగాడ్ని బూతులు తిట్టాను. కవర్ని ముక్కలుగా చించి గదిలో ఓ మూల ప్రోగుగా చేసి అగ్గిపుల్ల గీశాను అవి మండుతూ వుంటే ఎంతో ఆనందం అనుభవించాను చాల హాయిగా నవ్వుకున్నాను

అవి పూర్తిగా కాలిపోయిన తర్వాత మసిని పోగు చేసి బయటకు విసిరాను గాలిలో కలసిపోయేట్లుగా.

సాయంత్రం ఆఫీసు నుంచి రావటంతోనే అడిగాడు సూరిబాబు 'నాకేమైనా ఉత్తరం వచ్చిందా?'

'రాలేదు' అన్నాను ముస్తకరిగా.

'యివ్వాళ కూడ రాలేదా?' వాడి మాటలలో నిరాశ అగుపించింది

'రాలేదు వస్తే నేను దాచుకుంటానా?'

'నువ్వు దాచుకోవు కాని, కాని యివ్వాళ రావలసింది' ఏదో గొణుగుతున్నాడు సూరిబాబు

ఆ రోజంతా వాడు నిరాశగానే వున్నాడు కారి యర్ భోజనం సరిగా తినలేదు రాత్రి సరిగా నిద్ర పోలేదు సిగరెట్లు చాల ఎక్కువగా కాల్చాడు. రాత్రి అంతా దగ్గుతూనే వున్నాడు

వారంరోజులు వాడు లెటరు కోసం ఎదురు చూస్తూనే వున్నాడు కాని వాడికి నిరాశ ఎదు రయ్యేది ఈ వారం రోజులలో వాడు చాల చిక్కి పోయాడు. ఎక్కువగా మాట్లాడేవాడు కాదు

వాడిలో కలిగే మార్పుల్ని నేను ఆనందంగా పరిశీలించుతూనే వున్నాను.

ఓ రోజు వాడు, పెట్టె, బెడ్డింగ్ సరు కొంటు న్నాడు.



'ఏమిటి?' అన్నాను ఆశ్చర్యాన్ని నటిస్తూ. ఇటువంటిది జరుగుతుందని నాకు తెలుసు. అయినా నేను బయట పడలేదు.

'శారద నన్ను మోసం చేసింది. బీదవాడ్ని పెళ్ళి చేసుకోటానికి దాని డాడీగాడు ఒప్పుకొని వుండడు. ఆడదాని విషయంలో యూ ఆర్ కరక్ట్.'

'ఒకవేళ శారద మోసం చేసినా నువ్వు పారి పోవలసిన అవసరంలేదు.'

'నేను బ్రతకలేను. ఈ ఉద్యోగం చేయలేను ఈ స్మృతులు కనుపించని చోటకు వెళ్ళిపోతాను. శారద తరపు నుంచి ఎవరైనా వస్తే చచ్చిపోయా నని చెప్పు.' అని చకచక నా మాట వినిపించుకో కుండానే బయటకు వెళ్ళిపోయాడు.

ఇప్పుడు గది చాల ఖాళీగా వుంది. చాల విశాలంగా వుంది. అటు యిటు గదిలో నాలుగైదుసార్లు సంతోషంగా తిరిగాను.

ఈ ప్రపంచానికంతకూ నేను రాజా అయినట్లు. ఓ బంగారు సింహాసనం మీద కూర్చొన్నట్లుగా ఫీలయ్యాను.

శారద మోసం చేసిందని వీడెక్కడికో పోయి ఆత్మహత్య చేసుకుంటాడు.

ఆ వార్త ఏ డైలీలోనో చదువుతుంటే నాకు ఎంత ఆనందంగా వుంటుంది. సంవత్సరం నుంచి నాలో రేగే మంటలు చల్లారిపోయి ఎంతటి మంచులాటి అనుభూతులు కల్గుతాయి...

కొన్నిరోజులు పోయిన తర్వాత పని వుండి వెళ్ళి అబిడ్స్‌లో ఫుట్‌పాత్ మీద నిలబడి సగం నరుక్కు పోయిన కాళ్ళతో పాకి వెళ్తున్న బిచ్చగాడ్ని చూసి ఆనందించుతున్నాను. వాడి జుట్టు చిందరవందరగా వుంది. సాకటానికి వాడు విపరీతమైన అవస్థ పడుతున్నాడు.

ఇంతలో ఓ చెయ్యి నా భుజం మీద పడింది. ఉలిక్కిపడి చూశాను.

సూరిబాబు నవ్వుతున్నాడు. ప్రక్కనే ఓ సుంద రాంగి నిలబడి వుంది.

నేను ఆశ్చర్యపోయాను. వీడిక్కడెలా వున్నాడు. యింకా చచ్చిపోలేదా? ప్రక్కన ఆమె ఎవరు?

నా ఆశ్చర్యాన్ని గమనించాడు కాబోలు నవ్వుతూ అన్నాడు. 'ఈమె నా భార్య శారద.'

'నమస్తే' అంది శారద.

'నమస్తే' అన్నాను. నా గుండెలలో అగాధం చీల్చుకుపోతోంది.

'మరి?' నసిగాను.

'మరేంలేదు అపుడు నీ గదినుంచి తిన్నగా వెళ్ళి చచ్చిపోలేదు విశాఖపట్నం చేరాను శారద వాళ్ళ డాడీ పెళ్ళికి ఒప్పుకొనే వున్నాడు వెళ్ళగానే పెళ్ళయిపోయింది అంతా రోజులలో జరిగిపోయింది యిన్విటేషన్ పంపలేకపోయాను రా'

నాకేమీ సరిగా వినిపించటం లేదు.

'అప్పుడు శారద నాకు లెటరు వ్రాసిందట, ఎందుకని అందలేదో.'

వాడు నా వంక క్రీగంట చూస్తున్నాడేమో అనిపించి తలెత్తలేకపోయాను.

'ఆ వస్తాను అర్జెంటు పని వుంది. విష్ యూ ఎ హేపీ లైఫ్' అని వాడి చేయి గట్టిగా నొక్కి శారద వంక నిండుగా చూసి దూరంగా ఆగిన బస్సు కేసి చక చక అంగలు వేయసాగాను

చుట్టూ అంతా చీకటి పొరలు పొరలుగా కమ్ము కొంటోంది వెనుక నుంచి శారద, సూరిబాబుల నవ్వుల బాణాలు వీపుకు గుచ్చుకొంటున్నట్లుగా వున్నాయి.

వేగంగా అడుగులు వేసుకొంటూ బస్సుని చేరుకొని జనాల మధ్య నుంచి తోసుకుని ఎవడో ఏడుస్తూ వున్నా లక్ష్యపెట్టకుండా నా బూటుతో వాడి కాలిని కసితీరా నలిపి బస్సు ఎక్కాను.

బస్సు కొంచం దూరం వెళ్ళిన తర్వాత దీర్ఘంగా నిట్టూర్పు విడిచి అనుకున్నాను. 'ఒరేయ్ సూరి బాబూ! సంవత్సరం నుంచి శారద నీకు వ్రాస్తున్న లెటర్లు చాటుగా చదివి నీకు యిస్తున్నానని, వాటిని చదవటం వలన ఎప్పుడూ చూడని శారద రూపం నా గుండెల్లో స్థిరపడి పోయిందని నీకు తెలియదు.'

ఇక ముందెపుడూ తెలియనియ్యను.





# అలవాటా? వెర్రా!

కె. రామలక్ష్మి

ఆదివారం పూట సెలవు ఎలాగా ఉంటుంది. కాని అనుకోకుండా వచ్చిందే సెలవు అనిపిస్తుంది. ఆ పూట హాయిగా స్నేహితులతో కబుర్లు చెప్పుకుంటూనో, చీట్లాడుతూనో, పుస్తకం చదువుతూనో గడిపేద్దామని ఉంటుంది. కాని అయ్యగారి పప్పులేం ఉడకవే. 'కొంచెం పనుందండీ' అంటూ వంగనాచిలా సాగతీస్తుంది. 'ఆ సామాన్ల కొట్టోసారి సర్దుదాం,' అంటుంది హాశోసి మ్మ, ఆఫీసున్నా బాగుండును. ఈ పాముల పుట్టలో పడేకంటే అనిపిస్తుంది.

ప్రతి యింటికీ ఉంటుందో పాముల పుట్ట. కంటికి కనుపించిందల్లా కొందరు అటకమీద పడేసి ఉంచుతారు. కొందరిలా సామాన్ల కొట్లో పారేసి ఉంచుతారు — వాటి అవసరం ఎప్పుడు వస్తుందో అనిపిస్తుంది.

విరిగిపోయిన పిల్లల బొమ్మలు, తెగిపోయి ఇక రిపేరు కూడా గాని జోళ్ళు (కనీసం జతలు కూడా ఉండవు!) ఒకటేమిటి రకరకాలవి కంటి ముందు కదలాడుతా యి

పాత సామాన్లు సర్దడం మొదలు పెట్టేసరికి వస్తారు పిల్లలు — వాళ్ల సామ్మేదో కొల్లకొట్టుకు పోతూన్నట్టుంటుంది కాబోలు ఐదారు సంవత్సరాల క్రిందటి దీపావళి తుపాకి. అదప్పుడే పేలి ఉండదు. విసిరేయ పోతూంటె చేతిలోంచి లాక్కుంటాడు నానిగాడు — 'నాక్కావాలి నాన్నారు' అంటూ. కొంచెం సేపటికి సామాన్ల గదిలో అవతల పారేయవలసినవి ఏం లేవని తేలుతుంది. పాత అట్ట పెట్టె లెందుకు? విరిగిన కుర్చీ ఎందుకు? ఎందుకూ పనికిరాని జోళ్ళెందుకు? చిల్లులు పడిన అల్యూమినియం గిన్నెలు ఎందుకు? పగులేసిన కూజా లెందుకు? విరిగిపోయిన గరిటెకాడలెందుకు? ... చెప్పరేం. కొందరు పాత కాగితలూ, ఉత్తరాలూ కూడా గుత్తిలా గుచ్చేసి దాచేస్తూ ఉంటారు. ఆ కాగితాల్లో అవసరం అయినవీ, పనికొచ్చేవీ అట్టేపెట్టుకుని మిగిలినవి ఎప్పటికప్పుడు ఎప్పుడో చింపేసి ఉండవచ్చు — కాని ఆడవాళ్ళకీ, కొందరు మగవాళ్ళకీ కూడా ఈ దాచడం సరదా ఉంటుంది. ఆ దాచినవాటి ఉపయోగం సంగతి వేరు!

'ఈ పనికిరానివి దాచే అలవాటుకంటే డబ్బు దాచడం చేతనైతే బాగుండును' అని చాలామంది అనుకుంటూనే ఉంటారు. కాని డబ్బెక్కడ మిగులుతుంది దాచడానికి? అందుకే సామానుగది ఏం కాళీ అయిపోతుందో నన్నంత బెంగగా అడ్డమైనవీ దాల్లో దాచేస్తు ఉంటారు. ఇంకా నయం కొందరిళ్ళలో చిరిగిపోయి దూది కారిపోతున్న పరుపులు తలగడలూకూడా






స్టోర్‌రూములో పడేసి ఉంచుతారు — అక్కడ చేరవలసిన దుమ్ముకి తగిన దోహదం ఉండదేమో అన్నట్టు.

దాచుకోవచ్చు. సెంటిమెంటల్ కారణాలుగా ఆడవాళ్లు చాలా దాస్తారు — చిరిగిపోయినా భర్త కొనిపెట్టిన తొలిచీర, రాసిన ప్రేమలేఖలు మొదలైనవి. కాని కాళీ అట్టపెట్టెలు, పాట్ల దారాలు, పాత న్యూసుపేపర్లు, ఎందుకూ పనికిరావి వన్నీ 'ఎందుకేనా పనికొస్తాయి' అన్నట్టు దాచడం ఎందుకు? మళ్లీ ఇల్లు అసహ్యంగా ఉందని మాటి మాటికీ సర్దాలని తాపత్రయపడ్డం ఎందుకు? పాతసామాన్లు ఎంత ఓ గదిలో పారేసినా ఆ గదియింటి అందం చెరిచి తీరుతుంది. సామాన్లు దాచడంలోకూడ ఓ పద్ధతి ఉండాలి. చిన్న చిన్న వస్తువులయితే — ఓ పాకేజీ పెట్టెలో పడే



పత్రికలలో పాఠకుల ప్రశ్నలకు జవాబులిచ్చేది — ఈమే —!!



మ్మాంటే గదంతా చిందరవందరగా ఉండదు నాకు తెలిసిన ఓ స్నేహితురాలు ఇలా చక్కని చదరపు పెట్టెలు నాల్గు చేయించింది. వాటినిండా అడ్డమైన సామినే, కాని చెప్పేగాని తెలియనంత అందంగా తయారుచేసింది పెట్టెలని. పెట్టెమూతకి హాయిగా వో కుషను కుట్టేసింది ముందు గదిలో కుర్చీలతోపాటు ఇవీ ఉన్నాయి. కూర్చుని ఉండగా ఏదో చూపెట్టాలని 'ఓసారిలే' అనేదాకా నే కూర్చున్నది పెట్టెలని తెలియనే లేదు అలా క్లవర్‌గా సామాన్లు అవసరం లేనివి దాచకల్గితే పోనీ అనకోవచ్చుగాని, ఇలా చిందరవందరగా ఓ గదంతా వాటితో నాపడంలో అర్థం లేదు అసలు అవసరం లేనివి నిశ్చింతంగా వదులుకోవడం అలవాటు చేసుకోవాలి. అప్పటికిగాని ఇల్లు ఎప్పుడూ శుభ్రంగా




ఉండడం పడదు. ఒక వస్తువేదేనా కావాలంటే ఈ సామానుల కీకారణ్యంలో వెతికి వేసారినకంటే కొత్తది కొనుక్కోవటం సులభం అనిపించడం చాలామందికి స్వానుభవమే అలాంటప్పుడు దాపరికంలో అర్థం ఏముంది? నీట్‌గా పేక్‌చేసి ఎప్పుడేది కావలిస్తే అది తీయ కల్గితే అర్థం ఉంది. కాని అంత ఆర్డర్ సామానుగది కోసం ఏ గృహిణి నేర్చుకోగలదు? అందుకే అక్కర్లేనివీ, రిపేరు కానివీ, నిశ్చింతగా పారేయాలి. 'వైద్యానికి తుప్ప మేకు కావాలంటే మీఅత్తయ్య నడుగు ఉంటుంది' అని వేళాకోళం చేసేవాడు మామయ్య... నిజమే మరి కొందరాడవాళ్ళు అంత అర్థంలేనివికూడా భద్రంగా దాస్తారు. అది అలవాటా? వెర్రితనమా? ●




అంటే సముద్రం లోతుల్లో ఉండే చేప సముద్రం లోతులు అంటే అంతా ఇంతాకాదు కొన్ని మహా సముద్రాలు 30,000 అడుగుల లోతు కూడా ఉంటాయి (పడేస్తే ఎవరెస్ట్ శిఖరం పూర్తిగా మునిగి పోతుందన్నమాట. అక్కడి పరిస్థితులు చిత్రంగా ఉంటాయి 600 అడుగులుదాటాకనే, క్రమంగా చీకట్లు కమ్ముకుంటాయి ఆ తరువాత లోపలంతా చిమ్మచీకటే రెండోది ఉష్ణోగ్రత లోపలికి పోయిన కొద్దీ తగ్గి, తగ్గి సుమారు నీరు గడ్డ కట్టే ఉష్ణోగ్రతకుచేరుకొంటాయి. భూమధ్య రేఖ దగ్గిరయినా అంతే. ధృవాలదగ్గరయినా అంతే. మూడోది పీడనశక్తి విపరీతమయి పోతుంది. మీదనున్న ఆ నీటి బరువంతా, లోతుకొద్దీ, పీడనశక్తిని అధికం చేస్తుంది. మరో ముఖ్యమైన విషయం, సూర్యకాంతి లేకపోవడంవల్ల వృక్షజాతి కూడా ఉండదు మరి అదీ జీవులన్నిటికీ మూల ఆహారం కదా!

పైన వేలాది అడుగుల మీదనున్న నీటిలో చనిపోయిన జంతువులు భూమ్యాకర్షణ వల్ల క్రమంగా దిగుతాయి. అలా దిగడానికి వారాలు, నెలలు పట్టినా శీతలస్థితిగతులవల్ల కుళ్ళిపోవు వాటినే 'ఊజు'లంటారు అదే అగాధ జీవులకు మూలాహారం చిన్న జీవులు వీటిని తింటే, చిన్న జీవుల్ని పెద్ద జీవులు తింటాయి చేపలేకాక ఇంకా కొన్ని ఇతర జంతువులూ అక్కడ ఉంటాయి.

ఇక్కడి జీవులకు చాలా వాటికి శీతలకాంతి ఉత్పత్తిచేసే శక్తి ఉంది శరీరం మీద రకరకాలుగా ఈ కాంతి అమరి ఉంటుంది ఇంకా కొన్ని చేపలకి తలమీద ఒక 'గాలం' ఉంటుంది. దాని చివర చిన్న దీపంలాగా వెలుగుతోంటుంది అది చూసి కొన్ని ఇతరజీవులు ముచ్చట కొద్దీవచ్చి, దానికి ఆహారం అవుతాయి

ఆ అగాధంలో కంటి ఉపయోగంఉంటుందా? నిజానికి ఉండదు అంచువల్ల చాలా చేపల్ని గుడ్డి అయ్యాయి. కాని కొన్ని మాత్రం కళ్లని అతిశక్తివంతంగా చేసుకొన్నాయి ఆ అగాధంలోని కృత్రిమ మసక కాంతిలో చూడ్డానికి వీలుగా.

అగాధ మత్స్యాల పొట్టలు బాగా సాగుతాయి నోరుకూడా పెద్దది. ఇవి తమకన్నా పెద్ద జీవుల్ని మింగగల్గుతాయి. ఇంకో విషయం స్త్రీ, పురుష మత్స్యాలు, అచీకటిలో కలసి కోవడం కష్టం అవుతుంది. ఎక్కడెక్కడుంటాయో అందువల్ల కొన్ని జాతుల స్త్రీ మత్స్యాలు, పురుష మత్స్యం కనపడగానె శరీరానికి అతికించేసుకొంటాయి. మగది చిన్నదిగా ఉంటుంది ఇంక అది ఆహారం కోసం ఆడదాని మీద ఆధారపడి ఉండాల్సిందే అంటే పారసైటు అన్నమాట

—జమ్మి కోనేటిరావు




**జ రి గి న క థ**

కంట్రాక్టరు సుందరరావుగారు ఐశ్వర్యవంతుడు. ఆయన భార్య శాంతమ్మ వారి ఇద్దరి కొడుకుల తర్వాతది కల్యాణి కల్యాణికి మురళి అటుపడతాడు అతను పేదవాడు వాళ్ల పరిచయం ప్రేమగా మారుతుంది తండ్రి ఆమె కొక పెద్ద సంబంధం తీసుకువస్తాడు. కల్యాణి ఇష్టపడలేదు కొంత డబ్బు తీసుకుని మురళితో మద్రాసు పారిపోవాలనుకుంటుంది ఇద్దరూ కలిసి మద్రాసు వచ్చేస్తారు కొద్దిరోజులకే ఇద్దరికే మనఃకేశాలు వస్తాయి మురళి కల్యాణిని అనుమానిస్తాడు. కల్యాణి సుమిత్రవద్దకి వచ్చి ఆమె సహాయాన్ని కోరుతుంది సుమిత్ర మురళి దగ్గరకు వచ్చి అతన్ని మనోవ్యధ నుంచి తప్పించాలని చూస్తుంది కల్యాణిపై అతని కోపాన్ని పోగొట్టాలన్న ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతుంటాయి.

## 11

స్కూల్‌నుండి వచ్చాక నీరసంగా పడుకుంది కల్యాణి— ఆరోగ్యంలేని ఆమె శరీరాన్ని టీచర్ ఉద్యోగం తినేస్తోంది. లేచి ఏదైనా వండుకోవాలన్నా, తినాలన్నా ఓపిక లేదు కల్యాణికి. తిండిలో ఆసక్తి నశించిపోయింది. కానీ, లేవాలి—తినాలి.

తలుపుమీద నెమ్మదిగా తట్టిన చప్పుడయింది. మురళి వచ్చాడా? ఆరోజు కూడా మురళి తనను చూసాడు రోజూ చూస్తూనే ఉన్నాడు—చూడగానే తిరస్కారంతో తల తిప్పుకున్నా, కొంచెం దూరం వెళ్లాక వెనక్కు తిరిగి చూడకుండా ఉండలేదు.

ఒకరోజు మురళి సరిగ్గా కాలేజికెళ్లే సమయానికే హెడ్‌మిస్ట్రెస్ తనను పిలిచింది మనసు మురళి దర్శనంకోసం తపించి పోతుండగా ముళ్లమీద కూర్చొన్నట్లు కూర్చొని ఆత్రంగా గేటుదగ్గర కొచ్చింది

అంతవరకూ గర్ల్స్ స్కూల్‌కి ఎదురుగా ఉన్న కిళ్లీకొట్లో ఏదో కొంటున్నట్లు నటిస్తోన్న మురళి తనను చూడగానే చటుక్కున తల తిప్పుకొని వేగంగా వెళ్లిపోయాడు.

ఆ రోజు తనకు కలిగిన ఆనందం మురళిని వివాహమాడిననాడుకూడా కలగలేదు.

'తను బ్రతకాలి—తప్పకుండా బ్రతకాలి' —మరోసారి అనుకొంది గట్టిగా—

ఎంతో ఆశతో తలుపులు తెరిచింది.

గుమ్మం దగ్గర నించున్న స్త్రీమూర్తిని చూసి ఆశ్చర్యంతో 'ఎవరమ్మా' అంది—

'నాపేరు సరోజిని—మీ కంటేకూడా పరమ నిర్భాగ్యురాలిని—'

లోపలికొచ్చి కూర్చుంది సరోజిని—

'నేను వసంతరావుగారి భార్యను—'

వంచిన తల ఎత్తలేక ఎలాగో చెప్పింది.

కల్యాణి ముఖం పాలిపోయింది ఒక్కసారిగా గుండెల్లో నొప్పి ఎక్కువ కాగా 'అబ్బా' అంటూ పడిపోయింది—

సరోజిని గాభరాగా కల్యాణిని చాపమీద పడుకోబెట్టి మంచినీళ్లు అందించింది.

'మీ రిలా ఉంటున్నట్లు నాకివాళే తెలిసింది—వెంటనే వచ్చేసాను. మీ కే సహాయం కావాలన్నా— —'

ఆగిపోయింది సరోజిని. తన మాటలు కల్యాణి వినటంలేదు. కల్యాణి కసలు స్పృహ లేదు—

మతిపోయింది సరోజినికి. తలుపులు దగ్గరగా వేసి రిక్షాలో ఎక్కి డాక్టర్ని పిలవటానికి వెళ్లింది.

సరోజిని వెళ్ళిన క్షణంలోనే మురళి వచ్చి విసురుగా తలుపులు నెట్టాడు గుమ్మందగ్గరే నిలబడ్డాడు—

'కల్యాణి!' గట్టిగా పిలిచాడు—

'కల్యాణీ! నన్నిలా క్షోభ పెట్టకు—వెళ్లిపో, ఇక్కణ్ణుంచి—అందరూ నన్ను చూసి నవ్వుతున్నారు. ఎంతో ఉన్నతంగా బ్రతుకుదామని చిన్నప్పటినుండి కలలు కన్న నా బ్రతుకు బూడిదయి పోయింది నాకు మనశ్శాంతి కరువయింది. సౌఖ్యాన్ని గురించి ఆలోచించే సాహసం అసలు లేదు. ఎందుకు ఇంకా ఇంకా నన్నిలా వేధిస్తావ్?'

కోపంగా ఆవేశంగా అన్నాడు—తన మాటలకు ప్రతిసమాధానం రాకపోవటంతో 'కల్యాణీ' అని మరొక్కసారి పిలిచాడు.

కల్యాణిలో చలనంలేదు — గతుక్కుమన్నాడు మురళి—

సందేహిస్తూనే కల్యాణిని సమీపించాడు. నిశ్చలంగా పడి ఉన్న ఆ మూర్తిని చూడగానే కెవ్వున కేకవేసి కల్యాణిమీద వాలిపోయాడు. కల్యాణి ముఖాన్ని తన రెండు

చేతుల్లో పెట్టుకొని 'కల్యాణి!' అని అరిచాడు—ఆమె చెక్కిళ్లు తనచేతుల్లో తున్నాడు—చల్లగా మంచు గెడ్డలా ఉన్నాయి. భరించలేక అస్థిపంజరంలా ఉన్న కల్యాణిని బలంగా గుండెల కదుముకుని ముఖమంతా ముద్దుపెట్టుకున్నాడు—

అతని కన్నీళ్లు కల్యాణి ముఖమంతా తడిపేసాయి—

కల్యాణి నీరసంగా కళ్లు తెరిచింది. తనమీదికి వంగిన వెూళి ముఖాన్నిచూసి ఒక్కక్షణం జరుగుతున్నది కలో, నిజమో తెలుసుకోలేక పోయింది—

కల్యాణి కళ్లు విప్పగానే వెూళి కల్యాణిని వదిలి దూరంగా నించున్నాడు—

ఒక్క నిట్టూర్పు విడిచాడు—

'ఎలా ఉంది కల్యాణి!'

ఆ కంఠంలో మృదుత్వానికి ఆశ్చర్యపోయింది కల్యాణి—

జీవంలేని కళ్లలో ఆనందభాష్పాలు జారిపోతుండగా 'ఇంత సుఖంగా ఏనాడూ లేను—అదృష్టవంతురాలిని—' అంది.

వెూళి కళ్లలో నీళ్లుతిరిగిపోతున్నాయి. చటుక్కున కల్యాణి దగ్గిరగా కూలబడిపోయాడు—

'అలా అయిపోయావేమిటె కల్యాణీ! ఇంతకంటె చావే నయంకదూ!'

అతనికి తెలియకుండానే అతని చెయ్యి శిరసుమీద పడింది

కల్యాణి తృప్తిగా కళ్లు వాల్చుకుంది.

'ఎలాగూ చచ్చిపోతాను - బ్రతకలేను ఇంక ఎక్కువరోజులు.. కానీ— కానీ ...

ఆగిపోయింది కల్యాణి—

'ఏమిటి కల్యాణి!'

ఆత్రంగా ముందుకు వంగాడు వెూళి—సరిగ్గా ఆ సమయంలో డాక్టర్ను వెంటపెట్టుకుని సరోజిని లోపల ప్రవేశించింది.

సరోజినిని చూడగానే విషసర్పాన్ని చూసినట్లు త్రుళ్లిపడ్డాడు. విషజ్వాలలు అతని నరనరాలలోనూ నిండుకున్నాయి బాణంలాగా గదిలోంచి దూసుకుని వెళ్లిపోయాడు—

కల్యాణి తల వాలిపోయింది.

* * *

'వద్దు! వద్దు! నాకు డాక్టర్లూవద్దు పరీక్షలూ వద్దు — వెళ్లిపొండి— అసలు మీరెందుకొచ్చారు?' అరిచింది కల్యాణి—

కల్యాణిముందు రెండుచేతులూ జోడించింది సరోజిని—

'అమ్మా! నా మీద కరుణ చూపించండి—నా సేవను అంగీకరించండి—మీరు నన్ను అనుగ్రహించేవరకు మీ గుమ్మంలోనే పడి ఉంటాను—'

విసుగ్గా కళ్లుమూసుకుంది కల్యాణి—మాట్లాడేందుక్కూడా ఓపిక లేక—

సజీవంగా ఉన్నారన్న సంతృప్తి — కనీసం నా కళ్లకి కనిపిస్తున్నారన్న సంతృప్తి—అంతకంటె నాకే ఆనందమూ లేదు—'

దీనంగా కన్నీళ్లు కారుస్తోన్న సరోజినిని చూడలేకపోయింది కల్యాణి—

ఆవిడ రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకొంది—

'మీ మీద నాకేం కోపం సరోజినీ?



డాక్టర్ వెళ్లగానే సరోజిని కల్యాణి పాదాలమీద తన శిరసునుంచింది.

కల్యాణి తన పాదాలు చటుక్కున వెనక్కు లాక్కుంది.

'ఏమిటది?'

'నన్ను ఆశీర్వదించండి. నన్ను నిత్య సుమంగళిగా దీవించండి — ఈ లోకంలో నాకున్న ఆనందం అదొక్కటే! నా భర్త మీరు కలకాలం సౌఖ్యంగా ఉండాలని మనసారా కోరుకుంటున్నాను '

సరోజిని కళ్లు తుడుచుకుంది.

'మీ మనసు ఇట్లాంటిదని నాకు తెలుసు—మీతో నాకేం పరిచయం లేక పోయినా, ఆనాడు స్పృహతప్పి పడిపోయిన మిమ్మల్ని చూసినప్పుడే నా కెందుకో మీ ముందు ఆయన ఓడిపోయారనిపించింది.

# ఏది సత్యం?...

కేవలం నీచమైన ఒక దురభిమానంతో తన ఓటమిని అంగీకరించటం లేదనికూడా అని పించసాగింది కల్యాణిగారూ! సౌఖ్యానికీ నాకూ సంబంధంపోయి చాలారోజులయిలది. నాకు ప్రేమలో నమ్మకముంది—ఆయనకు అసలు ప్రేమంటే ఏవిటో తెలియదు—కేవలం పాశవిక సౌఖ్యాలను మించిన ఉన్నితమైన భావనలే లేవు. మన వివాహ వ్యవస్థ అంటె నాకు చాలాగౌరవం—ఆయన దృష్టిలో వివాహం సంఘం ఆడుతున్న కపట నాటకం—

కానీ, చిత్రం! ఇప్పటికీ ఆయనను నేను ప్రేమిస్తూనే ఉన్నాను. ఇంత విపరీతమైన విషయలాలస ఆయనకేనాటికైనా ముప్పు తెస్తుందని నాకు తెలుసు—ఆయనకేదైనా కీడు మూడుతుందని ఊహించటానికి భయపడుతున్నాను. అట్లాంటిది సహించలేను—

బాధనణచుకోవటానికి క్రింది పెదవిని పళ్ళక్రిందికి లాక్కుంది సరోజిని—

దీర్ఘంగా నిట్టూర్చింది కల్యాణి—

'నాకు తెలుసు—మనసారా ప్రేమించగలిగే శక్తున్న వ్యక్తులు ఎట్లాంటి పరిస్థితుల్లోనూ, ఏ సందర్భంలోనూ ప్రేమించటం మానలేరు.'

సరోజిని గొంతు విప్పింది మళ్ళీ—

'స్వర్గం కల్పన—నరకం కల్పన—దేవుడు కల్పన—స్త్రీ పురుష సంయోగం వల్ల సృష్టి జరుగుతోంది—శరీరం పెరిగి క్షీణించి శిథిలమై రాలిపోతోంది. అంతే! అక్కడ బోలెడు పుణ్యకార్యాలు చేసి స్వర్గానికెళ్ళి రంభ తిలోత్తమలను అనుభవించేబదులు ఆ సౌఖ్యాలన్నీ సునాయాసంగా ఇక్కడే అనుభవించవచ్చు—' ఇదీ ఆయన వాదన—ఏమనను? తెలియని వాళ్ళకు వివరించవచ్చు—తెలిసిన మూర్ఖులకు ఎవరు చెప్పగలరు? మహా మేధావులు తమ మేధను కరిగించి మానవుడికి అతని జాడ్యతను మరింత గురుతరం చేస్తే విపరీతించిన సిద్ధాంతాలను కొందరు మూర్ఖులు తమ అవసవ్యంగా నాశనం చేస్తున్నారు.'

ఏం చెయ్యలేని అసహాయతతో ఉమ్మివేసింది సరోజిని—

సరోజినిని జాలిగా చూసింది కల్యాణి. అంతలోనే ఏదో బాధ ముల్లులా మనస్సును గుచ్చుకొంది.

దిక్కుతోచని దుర్భరావేదనలో తల మునకలవుతోన్న తనకు రాక రాక అపూర్వంగా ఒక్క మధురమయిన క్షణం తొంగి చూసింది ఆ మాధుర్యాన్నీ ఆస్వాదించీ, ఆస్వాదించకముందే సరోజిని రాకతో అది జారిపోయి తనను చుట్టిన విష వలయంలో కలిసిపోయింది—

అందుకు సరోజినిని ద్వేషించాలా?

సరోజిని భుజంమీద బలహీనంగా ఉన్న తనచెయ్యి వేసింది కల్యాణి.

'సరోజినిగారూ! ఇవాళనుండీ మనిద్దరం స్నేహితులం—రేపటినుండీ మీకు వీలయినప్పుడల్లా వస్తూ ఉండండి—మీ జీవితం ఆనందమయం కావాలని నా మనసుకున్న శక్తి అంతటితోనూ కోరుకుంటున్నాను—నిర్మలమయిన మీ కళ్ళలో సంతోషరేఖలు చూసిననాడు నాకంటె ఎక్కువగా ఎవరూ ఆనందించరు—'

సరోజిని తృప్తిగా నిట్టూర్చింది.

* * *

ఎంతకూ వసౌళి భోజనానికి రాకపోయేసరికి మళ్ళీ ఏమయిందోనని కంగారు పడుతూ సుమిత్ర వసౌళి దగ్గరికి నడిచింది.

ఏదో పుస్తకం గుండెలమీద బోర్లా పడేసుకుని కళ్ళుమూసుకుని పడుకున్నాడు వసౌళి—

అతని ముఖం వడిలిపోయి ఉంది.

నెమ్మదిగా వసౌళి గుండెల విూంచి పుస్తకం ఇవతలకు లాగేసింది సుమిత్ర—

వసౌళి కళ్ళు తెరిచాడు.

'భోజనానికి లేవండి — ఏమిటలా ఉన్నారు?' మృదువుగా అడిగింది.

సమాధానం చెప్పకుండా వసౌళి సుమిత్ర వంక రెప్ప వాల్చకుండా చూడసాగాడు.

'ఏవిటలా చూస్తారు? లేవండి....'

వసౌళి లేవలేదు—సుమిత్ర చెయ్యి పట్టుకుని తనమీదకు లాక్కున్నాడు—

'నిన్ను పెళ్ళిచేసుకుంటాను సుమిత్రా! ఇవాళ కల్యాణి దగ్గర్నుంచి వచ్చాక ఈ నిర్ణయానికి వచ్చాను.'

'కల్యాణి ఇక్కడుందా?'

ఆశ్చర్యం నటించింది సుమిత్ర—

'నీకు తెలీదా?' నమ్మలేనట్లు అడిగాడు—

'ఊహు! తెలిస్తే ఇంకా ఇక్కడుంటానా? కల్యాణి కర పట్టుకోదూ!'

'తెలిసే నామీది ప్రేమతో ఉన్నావనుకున్నాను'

సుమిత్ర కళ్ళు వెలిగాయి.

'నా ప్రేమ మీరు స్వీకరించ గలరా?'

'ఇన్నాళ్ళూ స్వీకరించలేననే అనుకున్నాను. కానీ, ఇవాళ కల్యాణి ఇంటి నుండి వచ్చాక ఈ లోకంలో నాకు మిగిలింది నీ ప్రేమ మాత్రమే అనిపించింది—'

'కల్యాణి దగ్గరకెళ్ళారా?'

చటుక్కున ముఖం తిప్పుకున్నాడు వసౌళి.

'ఈ ఊళ్ళోంచి వెళ్ళిపొమ్మని అడగటానికి వెళ్ళాను తనిక్కడ ఉండటం నాకు దుర్భరంగా ఉంది.'

సుమిత్ర లోలోపల నవ్వుకుంది.

కల్యాణిని చూడకుండా ఉండగలగటం వసౌళికి శక్యంకాదు — ద్వేషంతోనైనా కల్యాణిని తలుచుకోవలసిందే! దెబ్బలాడటానికైనా కలుసుకోవలసిందే! లేకపోతే బ్రతకలేడు. ఎక్కడున్నా కల్యాణి వసౌళిని ఉచ్చువేసి తనదగ్గరకు లాక్కొంటుంది. ఇవన్నీ కుంటి సాకులు.

వసౌళి మనసు భగభగలాడిపోతుంది.

సరోజిని డాక్టర్ను తీసుకొచ్చింది!

అంటే వసంతరావు డబ్బుతో కల్యాణికి వైద్యం జరుగుతోంది—కల్యాణి అంగీకారం లేకుండా ఎలా జరుగుతుంది?

ఇలాటి కులటను తను ప్రేమించటం మానలేక పోతున్నాడు ఎంత దూరం చేసుకోవాలనుకుంటున్నాడో, అంతగా తన భావనలో ఒక భాగమైపోతుంది.

తనకు విముక్తి కావాలి— అప్పుడు కానీ తనను దహిస్తోన్న ఈ అశాంతి దూరం కాదు.

'భోజనానికి లేవండి—'

మరోసారి హెచ్చరించింది—

'నువ్వు నన్ను పెళ్ళిచేసుకుంటానంటే కాని అన్నం తినను—'

పసిపిల్లాడిలా మారాం చేసాడు—

'వహ్వా! ఎంత ముద్దుగా ఉంది? లేవండి—లేవండి— మీరు తప్ప నాకు దిక్కెవరు? ఇన్నాళ్ళు మీ దగ్గరున్న నన్నెవరు

# ప్రతి పంట నుండి అధిక లాభాలను పొందే విధము

## చదవండి:

ఇది చాలా సులభం ప్రతి పంట ఎక్కువగా వుండి, రకం బాగుంటే
లాభాలు కూడా అధికంగానే వుంటాయి గదా మీ ప్రతి పంటలను,
వాటిని నాశనము చేసే చీడ పురుగుల నుండి రక్షించుకొంటే,
మీకు అధికంగా లాభాలు వస్తాయి

తవుటి పురుగులు, కాయలను తినివేసే పురుగులు, 'కట్‌వరమ్స్' పాండా
'జాసిడ్స్' మొదలగు చీడ పురుగులు మరియు కీటకముల నుండి
పంటలకు మంచి రక్షణ నిచ్చే మార్గము ఇదిగో: హీలియోటాక్స్
క్రిమి సంహారక మందును జల్లండి! ఇది ఎంతో బాగా పనిచేస్తుంది.
ఒక సారి హీలియోటాక్స్ జల్లితే, వర్షాలు కురిసినా,
చీడ పురుగులను నాశనము చేసే దాని శక్తి తగ్గదు

ఇప్పుడే హీలియోటాక్స్ కొనండి 1 మరియు 5 లీటర్ల డబ్బాలలో
సులభంగా లభిస్తోంది. మీ స్థానిక డీలరును గాని, దగ్గరలో వున్న
రాలీస్ శాఖస్థుల గాని అడగండి.

# హీలియోటాక్స్

మీ ప్రతి పంటలకు,
రక్షణనిచ్చే క్రిమిసంహారక మందు

పూర్తి వివరములకు మీకు దగ్గరలోవున్న
రాలీస్ శాఖస్థుల అదగండి

**నౌరోస్‌జీ వాడియా & సన్స్ (ప్రైవేట్) లిమిటెడ్**
నెవిల్ హౌస్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి-1
—యు ఎస్ ఎ లోని హెర్క్యులిస్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
ఏకైక దిగుమతిదార్లు



# ఏది సత్యం?...

చేసుకుంటారు? తనెన్ని తిరుగుళ్ళు తిరిగినా, తన భార్య మాత్రం పరమ పతివ్రతా శిరోమణి కావాలనుకొనే పురుష పుంగవులతో కూడిన సమాజం మనది—'

సుమిత్ర ఉద్దేశించకపోయినా, ఛెళ్ళున తగిలింది వరౌళికి— ముఖం పాలిపోయింది.

ఒక్క మాట లేకుండా భోజనానికి కూర్చున్నాడు. పాలిపోయిన వరౌళి ముఖం చూసి కలవరపడింది సుమిత్ర — తనన్న దాంట్లో అంత బాధ పడవలసిందేవిటో అర్థం కాలేదు—

సాహసించి అంది.

'మిమ్మల్ని మీరు మోసం చేసుకొంటున్నారు. మీరు కల్యాణిని ప్రేమించినంతగా మరొకర్ని ఎన్నటికీ ప్రేమించలేరు. మీ మధ్య ఇలాటి అపార్థాలు రావటానికి ఏం జరిగిందో నాకు తెలీదు. ఏం జరిగినా కల్యాణికి మీరే ప్రాణం. ఎందుకు మీరిద్దరూ ఇలా విడివిడిగా ఉండి మిమ్మల్ని మీరు హింసించుకొంటున్నారు? జరిగింది మరిచిపోయి సుఖంగా ఎందుకుండకూడదూ?'

వరౌళి తింటున్న కంచంలో చెయ్యి కడిగేసుకున్నాడు తెల్లబోయి చూస్తున్న సుమిత్ర తేరుకునేలోపలే పడకగది లోపలికెళ్ళి తలుపులు రెండూ లోపల వేసేసుకున్నాడు — సుమిత్ర ఎంత బాదినా ఆ తలుపులు తెరవబడలేదు.

బ్రాందీ సీసాల చప్పుడు మాత్రం తెగ వినిపించింది. ఆ రాత్రి తప్ప తాగాడు వరౌళి—

మూసిన ఆ తలుపులకేసి తల కొట్టుకుంది సుమిత్ర.

* * *

ఆత్రంగా కిటికీ దగ్గర నిల్చొని వళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తూ నిలుచుంది కల్యాణి.

వరౌళి వస్తున్నాడు. చటుక్కున రోడ్డుమీది కొచ్చేసింది. వణికే కంఠంతో 'వరౌళీ!' అని పిలిచింది.

ఆగిపోయాడు వరౌళి. దగ్గరగా వచ్చింది కల్యాణి, 'ఇవాళొక్కసారి నా ఇంటికి రండి. ఈ ఒక్కరోజుకే!'

వరౌళి కళ్ళల్లో నిప్పులు కురిసాయి.

'నువ్వు పిశాచానివి. నా పాలిటి యమదూతవి ఎందుకు నన్నిలా పీడిస్తావు? నీ సమక్షంలో గడిపే ప్రతి క్షణమూ నాకు కోటి కోటి నరకాలుగా మారిపోతుందని తెలియదూ నీకు? నీకు బాధ లేదు అవమానం లేదు. సిగ్గులేదు— మానవత్వమే లేదు. లేకపోతే నన్నిలా హింసిస్తావా?'

కల్యాణి తలవాల్చుకుని స్కూల్‌కేసి నడిచింది. తోటి టీచర్లు ఒకళ్ళ ముఖాలవంక ఒకళ్ళు చూసుకుని నవ్వుకొంటున్నారు.

ఆ చిన్న గ్రామంలో కళ్యాణి సంగతి తెలీనివాళ్ళు లేరు స్వయంగా శివరామయ్యగారు వేయించిన ఉద్యోగం గనుక ఉద్యోగానికి మాత్రం భంగంలేకుండా పోయింది, కాని అందరికీ కల్యాణంటే చిన్న చూపే! కానీ, వాళ్ళనవ్వులూ, హేళనలూ, వ్యంగ్య సంభాషణలూ తిరస్కారాలూ అన్నీ వృధాయే! కల్యాణికి వాళ్ళు తనను చూసి నవ్వుతున్నారనికూడా తెలీదు. ఆ టీచర్స్‌లో ఎవరికే సహాయం కావలసినా కల్యాణి సిద్ధం— కల్యాణిని సహాయం కోరటానికి వాళ్ళకెవరికీ సంకోచం కలగదు — మంచితనాన్ని పిచ్చితనంగా అర్థం చేసుకునే మూర్ఖులు తక్కువలేరు అట్లాంటి మూర్ఖుల దృష్టిలో కల్యాణి పిచ్చిది.

కల్యాణి స్కూల్‌కి చేరేసరికి గంటయిపోయింది. అయిన ఆలస్యం కొన్ని నిముషాలే! అయినా హెడ్‌మిస్ట్రెస్ ఊరుకోలేదు—

'మిసెస్ కల్యాణి! పిల్లలకు చెప్పవలసిన తశలోఉన్న మనమే ఇలా ప్రవర్తిస్తే మర్యాదగా ఉండదు. ఒకప్రక్క బెల్ మయిపోయినా మీరెందుకు బయటి కెళ్ళారు?'

కల్యాణి సమాధానం చెప్పలేదు—

'నాకు సమాధానం కావాలి—' అధికారంతో గర్జించింది హెడ్‌మిస్ట్రెస్ శ్యామలాదేవి

'మీకు చెప్పవలసిన విషయం కాదు'

'ఇంకొకసారి ఇలా చెయ్యకండి— ఈసారికి ఊరుకొంటున్నాను. అదీగాక సరిగ్గా కాలేజి తెరిచే సమయానికి మీరలా కిటికీదగ్గర నిలబడటం చాలా అసభ్యంగా ఉంటుంది. నేను చెప్పవలసి వచ్చినందుకు బాధపడుతున్నాను సిగ్గుపడుతున్నాను. కానీ చెప్పక తప్పదు— ఇకముందు మీరిలా కిటికీ

దగ్గర నిలబడి రోడ్డువెంట యావగా చూడటం మానెయ్యాలి.'

'ఉహూ! మానలేను'

శాంతంగా నిర్లిప్తంగా సమాధానం చెప్పింది.

అదిరిపడింది శ్యామలాదేవి. అలా సమాధానం చెప్పినందుకు — తనను ధిక్కరించి నందుకు—

'ఇది పాఠశాల. వేశ్యాగృహం కాదు—' తీక్ష్ణంగా అంది

'పాఠశాల కాకపోతే నేనెందుకొస్తాను?'

శ్యామలాదేవి క్రోధాహంకారాలు రెచ్చిపోయాయి.

'వళ్ళు దగ్గరపెట్టుకొని మాట్లాడు. ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?'

'నాపాటి మనిషితో మాట్లాడుతున్నానని అనుకుంటున్నాను—'

'నోర్మూయ్యి—'

గర్జించింది శ్యామలాదేవి

'దీని ఫలితం అనుభవిస్తావు.'

'సరే! అలాగే అనుభవిస్తాను—'

శాంతంగా లేచి వెళ్లిపోయింది కళ్యాణి.

కోపంతో పళ్ళు పటపట నూరుకొంది శ్యామలాదేవి—

వగౌళి సమాధానంతో కృంగిపోయిన కళ్యాణివి శ్యామలాదేవితో ఘర్షణ మరింత కృంగదీసింది. క్లాసులో పాఠం చెప్పలేక పోయింది. తమ టీచర్ అసమర్థతను పిల్లలు పూర్తిగా వినియోగించుకున్నారు కాకిగోల ప్రారంభమయింది.

అకస్మాత్తుగా శ్యామలాదేవి రాకతో పిల్లలంతా చటుక్కున నోళ్ళు మూసుకుని లేచి నిలబడ్డారు.

'మిసెస్ కల్యాణి! ఏవిటిది? ఇలాగేనా క్లాస్ తియ్యటం?'

ఉరిమింది శ్యామలాదేవి—

'నాకు వంట్లో బాగుండటం లేదు—'

'బాగుండకపోతే రావటం మానెయ్యాలి ఇదా పద్ధతి? ఇలా పనిచేస్తే స్కూల్ ముందుకొస్తుందా? పిల్లలకు భయభక్తులుంటాయా? కనీసం నెలనెలా జీతం తీసుకొంటున్నామన్న ధ్యానమైనా ఉండాలి—'

విసురుగా వెళ్లిపోయింది శ్యామలాదేవి

శ్యామలాదేవి మాటలు కల్యాణిని కొంచెం కూడా బాధించలేదు. భయంకరమైన తుఫాను నడిమధ్యలో ఉన్న వ్యక్తిమీద 'ఎవరైనా కొంచెం నీళ్ళు చిలకరిస్తే ఆ వ్యక్తికి కలిగే కష్టం ఏ పాటిదీ?

* * *











## ఏది సత్యం?...

తల పగిలిపోతోంది. కల్యాణికి—ఎనిమిదవ నెలకూడా ప్రవేశించింది. రిక్షాకు డబ్బులేవు—అడుగులో అడుగు వేసుకుంటూ అతి కష్టంమీద ఈడ్చుకొంటూ ఇంటికి చేరుకొంది. గుమ్మంలో నించున్న వసౌళిని చూసి ఒక్కసారి ఆనందం పట్టలేక అతని పాదాలదగ్గర కుప్పకూలి పోయింది.

'కల్యాణీ!' అన్నాడు గాభరాగా వసౌళి—మాట్లాడే శక్తిలేక తాళంచెవి అందించింది కల్యాణి వసౌళి తాళం తెరిచాడు. కల్యాణిని లేవనెత్తి ఇంట్లోకి నడిపించాడు. గడపమీద కూర్చున్నాడు. వసౌళి పాదాలమీద తలపెట్టి తనచేత్తో అతని పాదాల నత్తేసుకొంది కల్యాణి. వెనక్కు లాక్కోబోయాడు వసౌళి—

'వద్దు వద్దు మిమ్మల్నేమీ అర్ధించబోవటం లేదు ఒక్కక్షణం అలాగే ఉండండి - అంతే నేను కోరుకునేది నాకింకేదీ అక్కర్లేదు -'

కరువుతీరా వసౌళి పాదాలను తన చేతుల్తో తడిమి తడిమి హృదయానికి హత్తుకొంది కల్యాణి లేవలేక లేవలేక లేచింది.

'క్షమించండి - మీకెంత కష్టం కలిగించాను? మీరెంత మంచివారు? ఎంత దయగలవారు? నేనంటే మీకెంత అసహ్యమో నాకు తెలుసు—అయినా నామీద దయతలచి వచ్చారు! ఇది ఆఖరుసారి—ఇంకమీదట మీకిలాంటి కష్టం కలిగించను—'

ఆయాసపడిపోయింది కల్యాణి.

పెద్ద కడుపుతో పుల్లలా వున్న కాళ్ళూ చేతులతో, జీవంలేని కళ్ళతో ఆయాసపడిపోతున్న కల్యాణిని చూడలేకపోయాడు వసౌళి. చటుక్కున లేచాడు.

'ఆగండి—ఆగండి—వెళ్ళకండి—ఒక్క క్షణం ఆగండి—' లేచి తన పెట్టెలోంచి టెరికాటన్ పాంటూ టెరికాటన్ షర్టూ తీసి వసౌళి కందించింది.

వసౌళి కళ్ళు ఎర్రబడ్డాయి

'ఏమిటిది?'

'ఇవాళ మన మేరేజ్ డే! మీకు నా బహుమతి కాదనకండి—మళ్ళీ ఇలాంటిరోజు నేను చూడగలనో? లేదో? నా సంతృప్తికోసం తీసుకోండి—'

తుళ్ళిపడ్డాడు వసౌళి—ప్రతిదాన్నీ చివరకు తనను తనుకూడా మరచిపోతున్న వసౌళి తమ మారేజ్ డే గూడా మరిచిపోయాడు—ఇదివరలో ఎన్నో సార్లు తనూ కల్యాణి తమ మేరేజ్ డే ఎలా గడపాలో అని వేసుకున్న రకరకాల ప్లాన్లు గుర్తు వచ్చాయి. డబ్బులేక ఇబ్బంది పడినన్నాళ్ళు పడ్డారు. ఇప్పుడిక డబ్బు ఇబ్బంది లేదుగనుక రెండురోజులు ముందుగానే బయలుదేరి ఏ కాశ్మీర్‌లాంటి సుందర ప్రదేశంలోనో ఆరోజు గడపాలని ఎన్నెన్నో అనుకున్నారు

నడవలేక నడవలేక కల్యాణి వడుచు కొంటూ రావడం వసౌళి మనోపథంలో మెదిలింది.

అవును ఇంత ఖరీదైన బట్టలు కొన్నాక కల్యాణిచేతిలో రిక్షాడబ్బు లెలాఉంటాయి?

వసౌళి కదిలిపోయాడు ప్రేమా, దుఃఖమూ ఉప్పెనలా అతని నావరించాయి.

ఆ నిర్భాగ్యురాలికి తనేవిధంగా తృప్తి కలిగించగలడు?

'కల్యాణి! ఏమైనా ఉంటే పెట్టు. ఆకలేస్తోంది'

కల్యాణి ముఖం ఒక్కసారి వెలిగి అంతలో ఆరిపోయింది—

'అయ్యో! దౌర్భాగ్యురాలిని — ఇంత అదృష్టాన్ని ఊహించుకోలేదు మీరు నా చేతులతో వండింది తినరని ఏదీ చెయ్యలేదు.'

'నాకోసం ప్రత్యేకంగా ఏం చెయ్యకపోయినా పరవాలేదు— నీకోసం వండుకున్నదే పెట్టు—పోనీ అన్నం వడ్డించెయ్యి—'

కల్యాణి బిక్కుబిక్కుమంటూ చూసి తలవంచుకొంది.

'ఏమిటి?' వసౌళి స్వతంత్రంగా లేచి లోపలికెళ్ళి చూసాడు—రెండు ఎల్యూమినియం గిన్నెలు శుభ్రంగా తోమి ఉన్నాయి. ఎక్కడా కుంపటి ముట్టించినజాడ లేదు—

అర్థమయింది వసౌళికి—కల్యాణి దగ్గరగావచ్చి కల్యాణి శిరసుమీద చెయ్యేసి 'లే కల్యాణి! త్వరగా వండు! నేను కూరలు తెస్తాను' అంటోనే తన కన్నీళ్ళు కల్యాణి కంటపడటం ఇష్టంలేక గబగబ బయటికెళ్ళిపోయాడు—

కల్యాణి కెక్కడలేని బలమూ వచ్చింది, కుంపటి అంటించి ఎసరు పడేసింది.

వసౌళి బంగాళదుంపలూ, రకరకాల స్వీట్స్, పళ్ళూ తెచ్చాడు—

'కల్యాణి! ఆ బంగాళదుంపలు వేయించు చాలు, ఇంకేం చెయ్యకు—స్వీట్స్ తెచ్చాను. పళ్ళు తెచ్చాను'

కల్యాణికి వళ్ళు తెలీటంలేదు—ఎన్నాళ్ళ తర్వాతో వసౌళికి తన చేతులతో వడ్డిస్తోంటే ఆనంద భాష్పాలు జాలువారిపోయాయి వసౌళికి కూడా చాలా హాయిగా అనిపించింది—ఎంతో సంతృప్తిగా తిన్నాడు —

తను తెచ్చిన రెండు కిళ్ళీలలో ఒకటి కల్యాణికిచ్చాడు—ఒకటి తను వేసుకున్నాడు.

కల్యాణిలో ఈనాడు అందమన్నది లేదు. అయినా వసౌళికి కల్యాణిని చూస్తుంటే రక్తం ఉరుకులెత్తి ప్రవహించసాగింది తననంత ప్రేమిస్తోన్న అందమైన సుమిత్ర కూడా ఇంతటి సంచలనాన్ని కలిగించలేదు ఎన్నడూ——

దీర్ఘంగా నిట్టూర్చి 'అసంభవం కల్యాణి!' అన్నాడు

కల్యాణి తెల్లబోతూ 'ఏది అసంభవం?' అంది—

'నేను నిన్ను ప్రేమించకుండా ఉండగలగటం...'

కల్యాణి ముఖం వెలిగిపోయింది. ఈ సంగతి కల్యాణికి తెలుసు—కానీ వసౌళి స్వయంగా ఒప్పుకోవటంతో ఆనందం పట్టలేకపోయింది.

'చాలు! ఇది చాలు నాకు! నేను అదృష్టవంతులందరిలో అదృష్టవంతురాలిని—'

'కల్యాణి! ఒక్కవిషయం చెప్తాను, ఒప్పుకుంటావా?'

'ఏమిటి?'

వసౌళి కొన్నిక్షణాలు తటపటాయించాడు—

నీకు ప్రసవం కాగానే వసంతరావు బిడ్డను వసంతరావుకిచ్చేసి నా దగ్గరకొచ్చెయ్యి—నువ్వు లేని జీవితం నాకు లేదు. ఇప్పుడు నిన్ను భరించలేను అంత శక్తి లేదు నాలో......'

కల్యాణి నవ్వింది—అదే నవ్వు—జీవితపు అవతలిగట్టు చేరుకున్న వ్యక్తి జీవితాన్ని చూసి నవ్వే నవ్వు—

బిత్తరపోయాడు వసౌళి.

(ఇంకా ఉంది)




దేవతల గురువైన బృహస్పతి దగ్గర శిష్యుడుగా చేరిన శశాంకుడు గురుభార్యతో అక్రమ సంబంధంకలిగి వుండెననీ కొన్నాళ్లకు చంద్రుడు తారను తీసికొని వెళ్లిపోయెననీ, వారిద్దరికీ బుధుడు అనే కుమారుడు కలిగాడనీ, తారను బృహస్పతికి అప్పగించడానికి చంద్రుడు తిరస్కరించగా దేవతలు అతనిమీదికి యుద్ధానికి వచ్చారనీ శశాంకుని పక్షాన రాక్షసులు చేరారనీ, యుద్ధంలో సర్వనాశనమయేస్థితి యేర్పడగా - ఎలాగో రాజీ కుదిరిందనీ, చంద్రుడు బుధుణ్ణి తన దగ్గర వుంచుకుని తారను బృహస్పతికి యిచ్చివేశాడనీ ఒక కథ ప్రసిద్ధంగావుంది ఇది నీతిబాహ్యంగానూ, అధర్మానికి ప్రోత్సాహ కరంగానూ ఉన్నదని అందరికీ తెలుసును.

వాస్తవంగా యిలాటి సంఘటన జరిగి వుండలేదు. ఒక మహత్తర విషయాన్ని సులభంగా జ్ఞప్తిలో ఉంచుకొనుటకూ, తత్త్వావగతికీ యిది కల్పించబడి ఉన్నది.

మనస్సు అనేది తన్ను వృద్ధిపరచుకొనే నిమిత్తం మహాబుద్ధి దగ్గరకు వెళ్లింది ఆ మహాబుద్ధి తన శక్తిని ఆ మనస్సునకు ఇచ్చింది మనస్సు వికసించింది. ఆత్మజ్ఞానంవల్ల వివేకం కలిగింది. మహాబుద్ధియొక్క శక్తి దానిదగ్గరే వుంటుంది. దానిని విడిచిపోదు కదా! మనస్సునకు కలిగిన వివేకం మనస్సుదగ్గరే వుంటుంది కాని, కలిగిన వివేకం పోవడమనేది జరగదు.

మహాబుద్ధిని ఆశ్రయించడం వల్ల మనస్సుకు ఆత్మజ్ఞానం వివేకం కలిగాయని దీని అభిప్రాయం.

మనస్సు చంద్రుడుగానూ, మహాబుద్ధి బృహస్పతిగానూ, తరింపజేసే శక్తి తారగానూ, మనస్సునకు కలిగిన వివేకం బుధుడుగానూ కల్పించబడి తదనుగుణంగా కథ అల్లబడింది.

'చంద్రమా మనసో జాతః,
చక్షోస్సూర్యో అజాయత'

అనే పురుష సూక్త భాగాన్ని అనుసరించి చంద్రుడు మనస్సువల్ల పుట్టినట్లు తెలుస్తున్నది. మళ్లీ ఆ మనస్సే చంద్రరూపేణా. బుద్ధిఅయిన బృహస్పతి దగ్గరకు వెళ్లడం సరికాదేమో అని కొందరికి సందేహం కలగవచ్చు. కాని 'ఆత్మా వైపుత్రనామాసి', అనే శ్రుతిని బట్టి తానే పుత్రుని రూపంగా అవతరించడం సహజం కాబట్టి చంద్రుణ్ణి మనస్సుగా చెప్పడం జరిగింది. ఆ మనస్సు మహాబుద్ధిని ఆశ్రయించడంవల్ల ఆ బుద్ధి కరుణించి తన శక్తిని—తారను—తరింపజేసే దానిని యివ్వడం జరిగింది. అంటే తన శక్తివల్ల మనస్సునకు జ్ఞానోపదేశం చేసి, దాన్ని వికసింపజేసినట్లు గ్రహించవలసి ఉన్నది. ఆ శక్తివల్లనే మనస్సునకు వివేకం కలిగింది.

బుద్ధి తన శక్తిని ఇతరులకు ఇచ్చినా, ఆ శక్తి బుద్ధికి ఉంటుందిగాని పోదు. అందువల్లనే తార చంద్రుణ్ణి చేరినా బృహస్పతికి మరలా ఇవ్వబడినట్లు కథ కల్పించబడినది.

శక్తివల్ల మనస్సుకు కలిగిన వివేకమే—తారవలన చంద్రుడికి కలిగిన బుధుడనిన్నీ కల్పించబడి ఉన్నది. ఎవరికి వివేకం కలిగినదో ఆ వివేకం వారివద్దనే ఉండడం సహజం. అందువల్లనే బుధుడు చంద్రునకే ఇయ్యబడినట్లు చెప్పబడింది.

తాత్వికమైన యీ విషయాన్ని గ్రహించడమే ఉచితం. దీనిని తెలుసుకొంటే తారాశశాంకుల కథ అసభ్య విషయాలను వివరించడానికీ, ప్రచారం చెయ్యడానికీ పుట్టలేదని గ్రహించగలం కేవలం లౌకిక దృష్టితో చూస్తే మాత్రం అది అసభ్యంగానే తోచక మానదు.



# అడ్డుగోడలు

ప్రయాగ గృహలక్ష్మి





'రేపు తొమ్మిది గంటలకి ఎయిర్ పోర్టులో నన్ను కలుసుకో. నేను చెప్పి నట్లుగా రావాలి.

'విక్టర్'

నమ్మలేనట్లుగా యింకోసారి చదువు కుంది కేబుల్‌ను అపర్ణ.

'యిదేమిటి ? నాలుగురోజుల కింద టేగా విక్టర్‌నుంచి లెటర్ వచ్చింది. తను వచ్చేసరికి యింకా నెలరోజులు అవుతుందని వ్రాశాడు అందులో. మరి యింతలో ఈ కేబుల్ ఏమిటి?'

ఆశ్చర్యంగా దాన్ని చేతుల్లో పెట్టు కుని అలాగే కుర్చీలో కూర్చుండి పోయింది అపర్ణ. ఒక్కసారి తనకీ, విక్టర్‌కీ పరిచయం కలిగించిన సంఘటన, చికాగోలో తను గడిపిన రోజులు గుర్తుకు వచ్చాయి.

'ఆ రోజులని ఎప్పటికీ మర్చిపోలేదు తను మద్రాసు యూనివర్శిటీలో రిసెర్చికి చేరిన తనకి అయిదునెలల తరవాత ప్రయత్నం చేయగా చికాగో యూనివర్శిటీలో స్కాలర్‌షిప్ వచ్చింది. ఆరు నెలల్లో మెటీరియల్ కలెక్టు చేసుకుని మళ్లా యిండియా తిరిగి వచ్చేయాలి. నిజంగా తనెంత సంతోషించింది. యింట్లో వెళ్లమని నాన్నగారు ప్రోత్సాహించారు కాని, అమ్మను ఒప్పించేసరికి తలప్రాణం తోకకి వచ్చింది తనకి. 'అక్కడ నువ్వు ఎలా మానేజ్ చేస్తావు?' అని ఎవరైనా తనని అడిగితే 'నాకేం భయం ? అయినా అక్కడున్నవాళ్ళు ఏమీ పెద్దపులులు కాదు, వాళ్ళూ మనుషులే' అని సమాధాన మిచ్చేది తను. అంతా సిద్ధంచేసుకుని, చివరికి ప్లేను ఎక్కేసరికి అప్పుడు తెలి సింది తనకి భయమంటే ఏమిటో. కొత్త దేశం, కొత్త మనుష్యులు. తను యింగ్లీషు ఎంత బాగా మాట్లాడగలిగినా, వాళ్ళు మాట్లాడేతీరుకీ, తమతీరుకీ చాలా తేడా ఉంటుంది. వాళ్ళు మాట్లాడేదాన్ని తను అర్థం చేసుకోలేకపోతే ఎలాగ? యిలాంటి ఆలోచనలు రాగానే ఒక్కసారి గుండె ఝల్లుమంది తనకి. పరుగెత్తి విమానం లోంచి కిందకిదూకి యింటికి పారిపోవా లనిపించింది. వస్తున్న ఏడుపును అతి కష్టంమీద ఆపు చేసుకుని అలాగే శూన్యం లోకి చూస్తూ ఉండిపోయింది తను.

అక్కడకి వెళ్లింతరువాత తను అను కున్న విషయాల్లో పెద్ద కష్టపడక పోయినా ముఖ్యంగా ఒక్కవిషయంలో చాలా బాధపడింది తను అదే భోజనం విషయంలో. బ్రెడ్డుముక్కలు, ఉడికించిన బంగాళాదుంపలు, ఉడికించిన బీన్సు యివి తనకి ఏమాత్రం సహించేవి కావు పోనీ వంట వండుకుందామా అంటే తను యూనివర్శిటీకి వెళ్లడం, యిటు వంట వండుకోవటం రెండిటికీ కుదిరేదికాదు. ముఖ్యంగా మన దేశంలో వండుకోవడానికి పనికివచ్చే వస్తువులు ఎక్కడ అమ్మ

తారో తెలిసేదికాదు. ప్రతిదానికి ఎవరో ఒకర్ని అడగాలంటె సిగ్గుగా ఉండేది తనకు. మనం కాఫీ తాగినట్లు అక్కడ స్టూడెంట్సు, షాంపేన్, విస్కీ, జిన్ తాగుతూంటె తనకి విపరీతమైన ఆశ్చర్యం వేసేది. వెళ్ళిన వారంరోజులకే తను చాలా వీక్ అయిపోయింది. ఈ స్కాలర్‌షిప్ చక్కగా యింకా కాస్త చిన్న యూనివర్సిటీలో వస్తే బాగుండేది. కొంపమునిగిపోయినట్లు ప్రపంచంలో పెద్ద బిజీ సిటీ అయిన చికాగోలోనే రావాలా అని తిట్టుకునేది.

ఆ రోజు తను ఎప్పటికీ మర్చిపోలేదు. ఎలా మర్చిపోగలుగుతుంది ? 'విక్టర్'ని పరిచయం చేసినరోజు అది. వారంరోజులనుంచి సరిఅయిన భోజనంలేక తనకి ముఖ్యంగా ఆరోజు ఏదోలా అనిపించింది. మాటిమాటికీ ప్రపంచం అంతా గుండ్రంగా తిరిగి పోతున్నట్లనిపించేది కళ్ళకి. ఎలాగోలాగ సాయంత్రం అయిదు వరకు గడిపింది డిపార్టుమెంటులో. లిఫ్టు దగ్గర కొచ్చేంతవరకు ఎలాగోలాగ కింద పడిపోకుండా కంట్రోలు చేసుకోగలిగింది. లిఫ్టులో యిలా అడుగుపెట్టిన మరుక్షణంలో ఏమైందో తనకు తెలియదు. మెలకువ వచ్చేసరికి తను బెడ్‌మీద ఉన్నట్లనిపించింది. కళ్ళువిప్పేసరికి ఎదురుగా తేనెరంగు కళ్ళు, ఎర్రటిజుట్టు, తెల్లటి మొహం, పొడవాటి సూదిముక్కుగల మనిషి మొహం తన మొహానికి దగ్గరగా వున్నట్లనిపించింది. 'ఎవరూ' అంటూ గబుక్కున లేవబోయింది. 'లేవకండి, ఫరవాలేదు.' అంటూ ఆ వ్యక్తి మళ్ళా తన భుజం పట్టుకుని పడుకోబెట్టాడు. ఒక్కసారి ఏడుపు ఉప్పెనలా వచ్చింది తనకి. రెండుచేతులూ ముఖానికి దగ్గరగా పెట్టుకుని వెక్కి, వెక్కి ఏడవడం మొదలు పెట్టింది తనను చూసి ఆ వ్యక్తి ఒక్కసారి కంగారుపడిపోయి 'డాక్టర్, డాక్టర్ ఆ అమ్మాయికి మెలకువ వచ్చింది.' అంటూ లోపలికి గబగబా పరిగెత్తినంత వేగంగా వెళ్ళాడు. అతను అటు వెళ్ళగానే మంచంమీద కూర్చుని ఏడుపు ఆపుకోవడానికి విశ్వప్రయత్నంచేసింది తను. వాళ్ళు తిరిగి వచ్చేసరికి కళ్ళు తుడుచుకుని మామూలుగా ఉంది తను. తనని చూడగానే ఆ డాక్టరు నవ్వుతూ 'నువ్వు యిండియన్‌వి కదూ?' అన్నాడు. అవునన్నట్లుగా తల ఊపింది తను. 'చూడమ్మాయి ఫుడ్ సరిగా తీసుకోపోతే ఎలాగ? నువ్వు' అని ఆగిపోయాడు 'నేను ప్యూర్ వెజిటేరియన్ని' అని చెప్పింది తను. 'అలాగా! అయితే మాత్రం ఏం? ఉడికించిన బంగాళాదుంపలు, బీన్స్ అవి బాగా తినమ్మాయి. నాలుగురోజుల్లో బలం వచ్చేస్తుంది'అన్నాడతను 'తింటాను, తింటాను. బంగాళాదుంపలు నేను ఈసారి, అవి కనిపిస్తే యిక్కడినుంచి యిండియాలో పడేట్లు విసురుతాను' అనుకుంది తను. తను బిల్లు చెల్లించబోతే 'అది నాడ్యూటీ' యిక్కడికి మిమ్మల్ని తీసుకొచ్చింది నేను' అన్నాడతను. తను మాట్లాడకుండా ఆశ్చర్యంగా అతనివైపు చూస్తూ ఉండిపోయింది. హాస్పటల్‌నుంచి బయటికి వచ్చేశాక తను అతనికి థాంక్సు చెప్పి తన ఫ్లాట్‌కి పోదామనుకుంది. కానీ బయటికి రాగానే 'ఏదైనా రెస్టారెంటుకి వెళ్ళి కాఫీ తీసుకుని వెళ్దాం. లేకపోతే మళ్ళా మీరు పడిపోగలరు' అన్నాడతను నవ్వుతూ తన కారుని సమీపిస్తూ. తను మాట్లాడకుండా అతన్ని అనుసరించింది.

హోటల్లో అడుగుపెడుతూ ఉలిక్కిపడింది తను అది ఖరీదైన హోటలు స్టూడెంట్సు సర్వసాధారణంగా యింతంత పెద్ద హోటల్సుకు రారు. మరి యితను, అని అనుకుంది తను యిద్దరూ కాఫీతాగి, కేక్సు తిన్నారు. అప్పుడే అతను ఎన్నో ప్రశ్నలు వేశాడు తన్ని. అన్నిటికీ చక్కగా సమాధాన మిచ్చింది తను. తిరిగి అతన్ని ప్రశ్నలుకూడా వేసింది. అప్పుడు తెలిసింది తనకి అతనిపేరు 'విక్టర్' అనీ, న్యూక్లియర్ ఫిజిక్స్‌లో, తనున్న యూనివర్సిటీలో రిసెర్చి చేస్తున్నాడని. ఎంతో చనువుగా మాట్లాడిన అతనితో తను కూడా చాలా చనువుగా సరదాగా మాట్లాడింది తను తనని తన ఫ్లాట్‌దగ్గర డ్రాప్ చేస్తూ 'మీరేమీ అనుకోకుండా ఉంటే ఒక్కమాట' అన్నాడతను. ఏమిటీ అన్నట్లు చూసింది తను అతనివైపు. 'నేను యిండియన్సు చాలామందిని రకరకాల చీరలు కట్టుకున్నవాళ్ళని చూశాను కానీ యింత చక్కటిచీర ఎవ్వరూ కట్టుకోలేదు' అన్నాడు. ఆశ్చర్యంగా అతనివైపు చూస్తూంటే 'గుడ్‌నైట్' చెప్పి వెళ్ళిపోయాడతను. అతను వెళ్ళగానే తన చీరవైపు ఒకసారి చూసుకుంది. లేత నీలంరంగుకి, ముదురు నీలంరంగు బార్డరున్న గద్వాలు చీర. 'ఫరవాలేదు ఉమెరికన్ అయినా విక్టర్‌కి మంచి టేస్టు ఉంది చీరల విషయంలో' అనుకుంది తను అప్పుడు

అంతే ఆ రోజునుంచి యిద్దరికి మంచి ఫ్రెండ్‌షిప్ అయిపోయింది. విక్టర్ యిండియా గురించి ఎన్నో ప్రశ్నలు వేసేవాడు. అతని క్యూరియాసిటీ చూస్తే ఒక్కొక్కప్పుడు నవ్వుకూడా వచ్చేది తనకి. అన్నిటికీ ఓపిగ్గా సమాధాన మిచ్చేది. ఆ ప్రశ్నల్లో ఎక్కువగా ఆచారాల గురించి ఉండేవి. ఒకరోజు తను యిండియాలో స్టూడెంట్సుగురించి చెప్తూ 'యిదిగో విక్టర్ యిక్కడింత హాయిగా నీతో కూర్చుని మాట్లాడుతున్నాను. యిదే మా దేశంలో అయితే ఈపాటికి నీమీద, నామీద లక్ష స్కాండల్సు పుట్టేవి. చివరికి నేను చదువుకూడా మానేసే పరిస్థితులు కూడా కల్పించబడతాయి. అయితే సిటీస్‌లో యింత ఘోరం లేదు. కానీ ముఖ్యంగా ఈ విషయంలో మా ఆంధ్ర ప్రదేశ్‌లో మరీ కష్టం అంది' తను నవ్వుతూ ఆశ్చర్యంగా అన్నిమాటలు వినేవాడు విక్టర్.

విక్టర్ సహాయంతో మెటీరియలంతా తొందరగానే కలెక్టు చేసుకుంది తను. రోజూ సాయంత్రం అయిదవగానే విక్టర్ తనూ కలిసి ఏదో ఒక రెస్టారెంటులో కూర్చుని కబుర్లు చెప్పుకునేవారు. యింక వీక్ ఎండ్స్‌లో విక్టర్ చుట్టుపట్ల ఉన్న ఊళ్ళలో ఏమైనా విశేషాలుంటే తీసికెళ్ళి చూపించేవాడు అప్పుడప్పుడు బీచ్‌కి వెళ్తూ ఉండేవారు. అక్కడ ఆడా, మొగా తేడాలేకుండా అందరూ సన్‌బాత్ తీసుకుంటూంటే తను దూరంగా ముడుచుకుని కూర్చుని చూస్తూ ఉండేది. అప్పుడప్పుడు విక్టర్‌కూడా వాళ్ళలో చేరుతూ ఉండేవాడు అయితే ఒక్కసారి కూడా తనని, యిది చెయ్యి, అది చెయ్యి అని బలవంతం పెట్టలేదు చాలామంది యిండియన్సుకి అమెరికన్సులో నీతీ నిజా

యని తక్కువ అని నమ్మకం. వాళ్ళకి వాళ్ళు ఎలా ఉన్నా పైదేశస్థులను చాలా గౌరవిస్తారు. ఆ ఆరునెలల్లో విక్టర్ తనతో ఎంతమర్యాదగా ఉన్నాడు. కనీసం భుజంమీదైన ఒక్కసారి కూడ చెయ్యి వెయ్యలేదు. ఎంతో జాగ్రత్తగా ప్రవర్తించేవాడు. అయితే అప్పుడప్పుడు ఏదైనా కామెంటు చేసేవాడు. అవైనా చాలాసిటుగా ఉండేవి ఒకసారి తను తెల్లదానికి నల్లరంగు జరీబార్డరున్న వెంకటగిరిచీర కట్టుకుంది తనని పదేపదే చూశాడు ఆరోజు. చివరికి 'ఈ చీర నీకు చాలా బాగుంది. బాగా సూటయింది నీకు' అన్నాడు ఉండబట్టలేక యింక తన మనసులోని భావాన్ని అణచిపెట్టుకోలేక ఆ మాటన్నాడు అని గ్రహించడానికి ఎంతోసేపు పట్టేదికాదు తనకి. అసలు అతను కామెంట్ చేసేది తక్కువ అయితే ఆ అతి చిన్న కామెంట్సుకే సిగ్గుతో ఎర్రబడేవి తన బుగ్గలు అది చూసి "మా అమెరికన్సు ఎవ్వరూ యింత అందంగా సిగ్గుపడలేరు' అనేవాడు.

# అడ్డుగోడలు

దాంతో మరి రెండు నిముషాలవరకు తలెత్తి అతని వైపు చూడలేక పోయేది. మళ్ళా సర్దుకుని కళ్ళెత్తి చూసేసరికి అతను తనవైపే చూస్తూ ఉండేవాడు. ఆ తేనె రంగు కళ్ళలో ఏదో ఆప్యాయత కనిపించేది తనకి.

విక్టర్ పరిచయంతో ఆరునెల్లు యిట్టే గడిచిపోయాయి. తను వెళ్ళేరోజు వచ్చింది. విక్టర్ మొహంలో ఏదో తెలియని బాధ కన్పించింది తనకి. పదకొండు గంటలకి తను ప్లేను ఎక్కాలంటే ఎనిమిదిగంటలకల్లా వచ్చేశాడు యిద్దరూ ఎంతసేపు మాట్లాడుకున్నారో తెలియదు.

ప్లేను ఎక్కబోయేముందు విక్టర్ తన చెయ్యి పట్టుకుంటూ 'అపూ వీ యిండియాలో చాలా అమూల్యమైన వస్తువులున్నాయని అన్నావుకదూ నేను యిండియా తప్పకుండా వస్తాను ఎందుకో తెలుసా? యిండియాలోని ఒక అమూల్యమైన వస్తువు నాక్కావాలి అందుకని.' అంటూ తన చెయ్యి గట్టిగా పట్టుకుని వదిలేశాడు. మొట్టమొదట తనకు అర్ధం కాలేదు. కానీ తర్వాత అర్థం అయింది ఒక్కసారి బుగ్గదగ్గర చెయ్యిపెట్టుకుని 'అయ్యో' అనుకుంది.

ఆ తర్వాత అతనిదగ్గరనుంచి రెగ్యులర్‌గా లెటర్సు రావడం మొదలుపెట్టాయి తను కూడా జవాబులిచ్చేది. అయితే ఉత్తరాల్లో కూడా, ఎప్పుడూ ఏమీ వ్రాసేవాడు కాదు. క్షేమ సమాచారాలు, తనక్కడ కాలం ఎలాగ గడుపుతున్నాడో అన్నీ వివరంగా వ్రాసేవాడు ఒక్కో ఉత్తరంలో 'మీ యిండియాలో తాజ్‌మహల్ చాలా బాగుంటుందట అదీకాకుండా వెన్నెల్లోచూస్తే చాలా అందంగా ఉంటుందిట మరి నువ్వు నాకు వెన్నెల్లో చూపిస్తావా' అని వ్రాశాడు. తను దానికి తప్పకుండా విక్టర్ అది నా బాధ్యత అని వ్రాసింది. యింకో ఉత్తరంలో అదే నాలుగురోజుల్క్రిందట వచ్చింది. అందులోనే వ్రాశాడు 'నేను నెలరోజుల్లో యిండియా వస్తున్నాను. బొంబేనుంచి మద్రాసు ప్లేన్‌లో వస్తాను. నేను ప్లేను దిగేసరికి ఎయిర్‌పోర్టులో నువ్వు కన్పించాలి. ఎలా కన్పించాలో తెలుసా? నువ్వు ఆరోజు లిఫ్టులో కళ్ళు తిరిగి పడిపోయావు. ఆ రోజు నిన్ను ఈ చేతులతో ఎత్తేభాగ్యం కలిగింది. ఆ రోజు కట్టుకున్న చీర కట్టుకో. మర్చిపోవు కదూ' అని వ్రాశాడు. తను నవ్వుకొంది ఆ రోజు.

'నెల రోజులకు రానని వ్రాసినవాడు మరి యింత తొందరగా వస్తున్నాడేమిటి? ఆలోచనలలో తేలిపోతూ అంతవరకూ కళ్ళు మూసుకున్న అపర్ణ ఒక్కసారి కళ్ళు తెరిచింది గదంతా చీకటిమయం. తడుముకుంటూ వెళ్ళి లైటు వేసింది ఆ వెలుగులోనే చేతిలోఉన్న కేబులుని మరొకసారి చూచుకుని డ్రాయర్లోపెట్టి ఒకసారి సూట్‌కేసు దగ్గరికి వెళ్ళి చీరల్లో విక్టర్ వ్రాసిన చీరఉందో లేదో చూసుకుని డైనింగు హాలువేపు నడిచింది అపర్ణ.

ఉదయం తొందరగా లేచి ఎనిమిది గంటలకల్లా ఎయిర్‌పోర్టుకి వెళ్ళింది అపర్ణ. తొమ్మిది గంటలకి ప్లెయిన్‌లోంచి దిగుతున్న అయిదడుగుల తొమ్మిదంగుళాల



దిడతున్న విక్టర్‌ని చూసేసరికి గుండె ఝల్లుమంది. తడబడుతున్న అడుగులతో ఎదురుగా వెళ్ళింది.

'వచ్చావా! నేను చెప్పినట్లు వస్తావని నాకు తెలుసు' ఆప్యాయంగా అంటున్న విక్టర్ మొహంలోకి ప్రేమగా చూసింది అపర్ణ.

'అపూ ఈ ఊళ్లో ఏది పెద్ద హోటలైతే అక్కడికి తీసుకెళ్లు. యింక డబ్బు సంగతంటావా! అమెరికాలో సుఖంగా జీవించడానికి కావలసినంత డబ్బుంది. అంటే యిండియాకి వస్తే లక్షాధికారిలా ఉండొచ్చు' అన్నాడు విక్టర్. మాట్లాడకుండా అతన్ని 'పెద్దహోటెల్‌కి' తీసుకు వెళ్లింది. విక్టర్ స్నానం అదీ చేసిం తరువాత అతనికి టిఫిన్ పెట్టించింది అపర్ణ.

యిడ్లీ సాంబారు తింటూ 'కారం కారం' అంటూ వగరుస్తూన్న విక్టర్‌ను చూస్తే చాలా జాలేసింది అపర్ణకి

'అపూ యివి ఇంత కారంగా ఉన్నాయేం? మరి నువ్వు చికాగోలో ఒకసారి చేసి పెట్టావు, అవంత కారంగా లేవు' అన్నాడు

'అవా! అవి దొరగారికోసం ప్రత్యేకంగా కారం తగ్గించి చేసినవి మరి ఈహోటలు వాళ్లకేం తెలుసు విక్టర్ అనే అబ్బాయి చికాగోనుంచి యిక్కడ కొస్తున్నాడని' నవ్వుతూ అంది అపర్ణ.

పదిహేనురోజులు యిష్టమొచ్చినట్లు తిరిగారు రోజూ డిపార్టుమెంటుకి వెళ్లి సంతకంచేసి మెటీరియల్‌కోసం లైబ్రరీకి వెడుతున్నాను అని ప్రొఫెసరుతో చెప్పి విక్టర్‌తో రోజూ ఒకచోటకి వెళ్లివచ్చేది అపర్ణ. ఒక్కోరోజు విక్టర్‌ని చూస్తే ఆశ్చర్యం వేసేది అపర్ణకి చికాగోలో ఎంత మర్యాదగా ప్రవర్తించాడో యిక్కడ కూడా అంత మర్యాదగా ప్రవర్తిస్తున్నాడు

ఆరోజు ఏడువరకు అటూ యిటూ తిరిగి యిద్దరూ బీచ్‌కి వెళ్లారు కొంచెం జనం పల్చగా ఉన్నచోట యిద్దరూ కూర్చున్నారు హోరుగాలి కొట్టుతుంటే విక్టర్ మాటలు వింటూన్న అపర్ణ పైట కొంగుతీసి తలమీంచి చెవులమీదుగా కప్పుకుంటూ కూర్చుంది.




'నేను యిండియాకి ఎందుకు వచ్చానో తెలుసా?' అన్న విక్టర్ ప్రశ్నతో చటుక్కున తలెత్తి,

'ఎందుకేమిటి? యిండియా చూడ్డానికి' అంది అపర్ణ.

'కాదు. యిండియాకి చెందిన అమూల్యమైన వస్తువుని నాతో తీసికెళ్లడానికి' అన్నాడు. ఆశ్చర్యంగా, అర్థం కానట్లు చూసింది అపర్ణ.

'ఇంక దాచడ మెందుకు అపర్ణా నేను యిండియా వచ్చింది నీకోసం. నిన్ను యిక్కడనుంచి చికాగో తీసుకువెళ్లిపోతాను. నేను యింకా యిక్కడ నెల రోజులుంటాను ఈలోపల నీకు పాస్‌పోర్టు అన్నీ వచ్చేస్తాయి. ఈలోపల మనిద్దరం కలిసి మీ పేరెంట్సుదగ్గరికివెళ్లి పర్మిషను తీసుకుందాం. నాలుగురోజులు ముందరే బయలుదేరి ఆగ్రావెళ్లి టాజ్‌ని వెన్నెల్లో చూసి బొంబేవెళ్లి ప్లేను ఎక్కుదాం. ఈ సంగతి అంతా మా పేరెంట్సుతో చెప్పాను. వాళ్లు ఏమీ అడ్డుపెట్టలేదు పెట్టరు కూడాను నాకు ఒక చెల్లెలుంది యింకెవరూ లేరు. నువ్వేమంటావ్ అపర్ణా' అన్నాడు

అపర్ణకి ఈ మాటలు వింతగా తోచలేదు. ఎప్పుడో ఒకరోజు యిలాంటి మాటలు వినడానికి సిద్ధంగానే ఉంది. కానీ యింత తొందరో్లమాత్రం కాదు.

'ఏమని సమాధానం చెప్తుంది తను? విక్టర్ నువ్వంటే నాకు ప్రాణం. కానీ ఎలాగ? నేను యిండియన్‌ని. అందులో ఆంధ్రప్రదేశ్‌లో పుట్టిన పిల్లని. నీతో రావడానికి, నిన్ను పెళ్లిచేసుకోవడానికి మావాళ్లు అంగీకరించరు. దీనికి పరిష్కారం ఏమిటో నాకు తెలియదు కానీ ఒక్కటిమాత్రం నిజం నేను నీకు ఎలాగో నువ్వు నాకు అంతే' యిలాంటి ఆలోచనలలో తేలిపోతూ విక్టర్ ప్రశ్నకి సమాధానం చెప్పకుండా యిసకలో గీతలు గీస్తూ మౌనంగా కూర్చుండి పోయింది.

'ఆలోచిస్తున్నావా? ఫరవాలేదు. రేపు నీ నిర్ణయం చెప్పు' లేచి నిలబడి పాంటుకి అంటుకున్న యిసక దులుపుకుంటూ అన్నాడు విక్టర్

మాట్లాడకుండా అనుసరించింది విక్టర్‌ని.

నిరసపడిన మోహంతో లోపలికి వస్తున్న అపర్ణని చూసి ఆశ్చర్యపోయింది అపర్ణ రూమ్మేటు కరుణ. భోజనం చేయకుండా మంచం మీద వాలి పోయింది.

'ఎలా ఈ సమస్యను పరిష్కరించడం. తను విక్టర్‌తో వెళ్ళిపోతే తన చెల్లెళ్ళకి మళ్ళా పెళ్ళవుతుందా? మరి ఏం చెయ్యాలి. యింక విక్టర్‌ని మరిచి పోవాలి—కానీ అది సాధ్యమా. విక్టర్ పేరు తలచుకుంటేనే మనస్సు పురివిప్పిన నెమలిలా నాట్యం చేస్తుంది. అలాంటి విక్టర్‌ని తను మర్చిపోగలదా. అంతకంటే చచ్చిపోవడం మంచిది. అది సులభం దీనికంటె కానీ అమ్మా, నాన్న, చెల్లెళ్ళు వాళ్ళు ఎంత బాధ పడతారు. వాళ్ళకోసం తను విక్టర్‌ని వదులుకో గలదా? భగవాన్ యిలాంటి సమస్యను నాకు ఎందుకు తెచ్చి పెట్టావు? ఏది ఏమైనా సరే యిలాటి త్యాగాలు తను చెయ్యలేదు. మొదట బాధ పడతారు తర్వాత మర్చిపోతారు అందరూ తనిని. అంతే యిదే మంచిది. రేపే వెళ్ళి విక్టర్‌కి చెప్పాలి 'నన్ను ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా తీసుకు వెళ్ళిపో అని చెప్పాలి.' రాత్రంతా కలత నిద్రతో గడిపి తెల్లవారగానే విక్టర్ రూముకి పరుగెత్తింది.

అంతా విని 'నిన్ను యిలా తీసుకు వెళ్తున్నందుకు నాకు చాలా బాధగా ఉంది. కానీ ఏది ఏమైనా నిన్ను మాత్రం వదులుకోలేను.' అపర్ణ చేతులు పట్టుకుంటూ అన్న విక్టర్ మాటలకు కన్నీళ్ళ మధ్య హాయిగా నవ్వింది అపర్ణ.

అనుకున్నట్లుగానే నాలుగు రోజులు ముందరే పాస్‌పోర్టు సంపాదించాడు విక్టర్ ముందర యిద్దరూ కలిసి ఆగ్రా వెళ్ళి టాజ్‌ను చూసి అక్కడనుంచి బొంబే వెళ్ళి ప్లేన్ ఎక్కుదామనుకున్నారు.

'రేపు సాయంత్రం అయిదున్నరకల్లా నీ దగ్గరకు వస్తాను. అక్కడి నుంచి ఏయిర్‌పోర్టుకు వెడదాం', అన్నాడు విక్టర్, మర్నాటి ప్రోగ్రాం గురించి అపర్ణతో చెప్తూ.

'అలాగే' అంది అపర్ణ.

వెళ్ళేరోజు మధ్యాహ్నం 2 గంటలకి తనకు కావలసిన సామాన్లని సర్దు కుంది అపర్ణ. యింతకాలం దాచి ఉంచిన రహస్యాన్ని వెళ్ళేటప్పుడు తన ప్రాణస్నేహితురాలైన కరుణకు చెప్పి వెళ్దామనుకుంది అప్పటికే బట్టలు సర్దుకుంటున్న అపర్ణను చూసి—

'ఎందుకు అపూ ఈ హడావిడి' అంది కరుణ

'నేను వెళ్ళిపోతున్నాను. యిక్కడినుంచే కాదు ఈదేశం విడిచిపెట్టి' అంది అపర్ణ

'ఏమిటీ ? నిజంగా ? ఎవరితో ? ఎప్పుడూ' ఆశ్చర్యంగా ప్రశ్నమీద ప్రశ్న వేస్తూ అంది కరుణ.

'యివాళే విక్టర్ అనే అమెరికన్‌తో చికాగో' అంది అపర్ణ.

'ఏయ్ ఏమిటా సమాధానాలు సరిగ్గా చెప్పు. నా బుఱ్ఱ తిరిగిపోతోంది' అంది కరుణ.

'చెప్పడానికేముంది మామూలుకథే నేను చికాగో వెళ్ళినపుడు విక్టర్ అనే అమెరికన్‌తో పరిచయం అయింది. అతను నాకోసం యిండియా వచ్చాడు యిప్పుడు నన్ను తీసుకు వెళ్తున్నాడు' అంది అపర్ణ మెల్లగా.

'నీకు మతిపోయింది సందేహం లేదు. లేకపోతే వాళ్ళ ఆచారాలేమిటి? మన ఆచారాలేమిటి? అసలు నువ్వు వాళ్ళల్లో యిమడగలవా?' సూటిగా అపర్ణవైపు చూస్తూ అంది కరుణ.

'అలాంటి సందేహాలు ఏమీ అక్కర లేదు మనం అన్నా మన ఆచారాలన్నా మన కట్టూ, బొట్టూ అన్నా అసలు మన యిండియన్నంటే అతనికి విపరీతమైన యిష్టం యింత దేనికి భయం.' గర్వంగా కరుణవైపు చూస్తూ అంది అపర్ణ.

'చూడు అపర్ణా ప్రస్తుతానికి యివన్నీ అతనికి చాలా ప్రియంగా కన్పించి ఉండొచ్చు కానీ కొన్నిరోజులుపోతే అవే చిరాకు పుట్టించొచ్చు. ముఖ్యంగా కొన్ని విషయాల్లో వాళ్ళకి మనకి పొత్తు కుదర్దు. వాళ్ళు బాల్‌రూమ్ డాన్సులు చేస్తారు అప్పుడు ఎవరి యిష్టమున్న వాళ్ళతో వాళ్ళు డాన్సు చేస్తారు. అప్పుడు నీ విక్టర్ యాభయి మందితో చేతులు కలిపి డాన్సు చెయ్యడం నువ్వు చూడగలవా? పోనీ చూడగలిగినా తిరిగి నువ్వు అంతమంది మగాళ్ళతో డాన్సు చెయ్యగలవా? పోనీ యిది గుర్తుంచుకో ఏ గుణాలను నీలోచూసి విక్టర్ నిన్ను పెళ్ళిచేసుకుంటానన్నాడో అవే గుణాలు కొంతకాలం పోయింతరవాత అతనికి చిరాకు పుట్టిస్తే అప్పుడు ఏమంటాడో తెలుసా? 'అపర్ణా నీకూ నాకూ సరి పడటం లేదు మనిద్దరం డైవర్సు తీసుకుందాం' అంటే నువ్వు భరించగలవా? భరించగలిగినా మళ్ళా యింకో అమెరికన్‌ని



'వెఱుక్కాని పెళ్ళిచేసుకోగలవా? ఆలా ఎప్పటికీ చెయ్యలేవు. కారణం మనం భారతీయులం. కానీ అతను నిన్ను అతి తేలిగ్గా విడిచిపెట్టి వాళ్ల అమెరికన్ అమ్మాయిని మళ్లా పెళ్లి చేసుకోగలడు. అదే వాళ్లకీ మనకీ ఉన్నతేడా. అమెరికన్‌ని ప్రేమిస్తే, అతనికున్నంత విశాల దృక్పథం మనంకూడా అలవర్చుకోవాలి. అలాకాకుండా క్షణికావేశంలో తొందరపడితే మిగిలేది దుఃఖం మాత్రమే నా మాట విను నువ్వు తలచుకుంటే విక్టర్‌ని మర్చిపోవడం అంత కష్టమైన పనికాదు' అని యింకా ఏమో చెప్పబోయిన కరుణ వెక్కి వెక్కి ఏడుస్తున్న అపర్ణనుచూసి మాటలు ఆపేసి 'యిప్పుడు మూడయింది. నిర్ణయం నీకే వదిలేస్తున్నాను' అంటూ అపర్ణను ఒంటరిగా వదిలేసి వెళిపోయింది.

అయిదు గంటలకి తిరిగి వచ్చిన కరుణను చూసి—

'కరుణా యిదిగో ఈ ఉత్తరం విక్టర్‌కి యియ్యి. నేను ఎక్కడికి వెళ్లాను అని అడిగితే నాకు తెలియదు అని చెప్పు' అంది.

ఎర్రగా ఉబ్బిపోయిన అపర్ణ కళ్లను చూస్తూ ఉత్తరం చదివింది కరుణ.

'విక్టర్,

# అడ్డుగోడలు

నేను నీతో రాలేను నన్ను క్షమించు. ఎందువల్ల అని అడుగుతావేమో ఏ భారత సాంప్రదాయం, వారి ఆచారాలు గురించి నువ్వు శ్రద్ధగా విన్నావో అవే మనల్ని దూరం చేస్తున్నాయి యిప్పుడు. ఒక్క మాట నన్ను ఉదాహరణగా తీసుకుని భారతీయులంతా మోసగాళ్ళు అనిమాత్రం అనుకోకు. నాలాంటి వాళ్ళు నూటికి కోటికి ఒకళ్ళుంటారు నన్ను మర్చిపోవడానికి ప్రయత్నం చెయ్యి. యింతకంటె ఏమి వ్రాయగలను? అసలు యింత కంటె ఏం వ్రాయడానికి నాకు అర్హత ఉంది. నవ్వుతూ యిండియా వచ్చిన వాడివి, కొండంత బాధతో తిరిగి వెళ్ళాల్సి వచ్చింది. నేనేం చెయ్యగలను. నన్ను క్షమించు.

అపర్ణ'

'మంచిపని చేశావు' అంటూ అపర్ణ వైపు చూస్తూ బయటికి వెళ్లింది కరుణ.

గంట తరువాత వచ్చిన కరుణను చూసి 'వెళ్లిపోయాడా, విక్టర్? అవును వెళ్లక ఏం చేస్తాడు? అసలు వెళ్లగొట్టింది నేనేగా' ఏడుస్తూ అంది అపర్ణ.

'అవును వెళ్లి పోయాడు. వెళ్లే ముందు ఏమన్నాడో తెలుసా?' అంది కరుణ.

'తెలుసుకోవడం అంత కష్టం కాదు. 'బ్లడి యిండియన్ కస్టమ్స్' అనుంటాడు లేకపోతే, మోసగత్తె అనుంటాడు' అంది అపర్ణ.

'అలాగేమీ అనలేదు. నువ్వు పొరపడ్డావు. నువ్వు ఊహించిన దానికంటే ఉన్నతుడు నీ విక్టర్, యిదిగో యిదిచ్చాడు' అంటూ తెల్లని సిల్కు పేపరుని అపర్ణ చేతిలో పెటి బయటికి పరుగెట్టింది కరుణ.

చేతిలో కాగితాన్ని గట్టిగా పట్టుకుని లైటు వేసుకోవాలన్న జ్ఞానం లేకుండా కిటికీ లోంచి గుడ్డి వెలుతురు వస్తూంటే ఒక చేతో ఉత్తరం పట్టుకుని అక్కడికి పరుగెట్టి ఉత్తరం చదవడం మొదలు పెట్టింది అపర్ణ.

అపర్ణా,

తప్పు నీది కాదు నాది. అమూల్యమైన వస్తువులను సురక్షితంగా దాస్తారు అని తెలిసి కూడా వాటిని సులువుగా చేజిక్కించుకోపోయాను ఫరవాలేదు. నేను ఓడిపోలేదు. ప్రస్తుతం నేను తిరిగి వెళ్లాలి. టాజ్‌ని యిప్పుడు చూడను. నువ్వు లేకుండా దాన్ని చూడడం అసంభవం. అమెరికన్సు చాలా పట్టుదల గల వాళ్ళు అన్న విషయం నీకు తెలుసుకదూ! నేను మళ్లా వస్తాను ఎలా వస్తాను, ఎప్పుడు వస్తాను అన్న విషయం వ్రాయను. ఎప్పుడో ప్పుడు వచ్చి హఠాత్తుగా నిన్ను ఎత్తుకు పోతాను. పోతే బాధ తీసుకుని వెళుతున్నావు అన్నావు కదూ! అది నిజం. కానీ నా పేరు విక్టర్. ఆ విషయం మర్చిపోకు'

నీ

విక్టర్.

కళ్లవెంబడి నీళ్ళు కారిపోతూంటే కిటికీ ఊచల్ని ఒక చేతో గట్టిగా పట్టుకుని 'అమెరికన్సు పట్టుదల గల వాళ్ళు అన్న విషయం నాకు తెలుసు విక్టర్. కానీ మీ కంటే పట్టుదల గలవి మా ఆచారాలు. ఈ అడ్డుగోడల్ని మనం ఛేదించలేము.' అనుకుంది అపర్ణ ఆకాశం లోకి చూస్తూ. ●






అతని పేరు వీరపాండ్యన్ అనుకుందాము. అతను ఒక పెద్ద మదరాసు లాయరు కొడుకు. ఆయన ప్రాక్టీసు చేసే కాలం ఈ శతాబ్దం మొదలులో. ఆయనకి జోస్యం అంటే చాలా నమ్మకం కొడుకు జాతకం జాగ్రత్తగా పరీక్షించి అతను విదేశాలకి వెళ్ళి పెద్ద పేరు గణించుకుంటాడని గట్టిగా అనుకున్నాడు అందుకని కొడుకుని, అదే వీరపాండ్యన్‌ని, బాగా ఇంగ్లీషు నేర్పించడం కోసం కాన్వెంటులో చేర్పించాడు. వీరపాండ్యన్ అందంగా. చురుకుగా కనిపించేవాడు చదువులో మాత్రం అంత శ్రద్ధ చూపించేవాడు కాదని అనుకునేవారు... ఏది ఎలా ఉన్నా అతనికి శిష్యబృందం ఒకటి ఉండేది.

వీరపాండ్యన్ పెద్దవాడయ్యాడు కాని ఏ రకమయిన డిగ్రీ సంపాదించుకోలేకపోయాడు. ఉద్యోగానికి ప్రత్యేక అర్హత ఏమీ లేదన్న మాట. హటాత్తుగా ఒకనాడు తండ్రి గుండె ఆగిపోవటంతో వ్యాపారమే గత్యంతరం అయింది. దీనికి తండ్రి సంపాదించిన ఆస్తి బాగా తోడ్పడింది భీమా కంపెనీ ఒకటి పెట్టాడు కొంత మంది పెద్ద మనుషులని తోటి డయిరెక్టర్లుగా వేసుకున్నాడు. పెద్ద కంపెనీలతో పోటీ పడతలచి చాలా ఆడంబరంగా కర్చులు చేసేవాడు దీని ఫలితంగా భీమాకంపెనీ దివాలా తీసింది.

కంపెనీ వ్యవహారాలు కోర్టుకి ఎక్కాయి ఆరు నెలల జెయిలు లేదా 60,000 రూపాయల జరిమానా అన్నారు కోర్టువారు. జరిమానా ఇచ్చుకుంటానని అన్నాడు వీరపాండ్యన్. తన చుట్టాలు, స్నేహితులు సహాయం చేస్తారనుకున్నాడు అది జరగలేదు చివరికి బందీగా ఆరు నెలలు కటకటాల వెనుక ఉండి పోవలసి వచ్చింది.

దీనితో పాండ్యన్‌కి సమాజం మీదనే ద్వేషం పుట్టింది. విడుదల అయిన అతన్ని చూసి బంధుమిత్రులు తప్పుకుని తిరగటం మొదలు పెట్టారు. వీర పాండ్యన్ రంగూనుకి వెళ్ళిపోయాడు అక్కడ బినామీ కంపెనీ ఒకటి నెలకొల్పాడు అన్ని రకాల కమిషన్ వ్యాపారాలు, దిగుమతి చేస్తున్నట్టు చెప్పుకున్నాడు...

ఒక పెద్ద కట్టడాన్ని ఆఫీసుగా తీసుకున్నాడు అందులో వాటాలని అద్దెకి ఇచ్చి ఆ డబ్బుతో తన అద్దె ఇచ్చేవాడు. చక్కటి అమ్మాయిలని మంచి జీతాలకి ఉద్యోగంలో వేసేవాడు; వారివద్ద నెలజీతం డిపాజిట్‌గా పుచ్చుకునేవాడు కుర్చీలు, బల్లలు అద్దెకి తెచ్చి వేసుకున్నాడు ..

బాగా ఆర్డర్లు వచ్చేదాకా లాభం లేకుండా అమ్మేవాడు. బాంకులతో, ఖాతాదార్లతో ఎంతో న్యాయంగా నడుచుకునేవాడు రెండునెలలు గడిచాయి ఉన్న డబ్బంతా అయిపోయింది: అద్దెకి జీతాలకి ఇబ్బంది పడటం మొదలుపెట్టాడు..

ఈ ఇబ్బందులనుంచి బయటపడటానికి కంపెనీలో వాటాలని తెలిసినవారికి చాలా మందికి అమ్మేడు తనుమాత్రం మానేజింగ్ డయిరెక్టరుగా ఉండిపోయాడు కేవలం జీతం ఉంటే చాలునన్నాడు కొత్త వాటాదార్లు దీనిని విని సంతోషించారు .

కంపెనీ వ్యాపారం బాగా పెరిగింది; యూరప్ అమెరికాలలో కమిషన్ల, ఇతర మొత్తాల ధనం పేరుకుంది. ఒకనాడు వీరపాండ్యన్ మాయమయిపోయాడు...

కొంతకాలం తర్వాత సింగపూర్‌లో, బోర్నియోలో తిరిగి కనిపించాడు ఇదే రకం వ్యాపారం మొదలుపెట్టాడు సి ఐ డి. వారికి అనుమానాలు వచ్చాయి ! మదరాసు సి ఐ డి. వారు తనిఖీ మొదలుపెట్టారు— వీరపాండ్యన్ ఈ రాష్ట్రం వాడేకదా !

సరే, చివరకి ఒక మదరాసు ఇన్‌స్పెక్టర్ అతను కొలంబోలో ఇదేరకం వ్యాపారం మొదలుపెట్టి నడుపుతున్నట్టు కనిపెట్టి అక్కడికి వెళ్ళాడు వెళ్ళే లోపలే వీరపాండ్యన్ అదృశ్యుడయ్యాడు !

ఇంతదాకా అతను ఎక్కడో ఎవరికీ తెలియదు!

# వెలుగు నీడలు



యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సీరియల్

### జరిగిన కథ

రాజశేఖరం పెద్ద వ్యాపారస్థుడు సహృదయుడూ స్నేహశీలి అయిన అతని ఒక్కగానొక్క కుమార్తె అనుపమ. అనుపమ కాలేజి పాటల పోటీలో మొదటి బహుమతి గెల్చుకుంటుంది. అక్కడే ఆమె మధుమూర్తిని చూస్తుంది. మధుమూర్తి తమ ఆప్తమిత్రుడని కుమార్తెకు పరిచయం చేస్తాడు రాజశేఖరం. మధు, వారింట్లో వుంటూ— అనుపమ అనురాగాన్ని రాజశేఖరం అభిమానాన్ని చూరగొంటాడు. రాధమాధవీయమ్ నృత్య నాటికలో అనుపమ రాధగా వేస్తుంది మధు తప్పనిసరిగా మాధవుడు కావలసివస్తుంది అనుపమ మనసునంతా ఆ మాధవుడే ఆవరించుకున్నాడు

## 3

'రాజశేఖరంగారు రాగానే కుమార్తె అస్వస్థత గురించి తెలుసుకుని అన్నారు—

'నిన్నో వూపు వూపి వుంటుందోయ్! మా అనుపమ! తలనొప్పికే ఎంతో భయపడుతుంది.'

'లేదు లెండి' అన్నాడు మధుమూర్తి.

తర్వాత ఆయన ఆ సాయంత్రం అతనితో తమ మేనల్లుడైన డాక్టర్ విజయకుమార్, ఇంగ్లండునుంచి మూడు నాల్గు రోజుల్లో రాబోతున్నట్లు తెలియజేశారు. ఆ రోజున జరగబోయే విందు గురించి చెప్పారు.

రైలు దిగుతూన్న విజయకుమార్‌ను చూడగానే అందరూ దిగ్భ్రాంతులయ్యారు

అతనిలో ఏకోశాన 'భారతీయుడు' అన్న లక్షణమే గోచరించటమేలేదు. నల్లని సూటులో, నెత్తిపైన హేట్‌తో, చేతిలో విలాసంగా వూపుకునే కర్రతో, పెదవుల మధ్య సిగరెట్‌తో ప్లాట్‌ఫారంపై కాలు మోపాడు.

రాజశేఖరంగారు ముఖం చిట్లించారు మేనల్లుడిని చూడగానే. తోటివారి మధ్య అతడినేమీ మందలించలేక కనుసైగ జేశారు సిగరెట్ పారవేయమని. అతడదేమీ పట్టించుకోనేలేదు పైగా అది పూర్తి అయిపోగానే మరో సిగరెట్ అంటించాడు 'ప్లీజ్, ఎక్స్క్యూజ్ మి!' అంటూ! పాశ్చాత్య పద్ధతుల కంతగా అలవాటు పడిపోయిన ఆ యువకుని సభ్యతా సంస్కారాలకు కొందరి మనస్సు లెంతగానో బాధపడ్డాయి.

విందు జరుగుతున్నంతసేపు ఆ నవనాగరీకుని దృష్టి కోమలాంగుల సింగారం పైనే నిలిచిపోయింది.

అనుపమకా హడావిడి ఏమాత్రమూ నచ్చలేదు ఓమూల నిశ్శబ్దంగా అతిథిలా కూర్చుండిపోయింది.

'ఓ! మై గుడ్ గర్ల్! యూ ఆర్ హియర్! మై ప్రెటీ గర్ల్!' అంటూ తెలుగే రానట్లు ఆంగ్లభాషలో తన పాండిత్యాన్ని ప్రదర్శించుతూ అనుపమ దగ్గరగావచ్చి కరచాలనం చేయబోయాడు.

కనులలో అయిష్టత పరుపులెత్తుతోంది. అంతమందిలో సభ్యతకై 'చేతులు జోడించింది' మర్యాదగా

'ఇందుకే — ఐడోంట్ లైక్ దీజ్ యిండియన్ గర్ల్స్ — రియల్లీ దే డోంట్‌నో ఎనీథింగ్ —పూర్ ఫెలోస్!' విచారాన్ని వెలిబుచ్చాడతడు కావలిసినంత.

'పాపం! చాలా శ్రమ పడ్డారను కుంటాను మనదికాని భాష మాట్లాడి! మరికొంచం శ్రమపడైనా ఓ తెలుగు మాట వినండి మాకోసమైనా! మనది కానిదీ, మన విలువల్ని కించపరిచే ఏ అల వాటునూ భారతీయ సోదరీ బృందం అనుక రించదు' అన్నాడు మధుమూర్తి ఉద్రిక్తత ఏమాత్రమూ లేని స్వరంతో

విజయ్‌కుమార్, అతనివంక చిత్రంగా చూస్తూ అన్నాడు హేళనగా నవ్వుతూ—

'అందుకే వంటయింటి కుందేళ్ళుగా వున్నారు గాబోలు!'

'బాధ్యతల్ని ఒక్కరే నెత్తిన మోయ లేరు డాక్టరుగారూ! వీధుల్లో తిరిగినంత మాత్రాన సంస్కారం అలవడదు'

అంతటితో రాజశేఖరంగారా ప్రసక్తిని ఆపుజేశారు విందుకు టైమవుతోందని హెచ్చరించి.

అందరి మనసుల్నీ ముఖ్యంగా స్త్రీల మనసుల్ని గాయపరచిన ఆ యువకునిపై అందరికీ అయిష్టత ఏర్పడిపోయి విందు ఏమంత వుత్సాహంగా జరగలేదు.

ఆరాత్రి రాజశేఖరంగారితో అన్నాడతడు.

'అనుపమ మరీ అలా ఆలయంలో అమ్మ వారిలా వుండేమిటి మామయ్యా?! చక్కగా అనూని కూడా ఫారిన్ పంపించేయ్ ఓ సంవత్సరం! మంచి నాగరికంగా తయా రౌతుంది'

'అనుపమ 'జూ'లో జంతువు గాదు విజయ్!' అన్నారాయన గంభీరంగా.

ఆ మాటల్లోని గూఢార్థాన్ని గ్రహిం చిన ఆ డాక్టరు ముఖం వెలవెల బోయింది.

'అది కాదు మామయ్యా! నేననేది! పాశ్చాత్యనాగరికత కూడా అలవరుచు కుంటే బావుంటుందని!'

'అనుకరణతో ఆత్మగౌరవాన్ని కించ పరచ గూడదు విజయ్!' ఆ పైన మరో మాట కూడా వెలువడ లేదాతని నోటి నుంచి.

తండ్రి వ్యసనాల పుట్టయై చిల్లి గవ్వ అయినా మిగలనీయకుండా సంసా రాన్ని సర్వవిధాలా నాశనంజేసి మరీ తానూ హరీ మన్నాడు చెల్లెలి బాధను చూడలేక రాజశేఖరంగారే విజయకుమార్‌ని పన్నెండవ ఏట నుంచీ తన యింటిలోనే వుంచుకుని విద్యాబుద్ధులు చెప్పించదలచి



తీసికొని వచ్చారు. విలూరి దగ్గరలోనే వున్న పల్లెటూరిలో అత్తవారి వైపు బంధువుల సాయంతో ఓ యింటి నేర్పరచుకుని తలదాచుకుంటోందామె. చెల్లెల్ని కూడా తమతోపాటే వుండి పొమ్మన్నారాయన అనురాగాబంధాన్ని త్రెంచుకోలేక. ఆమె అందుకు అంగీకరించలేదు. కొడుకుని మాత్రం అప్పుడప్పుడు వచ్చి చూసి వెళ్తూండేది తినుబండారాలవీ తెచ్చి...

అప్పటి నుంచి మేనమామ గారి యింట్లోనే రాజకుమారుడిలాగానే భోగభాగ్యాలతో పెరిగి పెద్దవాడయ్యాడు. అనుపమనూ, విజయకుమార్‌నూ కించిత్ కూడా భేదం లేకుండా పెంచుకున్నారు రాజశేఖరం గారు.

మొదటినుంచీ ఆకతాయిగానే వుంటూ వచ్చాడు విజయకుమార్. ప్రతి విషయంలోనూ తన యిష్టమే చెల్లి తీరాలి అని పట్టుదలగా వాదించేవాడు పసితనం నుంచీ. అనుపమను కూడా ఆజ్ఞాపించేవాడు మహారాజులా. తానొకరి ఆదరాభిమానాలతో వృద్ధిలోకి వస్తున్నానన్న భావన ఆతని మనస్సున కదిలినట్లెన్నాడూ ఏ ఒక్కరికీ గోచరించలేదు. కానీ చదువులో మాత్రం ప్రతీ క్లాసులోనూ ప్రథముడిగా వుత్తీర్ణుడవడం వలన రాజశేఖరంగారతడిని ప్రశంసించకుండా వుండలేక పోయేవారు.

ఆతడు మాక్ట్స్ గ్రాహి అని, నిశితమైన బుద్ధి గలవాడనీ చెప్పదగిన జ్ఞాపక

# వెలుగు నీడలు

శక్తి గలవాడని గ్రహించి డాక్టరు గిరీ కోసమై విదేశాలకు పంపించాడు. ఎంతో మంది 'ఎందుకు? మీకీ పిచ్చి?' అంటున్నా సహృదయులై.

'ఆ! వాళ్ల అనుపమ నిచ్చి యింట్లోనే పెట్టుకోవాలనేమోలే?' అన్న కొందరి భవిష్యవాణికాయన చిరునవ్వే సమాధానమయ్యేది. ఆ నవ్వులో అంగీకారమూ లేదు — అయిష్టతా కన్పించలేదు.

ఆ విధంగా సాహసించి విజ్ఞానం కోసమై మరో దేశానికి ఎంతో వ్యయప్రయాసలకోర్చి ఏ ఆశతో పంపించాడో ఎవరికీ అంతుపట్టకుండా వుంది.

విజయకుమార్ వచ్చినప్పటినుంచీ బంధువులూ, స్నేహితులూ గౌరవ సూచకంగా విందులకాహ్వానించుతూనే వున్నా ఏ ఒక్క విందుకూ అనుపమ ఆతనితో వెళ్లనూ లేదు ఆయన 'వెళ్ళు! తల్లీ!' అని నోరు విప్పి అననూ లేదు.

ఆనాటి సాయంత్రం విజయకుమార్ సినిమాకు వెళ్ళుతూ అనుపమను కూడా పిలిచాడు. ఆమె రానని చెప్పబోతూండగా రాజశేఖరంగారే 'వెళ్లమ్మా బావేగా!' అనడంతో తలవూపక తప్పింది గాదు.

హాల్లో ఆ యిరువుర్నీ చూసినవారు విసుర్లను విసరనే విసిరారు.




'మనం చెప్పలేదటోయ్! రాజశేఖరంగారు 'అల్లుడిగా చేసుకుని తీరతారని' అంటూ.

కానీ విశ్రాంతి సమయంలో ఆ వ్యాఖ్యాతల మొహాలు తెల్లగా పాలిపోయాయి.

రాజశేఖరంగారూ, అనుపమా, మధుమూర్తి, విజయ్‌కుమార్‌లు సోడా త్రాగుతూన్నారు బయట నిలబడి.

'రాజశేఖరంగారు మంచి రాజనీతిజ్ఞుడోయ్!' అని సరిపెట్టుకున్నారు చేసేది లేక.

తరువాత నెలరోజులకు జరిగినదానితో అందరినోళ్లూ కట్టువడిపోయాయి మంత్రించినట్లు.

'మావయ్యా! మా స్నేహితుడొకడు ఫారిన్ రిటరన్డ్ యిక్కడ ఓ హాస్పిటలు ఓపెన్ చేస్తున్నాడు. నన్ను కూడా కలవమంటున్నాడు' అన్నాడు విజయ్‌కుమార్!

'డబ్బు కావలిస్తే మన ఆఫీసులో అడిగి తీసుకో! సంకోచించకు. కానీ పేదవాళ్లకు మనిషిగా మాత్రం కన్పించు' అన్నారాయన.

హాస్పిటలు ఓపెన్‌చేసే రోజున రాజశేఖరంగారిని ఆహ్వానించారు— ఆయన తన వుపన్యాసంలో అన్నమాటలు అందరికీ నచ్చాయి ఎంతగానో—

'ఉత్సాహమూ, విజ్ఞానమూ వురకలు వేస్తూన్న యువకుల్లో నీతి, నిజాయితీ, కరుణా వున్నంతకాలం మనదేశం అభివృద్ధి పథంలో వున్నట్లే భావించవచ్చు. కానీ ప్రభుత్వ ఆస్పత్రుల్లో జరిగేది మాత్రం యిందుకు భిన్నంగా వుంటోంది.

రోగం ఒకరి సిఫారసుపైన రాదు రోగనివారణకుమాత్రం ప్రభుత్వ సంస్థల్లో ఎందరి సిఫారసులో అవసరం. ఈ పరిస్థితికి కారణం ధనాశేగాదు. మనలో వున్న దానవత్వమే కారణం.

మానవులై జన్మించి దానవత్వాన్ని పెంచుకుంటున్న విజ్ఞానవంతుల్ని చూసి అభినందించాలో, శపించాలో అర్థంగాకుండా పోతున్నది.

ధనాన్ని సంపాదించడానికై మానవత్వాన్ని కుదువబెట్టడం ఏనాడూ ఎవ్వయా హర్షించని పని. కానీ అదే నాగరికతగా, ఘనకార్యంగా ఎంచబడుతోంది రోజుల్లో. ఆ పరిస్థితి మారిననాడే మన

జాతికి నిజమైన ప్రగతి!

ప్రగతి పథాన పయనించాలని ఉత్సాహంతో వూగిసలాడిపోతూన్న యువకుల మనస్సుల్లో మానవత్వం మణిదీపమై వెలిగిననాడే మనదేశానికి నిజమైన సంక్రాంతి.'

*　　*　　*

మధుమూర్తితో వాదన వేసుకున్నాడా రోజున విజయ్‌కుమార్.

'చాలీ చాలని యీ గుమాస్తా జీతంతో బ్రతుకు నెలా గడుపుతున్నావ్? మిస్టర్ మధూ! వాకెంతో అసహ్యం యీ గుమాస్తా గిరీ అంటే' అతని కంఠం నిండుగా అహంభావమూ, హేళనా వాగులై ప్రవహించాయి.

మృదువుగా నవ్వుతూ అన్నాడు మధుమూర్తి.

'పొరపడుతున్నారు మీరు! డాక్టరుగా మీరు శరీరాన్ని మాత్రమే కోసి చూడగలరు. కానీ జీవితాన్నే కోసి పరీక్షించగలరు గుమాస్తాలు' కించిత్ కూడా అవహేళన ధ్వనించలేదాతని మాటల్లో —

'అదిగో! ఇలాంటి శుష్క వేదాంతాలు వల్లించడానికి తప్ప మీరెందుకూ పనికిరారు' అన్నాడతడు కసిగా.

'మానవత్వాన్ని మరిచిపోకుండా నిలబెట్టేది ఆ శుష్క వేదాంతమే! అయినా జీవితంలోని ఎత్తుపల్లాలు తెలియనిదే వినుత్నల జోలికి పోవడంలో విజ్ఞానం వున్నట్లు గోచరించదు నాకు' అన్నాడు మధుమూర్తి వుద్రిక్తత రవ్వంత కూడా తొణకని స్వరంతో.

'ఫైల్లో నించి మీ తల లేచేదెప్పుడు? జీవితం విలువలు తెలిసి ఏడ్చేదెప్పుడు? ఫైళ్ళు వ్రాయడానికి తప్ప మీరు దేనికి పనికిరారోయ్!'

'డాక్టర్! ఆలోచించి అన్నమాట ఆత్మగౌరవాన్ని నిలబెడుతుంది. ఓ విధంగా మిమ్మల్ని మీరే హేళన జేసికొన్నారు.'

మధుమూర్తి జవాబువిన్న ఆ డాక్టరికేమీ అర్థంగాక వెర్రివానిలా చూస్తూండిపోయాడు.

'మీకు ఎంతో ఆశ్చర్యం వేస్తుందని గ్రహించాను. ప్రతిమనిషీ తన జీవితానికి తానే గుమాస్తా. జీవితమే ఎంత వ్రాసినా తరగని పెద్ద ఫైలు. ఊహల్ని భావాలుగా మలుస్తుంది మనస్సు. ఆ భావాలకో మెరుగు పెడుతుంది మెదడు, నిర్దిష్టమైన రూపంలో వుంచి. మరి మన మనస్సే ఒక గుమాస్తాగా మారిందిగదా!' అంటూ నవ్వుతూ అతని కళ్ళల్లోకి చూశాడు.

మనస్సు నొప్పించని విధాన విమర్శించిన అతని మృదుప్రవర్తనకు, విజ్ఞానానికి ఆ డాక్టరు విభ్రాంతుడై నోరు కదల్చలేక పోయాడు. వాదన విన్న అనుపమ ముగ్ధ నేత్రాలతో మధుమూర్తి వంక చూస్తూండి పోయింది. ప్రశంసాపూర్ణ దృష్టితో ఆమె మధుమూర్తిని 'ఎంతో బాగా చెప్పారు' అన్నట్లు అభినందనలు తెల్పింది.

విడిచిన బాణంలా సూటిగా దూసుకుని వచ్చే అతని మాటలంటే అనుపమకెంతో మక్కువ. విజయకుమార్ కెనలేని క్రోధం రగుల్తూందా విషయం తలపుకు రాగానే. అవమానభారంతో ఆనాటినుంచీ అతడు ఎపుడు మరో కోడిపందానికి కాలు దువ్వుదామా అని ఆతురత పడిపోతున్నాడు.

'మొత్తానికి భలే గారడీ చేస్తున్నావోయ్ మాటలతో. చక్కగా రూవ్-కూడా సంపాదించావు శ్రమపడకుండానే, అద్దె ప్రసక్తి అంతకన్నా రాకుండానే' అన్నాడు విజయకుమార్.

'మనిషిగా మాట్లాడినంతకాలం గౌరవాభిమానాలు నిలుస్తాయి. అంతేగానీ జంతువుల ననుకరించి పరిహాసాల పాలవడం మూర్ఖతకు మొదటి చిహ్నం' అన్నాడు శాంతంగానే మధుమూర్తి.

'మీ గుమాస్తాల కసలు కోపం రాదనుకుంటాను?'

తెలివిగా ప్రశ్నించాననుకున్నాడా డాక్టరు మహాశయుడు.

'కోపం! ఎందుకో? చేయడానికి సామర్థ్యం చాలని వాళ్ళకు కోపం వస్తుంది. అంతేగానీ మాకెందుకు?'

మీరన్నట్లు గోళ్ళు గిల్లుకుంటూ నాలుగు పైసాలు పట్టించి మత్తులో హాయిగా తేలిపోవడానికి కొందరిలా మాకు టైమేదీ?'

డాక్టరి ముఖాన నెత్తురుచుక్క లేకుండా పారిపోయింది.

ఆ సాయంత్రమే మధుమూర్తి గది. ఖాళీచేసి వెళ్ళిపోయాడు.

ఆ సంగతి తెలిసిన తర్వాత తండ్రీ కూతుళ్ల విచారానికి అంతులేకుండా పోయింది.

రాజశేఖరంగారు ఆఫీసులో అన్నారు మధుమూర్తితో—

'ఆవేశంతో మనస్సుని నొప్పించగూడదు మధూ!'

'పరిస్థితుల ఒత్తిడికి తట్టుకోవడంలో నొప్పించాను మిమ్మల్ని! కాని అందుకు అన్యథా భావించకండి. దూరాన వున్నపుడే అనుబంధాలు సన్నిహితంగా అల్లుకు



పోతాయి. అందుకైనా నన్ను క్షమించండి!' అన్నాడు వినమ్రంగా మధుమూర్తి.

'సరే! కానివ్వు! ఒక్కమాట మాత్రం మనస్సున వుంచుకో మధూ! నీకేం కావలసి వచ్చినా నేనున్నానని మరిచిపోకు. నేనే దడిగినా అభిమానాన్ని అడ్డుపెట్టి నిరాకరించకు' అన్నారాయన వాత్సల్యం నిండిన కంఠంతో.

ఆ వృద్ధుని మనస్సున పొంగి పొరలుతూన్న అనురాగ వాహినిలో మధుమూర్తి తేలిపోతూ కనులతోనే తన అంగీకారాన్ని తెలిపాడు పెదవులు కదిపేపంత వ్యవధి లేకుండానే.

*　　　*　　　*

అనుపమ ప్రతిరోజూ మధుమూర్తి కోసం నిరీక్షిస్తోంది. కానీ అతని ఛాయ కూడా ఆ వైపున పడిన పాపాన పోలేదు. పది రోజులు గడిచినా అతని జాడే లేదు. తండ్రిని ప్రశ్నించేది రోజూ! 'ఆఫీసుకు వస్తున్నారా? మాష్టారు' అని. ఆయన అతని అడ్రసు కూడా యిచ్చారు ఓ రోజున.

చీకటులింకా గాఢంగా అలుముకోలేదు. మధుమూర్తి ఆఫీసు నుంచి వచ్చి తలుపు తాళం తియబోయి ఎదురుగా విగ్రహంలా నిల్చున్న ఆమెను చూసి ఆశ్చర్య పోయాడు.

'అనుపమా! ఇదేమిటీవేళలో! నువ్వు వచ్చావ్?'

'స్నేహాన్నింత తొందరగా మరిచి పోయిన వారెంత పాషండులో చూద్దామని' అన్నదామె నిష్ఠూరం నిండిన స్వరంతో.

'మరిచి పోయినట్లు సాక్ష్యం లేదే?'

'సాక్ష్యాలకు లొంగే మనుషులు గాని వాళ్లనేం జేస్తారెవరైనా?'

'అయితే నాపైన చాలా అభియోగాలున్నాయన్న మాట! సరే! ముందు కొంచెం లోపల అడుగువేసి- ఆ పైన యుద్ధం ప్రారంభించు' అంటూ తలుపులు తెరిచి లైటు వేశాడతడు.

'యుద్ధం చేయడానికి నేనెవర్ని?'

'ఆ సంగతి తర్వాత తేల్చుకోవచ్చు! ముందు కొంచెం వంట ప్రయత్నం చూడు. ఆకలితో ఆత్మారాముడు అలమటించి పోతున్నాడు' అన్నాడతడు 'స్టౌ' తెచ్చి అక్కడ వుంచుతూ.

'అదేమిటి హోటలి భోజనం మానివేశారా?

'ఆ హోటలివంట సరిపడడం లేదు అనూ! నా ఒంటికి' అన్నాడతడు కాని అసలు కారణం అదిగాదని, తననుంచి ఏదో దాస్తున్నాడని గ్రహించిందామె. మాట్లాడకుండా 'స్టౌ' వెలిగించింది.

అన్నంవార్చి, వంకాయ పులుసుపెట్టి 'వంట పూర్తయింది, భోజనానికి రండి!' అన్నది.

వడ్డించి నేతికోసం అలమారంతా గాలించింది.

'నేయి నిండుకున్నట్లుందే?' అన్నది మజ్జిగ ముందుపెడుతూ.

'నేయి! నాకా అలవాటు తప్పి చాలా రోజులయిందిలే — సరే! నువ్వు కూడా కూర్చో!' అంటూ మాట తప్పించి ఆమెను కూడా బలవంతాన భోంచేయడానికి ఒప్పించాడు.

మజ్జిగ వంచుకుంటూ అతని వంక చూసి అన్నది అనుపమ—

ఈరకంగా ఎన్నాళ్లుతిని తిరగ్గలననుకుంటున్నారు?'

'అందుకే ఓ యిల్లాల్ని వెదికి పట్టుకుందామనుకుంటున్నాను' అన్నాడతడు పరిహాసంగా — కానీ ఆ పరిహాసంలో జీవమే లేకుండాపోయింది.

అతనివంక చూసి తలవంచుకున్నదామె అతని వుద్దేశ్యం గ్రహించీ గ్రహించనట్లు.

దీపపు కాంతిలో మధుమూర్తి చిక్కి సగమైనట్లు కన్పించింది. ఎంతో ఆగ్రహాన ఎన్నో అడగాలని, తుఫానులా విజృంభించాలనీ వచ్చిన ఆమె అతడిని చూడగానే పాలపొంగులా చల్లారిపోయింది. పైగా మరింత అనురాగం నిండిపోయిందామె హృదయాన, అతని భోజనం వగైరాలు చూడగానే.

'మీ బావగారేమంటున్నారు?' అన్నాడు మధుమూర్తి ఏదో పుస్తకం చేతులోకి తీసికొంటూ.

'ముందా పుస్తకం అక్కడ వుంచేయండి! సమాధానం కావాలనుకుంటే!' అన్నదామె కోపంగా.

'ఆహా! ఇదిగో! వుంచేశాను! యిప్పుడు

చెప్పు!' అన్నాడు బుద్ధిమంతుడిలా కూర్చుని.

'రేపటి నుంచి నాన్నగారు ట్యూషను చెప్పమన్నారు!'

'ఎవరికి? మీ నాన్నగారికే?!'

'కాదు! నాకే! ఇంగ్లీషూ, తెలుగు మీకు బాగా వచ్చునని అన్నారు.' అన్నదామె అతని పరిహాసానికి నవ్వకుండానే,

'మరి— అప్పుడుకూడా 'మాష్టర్ని— యిలాగే బెదిరించితే?' అన్నాడతడు చిలిపిగా చూస్తూ.

'అంత భయం వున్నవాళ్లు కాబట్టే వేమో! మా యింటికి అన్నిసార్లు వచ్చారు పాపం!' నిష్ఠురత నిండిపోయిందామె కంఠాన.

'అనుపమా! చూశావుగా స్వయంగా నువ్వే! ఎలా రాగలను చెప్పు! ఆఫీసు నుంచి వచ్చేసరికే చీకటి కమ్ముకొస్తోంది. ఆపైన వంట వుంది. రోజూ అనుకుంటాను. 'అనూని చూసి రావాలి' అని. పడటం లేదు. సరే! అందుకు శిక్షగా యిక ప్రతిరోజూ ఎనిమిదింటికి తప్పక వచ్చి ట్యూషను చెప్తాను' అన్నాడతడు.

'మరి జీతం మాటేమిటి? ఏమీ వద్దని పాఠం పడితే మాత్రం నేనూరుకోను' అన్నదామె.

'జీతం ఎందుకు వద్దంటాను! ఆపైన నీ దగ్గరా అనడం? నువ్వెంత యిచ్చినా, ఏ రూపాన అందించినా యీ మాష్టరు స్వీకరించుతారు ఆనందంగా' అన్నాడతడు.

ఆ పరిహాసోక్తికామె హృదయాన మధురాను రాగ వాహిని పరవళ్లు త్రొక్కిందానందం పట్టలేక.

* * *

మధుమూర్తి మరుచటి రోజున వెళ్లేసరికి ఫలహారం సిద్ధంగా వుంచింది అనుపమ.

'ముందుగావే గురుదక్షిణ అందిందన్న మాట! ఇలా అయితే మాష్టరికి మనస్సు పోదు యిక పాఠాలపైన' అన్నాడు నవ్వుతూ.

'ఆ రకం మనుషులయితే అందంగానే వుండేది' అన్నదామె. తర్వాత అతడు మాటలు పెంచనీయలేదు. పుస్తకం తీసి ముందుగా చెప్పవలసిన విషయాన్ని గురించి విపులంగా అర్థవంతమైన పదాలతో వీన సొంపుగా వుపన్యసించాడు.

అతని వాగ్ధారలో దాగిన నిపుణతకామె ఆశ్చర్యంతో నిండిపోయింది.

విషయానికి తగిన భాష! భాషలో కూడా రమ్యమైన భావాల కూర్పు ఆమెనెంతగానో అలరించింది. ఆ వయస్సుకే అంత పాండిత్యం ఆతనికేవిధంగా అలవడిందో అర్థం గాలేదామెకు.

పాఠం జరుగుతున్నంత సేపూ తనను తానే మరిచి మరీ విడమరిచి చెప్పుకుపోతున్నాడతడు మరో ధ్యాసే లేకుండా.

అతని కంఠం మధురంగా విన్పించుతోంది. పసిపాపలా అంతసేపూ అతని వైపే చూస్తూండి పోయిందనుపమ.

'రేపటికి యీ విషయమంతా క్రోడీకరించి వ్యాసం వ్రాసి వుంచు' అన్నాడతడు లేచి నిలబడి.

'వ్రాయక పోతే ఏం చేస్తారో?' అన్నదామె కావాలనే.

'సినిమాకు తీసికెళ్లి మరో వారం

దేవిగారి 'సేవజేస్తాను' అన్నాడతడు.

ఆ పరిహాసం ఆమె మనస్సున మల్లెలు పూయించింది. అనురాగ పూర్ణ నేత్రాలతో అతని వంక చూస్తూ అన్నది—

'అంతకష్టం వద్దులెండి పాపం' అని.

తర్వాత అతడు సెలవు దీసికొని వెళ్లిపోయాడు. ఏ నాడూ అతడు తన వారిని గురించి గానీ, ఆర్థికంగా తానే మలుపులోవున్న విషయంగానీ మాట వరుసకైనా అనుపమ అన్ని సార్లు తరిచి అడిగినా మనస్సు విప్పిన పాపాన పోలేదు. అందుకే రాజశేఖరంగారు కూడా 'అతని' అభిమానాన్ని గుర్తించి రెండు నెలలకు ట్యూషన్ ఫీజు అని వందరూపాయల నోటిమ్మని అనుపమకు చెప్పారా రోజున.

ఆ నోటును తీసికొని అన్నాడతడు.

# వెలుగునీడలు

'అనుపమా! యీ నీ మాష్టారంత మనస్సు తెలియని మందబుద్ధి అనుకోకు! నువ్వు నాకు ఋణపడివుండాలి! నానుంచి నీకు అందాలిగానీ నీ నుంచి నేను గ్రహించలేను. ఎందుకని ప్రశ్నించకిప్పుడు! మరోసారి తప్పక చెబుతాను' అంటూ ఆమె చేతిలో వుంచి తిరిగి తానే అన్నాడు.

'మనస్సు—నొప్పించానా? అనూ!'

'లేదు! అయినా నాకంత బాధ వుండదు. కానీ మీరు నా నుంచి దూరంగా జరిగి పోతున్నారేమోనని అన్పిస్తోంది' అన్నదామె.

భారంగా నిట్టూర్చి క్షణ మాత్రం ఆగి అన్నాడతడు అనుపమకు కొంచెం దగ్గరగా కూర్చుని.

'నీ అనురాగం నాకు ఆనందాన్నిస్తుంది. అని చెప్పగలను— కానీ ... అనూ! ఒక్కమాట! ఈ నీ మధుమూర్తి జీవితన మహా అగ్నిగుండం రగులుతోంది. ఆ జ్వాలల నుంచి నీ హృదయంలోకి నడిచి రావాలని కలలుగంటున్నాను. కానీ అనురాగం నిండిన మనస్సు తప్ప మరేమీలేని యీ మాష్టారితో జీవితాన్ని పంచుకోగలనన్న ఆత్మ విశ్వాసం వుందా అనుపమా నీలో?' ఆవేదనతో అతని కంఠ స్వరం కంపించింది.

'మీ మనస్సే నాకు మనసారా కోరుకున్న వరం మాష్టారూ! ఇంతకన్నా విప్పి చెప్పలేను. అనుపమ జీవిత వనంలో వసంతమే మీరు కావాలి అన్నమాట మాత్రం మరిచి పోవద్దు. మీతోపాటు ఏ తీరానికైనా చేరాలనే నిశ్చయించుకుంది నా మనస్సే నాడో' ఆమె నేత్రాలలో ప్రపంచాన వున్న అనురాగమంతా విరిసి మెరుపులై మెరిసింది.

'అయితే యీ మధుమూర్తి జీవితం బంగారు కలలతో నిండిపోతుందేమో అనూ! అవును! నిండిపోతుంది' తనలో తానే అస్పష్టంగా పలవరించుతున్నట్లు అంటూ ఆమె భుజాలపై చేతులుంచి కనులలో కనులుంచి తదేకంగా చూస్తూండిపోయాడెంతో సేపు.

'వస్తాను అనూ!' అంటూనే ఆమె చేతుల్ని తీసికొని మృదువుగా ముద్దు పెట్టుకుని వెళ్లిపోయాడు.

'మాష్టారూ! ఒక్కమాట!' అన్నమాట ఆమె పెదవుల నుంచి వెలికే రాలేదెంత ప్రయత్నించినా. మధురమైన అనుభూతితో నిలువెల్లా పులకించి విరిసిన పూవై పోయింది ఆనందానురాగాలు నిండి.

'ఎంత మృదువైన హృదయం?' కోటి దీపాల వెలుగులు జిమ్మే ఆ కనులలో నా కోసం యింత అనురాగం 'ఎప్పుడు దాచారో? ఎంత గంభీరంగా చెపార్పో తన మనస్సు నాదేనని!' ఆమె హృదయాన తీయని తలపులెన్నో హాయిగా కలలుగన్నాయి ఆ రాత్రి.

(ఇంకా వుంది)

# ప్రొఫెసర్ డిక్సిన్‌వెస్టు

ప్రొఫెసర్ డిక్సిన్‌వెస్టు ఇంగ్లాండులో పుట్టారు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో విద్య పూర్తి చేసుకున్న తర్వాత తమ 22వ ఏట భారతదేశానికి, భూగర్భ శాఖలో ఉద్యోగం గురించి, వచ్చారు. అప్పటినుంచి నేటిదాకా భారత దేశంలోనే భూగర్భ శాస్త్ర ప్రగతికి ఎంతో తోడ్పడ్డారు; ఎందరో విద్యార్థులని తయారు చేశారు; ఎన్నో పరిశోధనలని జరిపించారు అంతేకాక, విదేశ మారక ద్రవ్యం కొరతగా ఉన్న రోజుల్లో ఇంగ్లాండులో తమ పలుకుబడిని ఉపయోగించి శాస్త్ర పరిశోధనకి అవసరమయిన సామగ్రిని ఎంతో తెప్పించారు. మధ్య ప్రదేశంలోని సాగర్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా ఆయన చేసిన సేవ ఇంతా అంతా కాదు. ఆయన పేరు ఆ ప్రాంతంలో అందరికీ సుపరిచితమే! ఈ నెల జనవరి 10వ తేదీన ఆయన గౌరవార్థం



ఒక శాస్త్ర సంబంధమయిన గ్రంథం వెలువడింది. భారతదేశంలో భూగర్భ శాస్త్రానికి నేషనల్ ప్రొఫెసర్ అయిన డా. వాడియా గ్రంథాన్ని బహూకరించారు.

—'ఒక భూగర్భ శాస్త్రవేత్త'

# వారఫలం

## 9-5-1969 శుక్రవారం మొదలు 15-5-1969 గురువారం వరకు

**మేషం:** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృషభం** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మిధునం:** ఇదివరకు మీకు ఆందోళ కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం** లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—అధిక వ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**సింహం**: భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:** ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు-కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాటివారితో మాటపట్టింపులు తగవు. వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు.

స్త్రీలకు-ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం:** సామాన్యమైన పనులకుకూడా విశేషమైన కృషి చేయవలసి వస్తుంది. నూతన వ్యవహారాలు శ్రమ మీద ఫలిస్తాయి. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయంచేస్తారు.

**ధనుస్సు:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబవ్యవహారాలు బాగా ఉంటాయి. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**మీనం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు.

స్త్రీలకు-ఆరోగ్యం బాగా ఉంటుంది దైవకార్యాలు నెరవేరుతాయి.

—మహేష్



# నేను అమ్మాయిని కాను




చాలా వేగంగా పరుగులు తీస్తోంది రైలుబండి కిటికీలోంచి వచ్చేగాలి శరీరానికి తగలటంవల్ల, తేలిపోతున్నట్టు ఫీలయ్యాడు మోహన్. 'వాతావరణం ఎంత ఆహ్లాదకరంగా ఉంది!' తనలో తానే అనుకున్నాడు. రైల్లోంచి చూస్తూన్న తనకు, ప్రకృతి సంపదంతా కదులుతూన్నట్లనిపించింది. తన కెదురుగా అప్పుడే కనిపించిన చెట్లు, మరుక్షణంలోనే కనుమరుగై పోతున్నాయి. తనకా విషయం తెలిసున్నా, వింతగా చూస్తున్నాడు. ప్రకృతిశోభనలా తిలకిస్తూ ఆ వీచే చల్లటిగాలికి తన్మయత్వం చెందుతూ, కాసేపు కళ్ళు మూసుకున్నాడు. అందమైన అతని ఉంగారాలజుట్టు మొహం మీదకి పడుతూ, నృత్యం చేస్తోంది.

సంతోషంగా ఉన్న అతనిముఖం క్రమక్రమంగా, బాధాభరితమైంది. ఎందుకో తల పంకించి, ఆలోచించటం ప్రారంభించాడు. తను యింజనీరుంగు ఆఖరి సంవత్సరం పరీక్షలు వ్రాసి యింటికి వెడుతున్నాడు. పరీక్షలు బాగా వ్రాయటం వల్ల చాలా హుషారుగా ఉన్నాడు. పరీక్షలైపోయిన వెంటనే, తన స్నేహితుడు బలవంతం పెట్టడంతో, మైసూరం తా తిరిగి మరీ వెడుతున్నాడింటికి. ఇటువంటి తరుణంలో, ఎంతో ఆనందంగా ఉన్న అతనిముఖం, మరుక్షణంలో బాధాభరితం అవటం, బాధాకరమైన విషయమే మరి! తనలో తానే ఏదో గొణగసాగాడు—

'ఇంటికి వెళ్ళిన వెంటనే, వివాహం విషయం ఎత్తుతారు.— తలిదండ్రులు అన్నయ్య మొదలగువారు. ఏమిటి సమాధానం చెప్పటం?'— తనకు పెళ్ళిచేసుకోవటం యిష్టంలేదు—కుర్రాడు అందంగానే ఉంటాడు. హాస్టలులో ఉండేటప్పుడు తోటి స్నేహితు లంటూండేవారు, 'అందంగా ఉంటావ్, నీకేమిటోయ్? శుభసమయం చూసి, ఏ చిన్నదో ఎగరేసుకు పోతుంది.' దానికి ఏనాడూ గర్వపడకపోయినా, నలుగురూ మెచ్చుకునేంత అందాన్నిచ్చిన భగవంతునికి, అనేకవేల నమస్కారా లర్పించాడు, చాలాసార్లు. ఇక పోతే, తెలివితేటల్లో ఫరవాలేదు. తన యింజనీరింగు 5 సంవత్సరాలలో, మొదట పరిస్థితులవల్ల చదవలేకపోయినా; తర్వాత పట్టుదలతో బాగా చదివి, పరీక్షలు ఫస్టుగా వ్రాసి మరీ వస్తున్నాడు. ఇంక, నవయవ్వనంలోకి కూడా అడుగుపెట్టినవాడే. చిన్నప్పట్నుంచి, పెళ్ళిలో జరిగే హంగామా అది, ఇది... అంటే చాలా యిష్టం. మరి అటువంటి వాడికి పెళ్ళి యిష్టం లేకపోవటమేమిటీ? అని సందేహం రావచ్చు. దానికీ ఓ కారణం లేకపోలేదు. చిన్నప్పుడెవరో వాళ్ళచుట్టాలు ఎడమ కాలివేళ్ళపటి య్యాడ్చుకుపోయేవారట. అలా చేస్తుంటే, మనవాడు, ఏడవలేక నవ్వేవాడట. ఆ నవ్వంటే వాళ్ళ కిష్టం కాబోలు, యిక నవ్వించే మార్గాలు కనపడక ఏమో, అలా యిల్లంతా లాక్కుపోయే వారట. మోహన్‌తల్లికి, అప్పుడింట్లో స్వతంత్ర్యం లేకపోవటంవల్ల, చూస్తూకూడా వాళ్ళనేమీ అనలేక పోయేదిట, పాపం. ఆ కారణంగానో, లేక మోహన్ పూర్వజన్మలో చేసుకొన్న పాపం వల్లనో, చాలా లేతవి కావటం మూలాన, ఆ ఎడమకాలి వ్రేళ్ళనరాలు జారిపోయాయి. అదీగాక, ఎడమకాలు కొంచెం బలహీనమైంది, కుడికాలుకంటె. మామూలు వారెవరికీ, ఆ తేడా, యదాలాపంగా చూస్తే కనిపించదు. కాని, నడకలో కొంచెం తేడా వస్తుంది. పెద్ద లెక్క చేయతగ్గది కాకపోయినా, తనకిమాత్రం చాలా బాధగా ఉండేది. భగవంతుణ్ణి చాలాసార్లు అడిగేవాడు.

'భగవాన్! ప్రతీవారిలో, ఆఖరికి

ఒక్కటైనా లోపం ఉండి తీరుతుందన్నారిదే కాబోలు. ఇన్ని యిచ్చిన వాడివి, ఈ ఒక్కటికూడా, యివ్వలేక పోయావా?' అని; బాధపడేవాడు. కాని, వికలాంగులను, ఎన్నో రకాల రోగాలతో బాధపడేవారిని చూసినప్పుడు మాత్రం, వాళ్ళ పరిస్థితికి వ్యధచెంది,

'భగవాన్ ! తెలివితక్కువవాణ్ణి. నడకలో కొంచెం తేడా వచ్చినంత మాత్రానికే యింత బాధపడుతూంటే, యింక, పాపం, వికలాంగుల సంగతేమిటి ? వారెంత బాధపడుతూంటారో గదా !' అని వాపోయేవాడు. తన కాలుగురించి చాలాసార్లు, చాలామంది డాక్టర్లకు చూపించాడు. కాని, ప్రయోజనం లేకపోయింది. మోహన్ తండ్రిగారి చిన్ననాటి స్నేహితులొకరు, విశాఖపట్నంలో పేరుపొందిన డాక్టరుగా పని చేస్తున్నారు. ఆయన, బోను స్పెషలిస్టు. తెలిసిన వెంటనే, ప్రయాణమై పోయాడు, తండ్రితోటి. కాని, అక్కడ కూడా నిరుత్సాహమే ఎదురైంది.

'దీన్ని ఆపరేషన్ చేసి సరిచేయుటానికి వీలులేదోయ్, మిస్టర్ మోహన్ ! అయినా, నాకు తెలియ కడుగుతాను, దీనివల్ల నీకు కలిగిన అనర్హత ఏమిటి ?'
మందహాసం చేస్తూ అన్నారు. 'ఏమిటా చొప్పదంటు ప్రశ్న' అని మనసులో అనుకుని—

'అబ్బే ! ఏం లేదండి. కాని...' అన్నాడు నసుగుతూ.

'ఏమిటి సందేహిస్తున్నావు ? పెళ్ళి అవ్వదనా ? ఏం ఫర్వాలేదు. బ్రహ్మాండంగా అవుతుంది. నేనే చూస్తాలే, ఓ డాక్టరు చదివిన అమ్మాయిని' పెద్ద పెట్టున నవ్వుతూ అన్నారు.

'చచ్చాంరా దేముడా డాక్టరు చదివింది కూడానా, ఖర్మ!' అని మనస్సులో అనుకుంటూండగా,

'మొత్తానికి మీ డాక్టరు చదివేవాళ్ళ మీద పక్షపాతం చూపటం, నీ కింకా పోలేదోయ్' చిన్న విట్టువేశారు, మోహన్ తండ్రిగారు

'మొత్తానికెల్లాగైతేనేం; నేను, నా కాలూ, మిగులు' బాధగా కదిలాడు మోహన్.

ఇంక చిరాకేసి, ఏ డాక్టరు వద్దకు వెళ్ళటం మానేశాడు.

ముఖ్యంగా తనెందుకు బాధపడేవాడంటే హుషారుగా కొంచెం గబగబా నడిచేసరికి, పక్కనున్న ఫ్రెండు అడిగేవాడు,—

'ఏమిటోయ్ మోహన్! కాలికేమన్నా అయిందేమిటి ?' అంతే. మనవాడి హుషారు కాస్తా హారతి కర్పూరంలా హరించుకుపోయేది.

'మరేనోయ్ ! అక్కడ కాలుజారటంతో వెధవది కొంచెం బెణికింది'. మనస్సులో తిట్టుకుంటూ, పైకి సమాధాన మిచ్చేవాడు. ఇంక నడవాలనిపించక, అక్కడే నుంచుని, ఏ ఫ్రెండో వస్తూంటే, అతని సైకిలెక్కి మళ్ళీ హాస్టలు కొచ్చేసేవాడు. ఈ ఒక్కసారి మాత్రమే కాకుండా చాలా సార్లు అలా జరిగింది.

అందుకని, పెళ్ళి చేసుకుంటే; రేప్పొద్దున్న భార్యకూడా, 'ఏమండీ అలా నడుస్తున్నారేం ?' అని అడిగితే, యింకేమైనా ఉందా ? అంత పెద్ద యింజనీరు చదివి, అటువంటి ప్రశ్నకు గురైతే, తను పూర్తిగా చితికిపోయినట్లు ఒప్పుకొని, ఒక ప్యూన్‌లాగా చతికిలపడిపోవలసిందే. లేకపోతే, ఏం చెబుతాడు భార్యకి ? అలాగే మామగారు, అత్తగారు, బావమరదులు, మరదళ్ళు, కొత్తగా ఎంతమంది కలుస్తారని; భార్యతోటి ? వాళ్ళందరూ అడిగితే ఏమని సమాధానమివ్వాలి ? — అతని కెప్పుడూ, యీ ఆలోచనలేఉండేవి. తను పదే పదే, 'నేను అర్హుణ్ణికాదు' అనుకునేవాడు. మంత్రంకింద, దాన్నే బాగా జపించేసరికి, వంటపట్టి కాబోలు, తను నిజంగానే పెళ్ళి కనర్హుడని, అప్పుడప్పుడు, తన స్నేహితుడు, శాస్త్రితోటి అనేవాడు.

'అడుసు త్రొక్కనేల ? కాలు కడగనేల' అని అన్నారు పెద్దలు. ముందర పెళ్ళి చేసేసుకొని, యిబ్బందులను కోరి తెచ్చుకోవటం ఎందుకు ? అసలు పెళ్ళే చేసుకోకుండా ఉంటే సరి; తీరిపోతుంది. తలిదండ్రులెంత బ్రతిమాలినా, తిట్టినా, ఏంచేసినా సరే—ఒక నిశ్చయాని కొచ్చాడు మోహన్.

తాడేపల్లిగూడెం స్టేషన్‌లో మెయిలు ఆగగానే, అదిరిపడి, తొందరగా కూలివాణ్ణి పిలచి, బెడ్డింగు దింపించి, ఇనుస్సాస్తా[illegible]డుకు కదిలాడు తాపీగా.

* * *

'అమ్మా ! అన్నయ్యొచ్చేశాడేవ్ !' రిక్షాలో మోహన్‌ని చూసిన వెంటనే, వాళ్ళ చెల్లి శశి ఒక్క కేకపెట్టింది యింట్లోకి. సుశీలమ్మగారు, పరుగున దొడ్లోంచి వీధులోకి వచ్చేశారు.

'వచ్చావురా, నాయనా ? ఎన్నాళ్ళయిందో చూసి, కులాసానా బాబూ ?' ఆప్యాయంగా పలుకరించారు.

'ఆఁ! కుశాసానే అమ్మా !' అని చెల్లెలుతో,

'ఏమే శశీ ! మిగతా వాళ్ళేరి యింట్లో ?'

'స్కూలు కెళ్ళారన్నయ్యా.'

'ముందు రిక్షావాణ్ణి పంపించి, లోపలికి రా. కాళ్ళు కడుక్కొని భోజనం చేద్దువుగాని. ఎప్పుడు భోంచేశావో యేమిటో!' భోజనం ఏర్పాటుకై, హడావుడిగా, లోపలికెళ్ళారు సుశీలమ్మగారు.

సాయంత్రం వాళ్ళ నాన్నగారు, స్కూలునుంచి వచ్చారు.

'ఏరా! ఆరోగ్యం బాగుందా ? పరీక్షలెల్లా వ్రాశావు ?'

'ఫస్టుగా వ్రాశా నాన్నగారూ. చెప్పానుగా. పరీకక్ష లైనవెంటనే, మా ఫ్రెండు బలవంతం చెయ్యటంవల్ల, అలా మైసూరు వెడుతున్నానని ? తిరిగేసి వస్తున్నా.'

'ఉహఁ ! అలాగా ? బాగానే ఉంది. మీ రిజల్ట్సు ఎప్పుడు వస్తాయి ?'

'సరిగా తెలియదండీ. కాలేజీ తెరచిన, మొదటి నెలలో, వస్తా యంటున్నారు.'

రాత్రి వాళ్ళన్నయ్యకూడా వచ్చాడు.

'ఏరా, రామం ! ఎప్పుడు రావటం ? కులాసానా' అడిగాడు రాజశేఖరం.

'ఆఁ కులాసా, అన్నయ్యా' ఆప్యాయంగా కౌగలించుకున్నా రిద్దరూ.

'అదేమిటిరా ?, అలా చిక్కిపోయావ్? ఇంకా నీకంటె నేనే నయమన్నమాట.' నవ్వుతూ అన్నాడు రాజశేఖరం. మోహన్, అసలుపేరు రామ్మోహన్. ఇంట్లోవాళ్ళు సాధారణంగా, 'రామం' అని పిలుస్తారు. బయటివాళ్ళు, 'మోహన్' అని పిలుస్తారు.

* * *

# నేను అర్హుణ్ణికాను

అనుకున్నరోజు రానేవచ్చింది. ఒకరోజున నీళ్లు పోసుకుని, తల దువ్వుకుంటున్న మోహన్‌ని వాళ్ల నాన్నగారు పిల్చారు—

'ఒరేయ్, రామం!'

'ఏం నాన్నగారూ! వస్తున్నా' అలాగే వచ్చేశాడు.

'మరేం లేదురా. అలా కూర్చో. నీతో కొంచెం మాట్లాడాలి.' కొట్టుకోవడం ప్రారంభించింది గుండె.

'ఇప్పుడే వస్తానండి' లేవబోయాడు.

'కూర్చోరా. అర్జంటుగా మాట్లాడాలి. వెళ్లచ్చులే.' ఇంక లేవలేక, కూర్చుండిపోయాడు.

'చూడు! నువ్వు 4 వ సంవత్సరం చదువుతుండగానే, చాలా సంబంధాలొచ్చాయి. కాని, చదువు పాడవుతుందనే ఉద్దేశ్యంతో, మీ అమ్మ 'చేద్దామన్నా, వద్దన్నాను. ఇంక యిప్పుడు చదువైపోయింది కదా. ఉద్యోగం ఎప్పుడో అప్పుడు అదే వస్తుంది. కనుక, యీలోపల చాలామంది, పిల్లని చూసి పొమ్మని చంపుతున్నారు కాబట్టి, చూసివస్తే, దాని ప్రకారం చెయ్యొచ్చు. ఏమంటావ్?' శిలాప్రతిమలా కూర్చుని, అంతా విన్నాడు. మళ్లీ తన ఉద్దేశం ఎక్కడ మారుతుందో ఖర్మ, తర్వాత బాధపడాలనే భావంతో, తన మంత్రం (నేను అర్హుణ్ణి కాను) నాలుగుసార్లు జపించుకున్నాడు.

'మాట్లాడవేంరా?'

'నా కిప్పుడు, పెళ్లి, అదీ, వద్దండి. ఉద్యోగంవచ్చి, స్థిరపడింతర్వాత, మెల్లిగా తర్వాత చూద్దాం.'

'అదేమిటిరా? శుభమైన సంబంధాలు బోల్డన్ని వస్తుంటే, హాయిగా చూసుకుని, చక్కగా పెళ్లిచేసుకోక, తర్వాత ఎప్పుడో అంటావేమిటి?'

'ఇప్పుడు చేసుకోవటం నా కిష్టంలేదు నాన్నగారూ?' లేచి వెళ్లిపోబోయాడు.

'ఈ మాటవింటే, మీ అమ్మ బాధపడుతుంది. ఈ మొండి పట్టుదలేమిటో నా కర్థం కావటం లేదు మొన్న మీ అన్నయ్యన్నాడు, 'వాడసలు పెళ్లే చేసికోడుటండీ' అని. సరదాగా అంటున్నాడనుకున్నాను గాని, యింతవరకూ వస్తుందనుకోలేదు. అదేమిటిరా? చదువుకున్నందుకు ఫలితం, తలిదండ్రులమాట వినకపోవటమా? పోనీ, తగిన కారణం ఉందా అంటే, కనిపించదు, నువ్వేమీ చెప్పవు. ఎల్లాగ నీతోటి? ఇల్లాచూడు? ఒరేయ్, రామం! మెల్లిగా యివాళంతా, ఆలోచించి, రేపు చెప్పు ఏమాటా. అయినా, యిదేమిట్రా?' — కొంచెం ఆగగానే ఇంక మాట్లాడటం అయిపోయిందనుకుని, గబగబా తన గదిలోకి వచ్చిపడ్డాడు తలుపులు బిగించి, తలగడాలో తలదూర్చి, ఆలోచించ సాగాడు.

* * *

తల్లి అస్తమానం 'ఒరేయ్ అబ్బాయ్! నామాట వినరా. బంగారంలాంటి పిల్లలున్నార్రా' అని చెవిని యిల్లు కట్టుకొని చెప్పటం,—

తండ్రిగారి సాధింపు, 'చెప్పినమాట వినని మొండిరకాలు దొరకారేరా?'—

అన్నయ్య రాజశేఖరం సలహాలు, 'నాన్నగారు చెప్పినట్టువిని, పెళ్లికి ఒప్పుకో. నీ వప్పులేం అయినదగ్గరుండకవ్.'—

వదిన ప్రోద్బలం, 'నాయనా, రామం! అమ్మగారి మనస్సు అలా క్షోభ పెట్టక పోతే పెళ్లికి ఒప్పుకో కూడదూ?'

రోజూ, వీటిని విని, విని, వేసారి, 'శ్రీ రామచంద్రా! ఆపద్బాంధవా! పెళ్లైంతర్వాత, పెళ్లాం ఏమన్నాఅంటే తర్వాత చూసుకోవచ్చు గాని, ముందర, యివ్వి భరించలేకుండా ఉన్నాను దేవా!' అని, యిక జాప్యం చేస్తే కష్టమని గ్రహించి, పెళ్లికి ఒప్పేసుకున్నాడు. వెంటనే పెళ్లిచూపులు, యివ్వీ, అవ్వీ, హంగామాగా జరిగిపోయాయి. మంచి సంబంధం (ఒక విధంగా)చూసి, నిశ్చయించేశారు కూడా. పిల్ల, బంగారు బొమ్మలా ఉంటుంది. బిఎస్‌సి చదువుకుంది. కట్నం ఎక్కువ యివ్వలేనివారు. ఏదో కొంత ముట్టచెప్పి. 'ఇంకేమనకండి బావగారూ! యింతకంటె నేనివ్వుకోలేను. ఏదో మీ కుర్రాడు చాలా బుద్ధిమంతుడనీ, పెద్ద చదువు చదివాడనీ, చాలా యోగ్యుడనీ, మీ సంబంధం వదులుకోలేక పోతున్నాం. మా పిల్లకూడా బిఎస్‌సి చదివింది. అందంలో ఆమెకు సాటి యింకెవరూ లేరని, అందరూ అంటూంటారు. మీకూ తెలిసిన విషయమే కనుక, దీనితో మీరు తృప్తిపడి, నా యీకోరికను మన్నించమని ప్రార్థిస్తున్నాను.' అని తాను తెచ్చిన మూడువేలు చేతిలోపెట్టి, తెగ ప్రార్థించారు అవధాన్లుగారు. ఇంక కాదనలేక ఒప్పేసుకున్నారు మోహన్ తండ్రిగారు.

పెళ్లి ప్రయత్నాలు బ్రహ్మాండంగా





సాగుతున్నాయి. పిల్ల బాగుండేసరికి, మన మోహన్‌కి భయం మరీ ఎక్కువైంది. ఏదో విషయాన్ని పైకి చెప్పకుండా, కప్పిపుచ్చి, ద్రోహం చేస్తున్నట్టు ఫీలయ్యాడు. అక్కడికీ పెళ్ళిలో, మామగార్ని ప్రక్కకు పిలిచి, 'మామగారూ ! నేను అర్హుణ్ణి కానండీ !' అన్నాడు. ఏమీ అర్థంకాక, మోహన్‌కేసి చూస్తూ, కాస్సేపటికి అర్థమయిన వాడిలా, మొహంపెట్టి, బతిమాలడం మొదలెట్టాడు అవధాన్లుగారు. 'బాబ్బాబు! అలా అంటే ఎలా? నీ ఉద్దేశం నా కర్థమయింది. మేం నీకు తగినవాళ్లం కాదంటున్నావు కదూ ! కట్నం సరిగా యివ్వలేక పోయినా, బాగా, 'గుణం' కేవారం నాయనా. యిప్పుడు నువ్వు కాదంటే ఎలా ? మీ నాన్నగార్ని ఒప్పించే సరికే నా పనైపోయింది. ఇంక నువ్వేమీ అడ్డుచెప్పకు నాయనా.' గడ్డం పుచ్చుకుని కందిపోయేలా ఒకటే బతిమాలారు అవధాన్లుగారు

'నీ ఖర్మ. నీ కూతురు ఖర్మ. నేనేం చెయ్యను ? అనుభవించండి.' అనుకుంటూ 'సరే పదండి.' అన్నాడు. పరమానంద భరితుడై పోయాడు బ్రహ్మడు.

పెళ్ళి ఘనంగానే ముగిసింది. బంధువులందరూ వచ్చారు. పెళ్ళిలో, చదివింపులు, 'మోహన్'కి, పెళ్ళికూతురైన 'శశికళ'కి కూడా, బాగావచ్చాయి. మోహన్‌కి స్నేహితులు చాలామంది ఉన్నా, తను పెళ్ళి చేసుకోనన్నవాడు, చేసుకుంటున్నాడంటే నవ్వుతారేమోనని చాలామందికి శుభలేఖలె పంపలేదు. అందుకని, బహు కొద్దిమంత మాత్రం వచ్చారు. ఇంతకీ తన ముఖ్యస్నేహితుడు శాస్త్రి, రానే లేదు. కొంచెం బాధపడ్డాడు.

పెళ్ళిసందడంతా అణగింది. పెళ్ళయిన తర్వాత శశికళ అత్తవారింటివద్దనే ఉండిపోయింది. మొందరి దినాల్లో క్రొత్త కాబట్టి, భార్యాభర్తలిరువురూ అలా, దూరంగానే ఉంటూ వచ్చారు. కాని క్రమంగా సన్నిహితం అవుతున్నప్పటికీ ఒక్కసారికూడా తన కాలుగురించి ప్రశ్నించక పోయేసరికి, తనలో ఉన్న పిరికితనం క్రమంగా దిగజారసాగింది. ఒకరోజున పోస్టుమాన్ ఒకరిజిస్టరు పార్సిలు యిచ్చి పోయాడు. ఇప్పుడు తనకు రిజిస్టరు పార్సిలు రావటమేమిటో, అని ఎంత ఆలోచించనా తట్టలేదు. పార్సిలు చాలా బరువుగా ఉంది. తొందరగాపోయి, రూములో బెడ్‌మీద కూర్చుని, విప్పటం ప్రారంభించాడు. కొంత విప్పటం అయ్యేసరికి, అందులోంచి ఒకలెటరు పడింది. అందులో యిలా ఉంది. 'ప్రియమైన మోహన్‌కు !

నీ శుభలేఖ అందింది. చాలా సంతోషించాను. కాని, పెళ్ళికి రాలేక పోయినందుకమితంగా విచారిస్తున్నాను. కనుక ఆగ్రహించవద్దు. తిరస్కరించక నేను యిచ్చే యీ స్వల్ప బహుమతిని స్వీకరించు. త్వరలోనే మీ ఊరు వస్తాను. విషయాలన్నీ మాట్లాడుకోవచ్చు ఉంటా మరి.'

ఇట్లు,
నీ ప్రియమిత్రుడు,
శాస్త్రి.

ఉత్తరం చదివి, కొంచెం నవ్వుకొని చాలాపేపర్లువేసి, అంత కట్టుదిట్టంగా కట్టిన దాంట్లో ఏముంది చెప్మా! అని, ఆత్రుతగా విప్పేసరికి అందులో చివరికొక పుస్తకం కనపడింది. దాని హెడ్డింగు: 'నేను అర్హుణ్ణికాను,' మళ్ళీ పాత విషయాలు మనస్సులో మెదలటంతో తల తిరిగినంత పనైంది 'ఏమిటండీ అది?, అని, భార్య ప్రవేశించటంతోపాటు ప్రశ్నించటంతో ముచ్చెమటలుపోశాయి. భార్య ఎక్కడ చూస్తుందోనన్న భయంవల్ల, 'తొందరగా మంచినీళ్లు తీసుకురా. వెళ్ళు వెళ్ళు!' అంటూ తలుపుదాకా గెంటుకుంటూ పోయి, తలుపు మూసేశాడు. 'హమ్మయ్య' అనుకుంటూ, పుస్తకంతోసహా మంచంమీద కూలబడ్డాడు.

డాక్టర్ కబుర్లు

## హామర్టోమాస్

'హామర్టోమాస్' అనే స్థితి ఒకటి ఉంది. ఎక్స్-రే బొమ్మలో ఊపిరితిత్తిలో పుట్టకురుపులాగ ఏదయినా కనిపిస్తే అది హామర్టోమాస్‌వల్ల అయి ఉండవచ్చు.

దీనికి కారణాలు — పుట్టుక నుంచే ఉన్న కొన్ని జీవకణాలు మధ్యవయస్సులోగాని పెద్ద వయస్సులోగాని మాత్రమే ఎదగటం ప్రారంభించవచ్చు. అంతేకాక, ఈ కణాలు కొన్ని నెమ్మదిగా ఎదగవచ్చు. కొన్ని త్వరగా ఎరగవచ్చు.

హామర్టోమాస్‌ని ఎక్సరేవల్ల తప్ప వేరేవిధంగా కనిపెట్టటం కష్టం; ఎక్సరేవల్ల కనిపెట్టినప్పటికీ అది హామర్టోమాసా, లేక పుట్టకురుపా నిర్ణయించటం కష్టం; ఆపరేషన్ చేస్తేగాని తెలియదు!

ఆపరేషన్ చెయ్యటం అవసరమా? ప్రాణరక్షణకి ఎంతో అవసరమేమో! కొన్ని పరిశోధనల వల్ల ఎక్సరేలవల్ల బయటపడిన 7 శాతం 'గడ్డలు' పుట్టకురుపుగా తేలుతాయి. హామర్టోమాస్




4.

సాధారణంగా పుట్టకురుపుగా మారదు

హామర్టోమాస్ ఆపరేషన్ అనవసరం అనుకోరాదు; చేసేదాకా అవసరమో కాదో తెలియదు కదా?

హెచ్. ఎల్. హెర్మెన్‌సోన్

(కాపీరయిటు)

### పి. పుల్లయ్య

# నే నెరిగిన నాగేశ్వరరావు



శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారు సినిమా ప్రపంచంలో ప్రవేశించి ఇప్పటికి 25 సంవత్సరాలు అయింది 1969 ఆయన సినిమా జీవనానికి రజతోత్సవ సంవత్సరం! ఈ సందర్భంలో శ్రీ నాగేశ్వరరావు గారిని అభినందిస్తూ చలనచిత్ర పరిశ్రమలో ప్రముఖులయిన కొందరి వ్యాసాలని పాఠకులకి అందజేస్తున్నాము. —సం॥

1939 లో 'ధర్మపత్ని'లో వేషానికి కొల్హాపూరు వచ్చినప్పుడు నాకు పరిచయమైనాడు చురుకైన పసివాడు. దాన్ని గురించి ప్రస్తుతం అనవసరం. 1944 నుంచే తన సినిమా జీవితం ప్రారంభమైనట్లు లెక్కపెట్టుకున్నాడు. అది తాను నటించిన 'సీతారామ జననం' నుంచి. కొన్నాళ్లు గడిచాయి. 1947 లో 'బాలరాజు' చిత్రం. నా ఉద్దేశంలో ఇదే నాగేశ్వరరావు మంచి నటుడన్న చిత్రం—బాగా రాణించాడు. జనాదరణ పొందాడు. మాయలోకం, మాయలమారి, కీలుగుర్రం లాంటి చిత్రాల్లో నటించాడు. 'పల్లెటూరి పిల్ల'లో నాగేశ్వరరావు ప్రేమ, త్యాగాలకు పెట్టింది భిక్ష అనిపించుకున్నాడు.

మరి కొంతకాలానికి, 1952 లో దేవదాసు చిత్రం. యీ చిత్రంలో ఆయన నటనా పరిపక్వం దృఢమైంది. అతడొక మహానటుడని తీర్మానించారు.

'సంసారం'—యీ చిత్రంలో పల్లెటూరి రైతు, నవనాగరికుడు రెంటికీ సమర్థుడనిపించుకున్నాడు నాగేశ్వరరావు 1955 లో అర్ధాంగి చిత్రం— మతిలేనివాడుగా, తర్వాత ఉదాత్తుడుగా నటించి పొగడ్త లందుకున్నాడు. దొంగరాముడు, ఇద్దరుమిత్రులు, డాక్టరు చక్రవర్తి చిత్రాలలో తనకు తాననిపించుకున్నాడు. 'మూగమనసులు' చిత్రంలో నాగేశ్వరరావు తనకు తానే మించిపోయివాడు. 'బాటసారి' నాగేశ్వరరావుకు మరొక ఉత్తమ చిత్రం. 'పునర్జన్మ'లో మరోజన్మ ఎత్తినట్లే నటించాడు.

'సుడిగుండాలు' ఆయన ఆదుర్తితో నిర్మించిన ఉత్తమచిత్రం. ఆయన నటన పరాకాష్టనందింది. ప్రజామన్ననలతో, ప్రభుత్వాల బహుమానాలనందుకుంది. నిన్నటి అదృష్టవంతుల్లో నాగేశ్వరరావు మరో ప్రతిభ బైటపడిరది. నటనలో ఎంతకైనా తెగించగల సమర్థుడని—

యీ నటుడు ప్రవేశించిన రోజుల్లో, నాయకుడికంటూ ప్రత్యేకతలేదు. ప్రత్యేకత ఒక్క చిత్రానికే! దాన్నిబట్టి దర్శకుడికి. నాడు శాంతారాం, దేవకీబోసు, సి. పుల్లయ్య గణనీయులు. ప్రత్యేకత అనుకుంటే, రామతిలకం బాగా పాడిందనేవారు—వేమూరి గగ్గయ్య రాక్షసత్వాన్ని ప్రేమించింది ప్రజ. సి. యస్. ఆర్. రంగస్థలంనుంచి అడుగుపెట్టాడు. ఆయనకు స్టేజిమీద, బాగా పాడుతాడనీ నటిస్తాడనీ పేరు! సినిమాలలో అంత ప్రత్యేకత లేకపోయిందనవచ్చు.

నాగేశ్వరరావు సినిమారంగంలో దిగిననాడు ఆదర్శంగా చెప్పుకోదగ్గ నటుడులేడు. ఆయన యెవ్వరిని ఆదర్శంగా తీసుకోలేదు. తనకుతానే ఆదర్శమైనాడు. ఒకర్ని అనుసరించడం, అనుకరించడం ఇష్టంలేనివ్యక్తి.

నాటకరంగంలో నాగేశ్వరరావు ఆడవేషాలతో ప్రారంభించినా, సినిమాలలో ఎంతటి మగవాడు అనిపించుకున్నాడు!

సైగల్ నటించిన దేవదాసు వెలువడ్డ తర్వాత, నాగేశ్వరరావు దేవదాసు వచ్చింది. అంతటిదేవదాసునేమనదేవదాసుమరిపించాడు.

పెద్దనటుడు కావాలన్న ఆశయం నెరవేరింది ఆయనొక దీక్షాపరుడు. మనోసంకల్పం, నిగ్రహం, కట్టుగిట్టాలు, మనస్థైర్యం కల దిట్ట. సాధించిన పరిణామమే 'నట చక్రవర్తి'. ఆక్రోశం అన్నది నటనలో ఒక భాగమైనా, దెబ్బతిన్న ప్రతి మానవుడు అనుభవించే మామూలు రసం నాగేశ్వరరావు జీవితంలో యీ రసానికి అవకాశం లేకపోయింది. అతడికి విజయమే ముందు నడిచింది.

సెట్టుమీద నాగేశ్వరరావు సరదాగా వుంటాడు. 'ఒథెల్లో' కడపటి రంగం నటించడానికి మూడురోజులునుంచి ఖానీ చేయాలన్న మూడ్ అలవాటు చేసుకోడు. అప్పటికప్పుడే, ఏదైనా నటించగలడు. సెట్‌మీద 'రిహార్సల్స్' అనగానే తను వినవల్సిందంతా వింటాడు, తను చేయవల్సింది తీర్మానించుకుంటాడు తనకు కావల్సిన సర్దుబాట్లు పూర్తయిన తర్వాత ప్రక్క నటీనటులమీద ఒక కన్ను వేస్తాడు. ఆ సన్నివేశంలో ఉన్న మొత్తం నటీనటుల నుండి డైరెక్టరు కోరింది వచ్చిందా అన్న ధ్యాస తనూ ఉంచుకుంటాడు. పక్క ఆర్టిస్టులు (వినే రకమనుకుంటే) తానూ సాయపడ్తాడు. సెట్టుమీద తాను చేయాల్సింది చేస్తున్నాడా, లేదా అన్న మీమాంస లేని మనిషి. సెట్టుకు వచ్చేముందు నాగేశ్వరరావుతో పేచీలుంటాయి. తానను కున్నది కాదంటే, సులభంగా ఒప్పుకోడు. ఇదమిద్ధం తేలేవరకూ లాగుతాడు. ఎవరు రైటు! కాదు! ఏది రైటు? అనేదే చర్చ. మామూలు మనిషిదగ్గర నుంచి యెంతకైనా యెదుగుతాడు.

'ప్రాణమిత్రులు' చిత్రంలో—ఒక సన్నివేశంలో—'బాబూ!— నేను ఒక్కణ్ణి కాను. మూడువేలమందిని — మూడులక్షల మందిని మూడువందలకోట్లమందిని — నన్నెవరూ బంధించలేరు!' అని నటించాలి నిజం! ఆయన్ను ఎవరూ బందించలేరు అంతకంతకు పెరిగాడు అది మరుపురాని నటన. 'జయభేరి' చిత్రంలో త్రాగుబోతై దిగజారిపోతాడు. దూరంగా పడివున్న సారా బుడ్డిని—'రామ్మా రా—నా అమ్మగదూ'

అంటూ బ్రతిమిలాడుతాడు. తప్పత్రాగి ఒళ్ళు తెలియక యింకా సారా త్రాగాలన్న ధ్యాస తప్ప మరో ధ్యాసలేని మనిషి. యీ సన్నివేశంలోనూ ఆయనకు ఆయనే సాటి.

'అర్ధాంగి' చిత్రంలో మతిలేనివాడుగా మొదటిరాత్రి, తన కష్టాలు భార్యతో ముద్దుగా చెప్పుకుంటాడు.

'నేను మీ భార్యనుకదూ—నాకు నమస్కారం చెయ్యొచ్చా?' 'చెయ్యకూడదేం? సరే చెయ్యను —పెళ్ళామా! నన్నందరూ పిచ్చివాడంటారు — నవ్వుతారు — నువ్వూ నవ్వుతావా ?'

అప్పుడతనికి భార్యన్న భావనలేదు— తెలియదు భార్య నమస్కరిస్తే తానూ కొన్నింటి నమస్కరిస్తాడు అన భార్యను ఒక అప్సరాలుగా భావిస్తాడు, నటిస్తాడు— కాదు జీవిస్తాడు పిచ్చివాడుగా నాగేశ్వరావు

తనకు నటన నటనే! నటన జీవితం కాదు—జీవితం నటన కాదు తన నటనా జీవితంలో మహానటుడైనాడు యీ నటన తన నిజ జీవితంలో అడ్డు తగలకుండా కాపాడుకున్నాడు తనకు నటన అలవాటు కాదు నటన కేవలం నటనే! నటించడం నటన కోసమే

నాగేశ్వరరావు సరదా మనిషి. గట్టి నమ్మకాలున్న మనిషి. అందువల్ల చిన్న చిన్న పేచీలూ యేర్పడుతుంటాయి. కానీ ఆయన దృష్ట్యా చూడగలిగితే, అవన్నీ ఒప్పులుగానే వుంటాయి. ఆయనమీద నాకున్న గౌరవానికి బహుశః యిదే ముఖ్య కారణం. తన నమ్మకాలను వమ్ముచేయడు. 'హి డిమాండ్స్ రెస్పెక్ట్ ఫర్ హిజ్ కన్విక్షన్స్, వన్ మే డిజాగ్రి స్టిల్'. వాదంలో తాను దిట్ట. తాను ఓడిపోడు. ఓడిపోయినా, ఆ ఓటమి మరిచిపోడు. ఎప్పుడో తన విజయాన్ని చాటించి గుర్తుచేస్తాడు.

చిరంజీవి నాగేశ్వరరావుకు అన నటనా జీవితంలో 25 యేళ్ళు నిండాయి ఇది రజతోత్సవ సమయం మరో ఇరవై అయిదేళ్ళు గడిచి స్వర్ణోత్సవం చేసుకుంటాడు కాలు బయటపెట్టి తానో పెద్ద పరిశ్రమవేత్త కావాలనుకున్నా, అయినా, తన్ను వెంటాడుతుంది నమ్ముకున్న నట సుందరి

నాగేశ్వరరావుకు, ఆయన కుటుంబానికి ఆయురారోగ్యాలతో ఐశ్వర్యం ఆనందాలు ప్రసాదించవని ఆ పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను

## వ్యక్తి విశేషాలు విశేషణాలు

శ్రీ నాగేశ్వరరావుగారితో నటుడిగా పరిచయం, నటసామ్రాట్టుగా సాన్నిహిత్యం, నిరాత్మతగా సాహచర్యం, పద్మశ్రీగా ఆత్మీయతవున్న నేను, ఈనాడు—ఆయన చిత్ర జీవిత రజతోత్సవసందర్భంలో చెప్పవలసింది, చెప్పదలుచుకుంది ఒక్కటే!

'నట సామ్రాట్ట'యినా, నటించేటప్పుడు దర్శకుడు తన భావాన్ని వ్యక్తీకరించేదాకా, తనకేమి తెలియనట్టు 'నటించడం'; నిరాత్మతగా పట్టం వున్నా తనకేమి పట్టనట్టు దేంలోనూ కల్పించుకోకపోవటం, 'పద్మశ్రీ' అయినా పాతవారికి 'బాంరాజు'గానే నిలిచిపోయి, కొత్తవారికి పాత అక్కినేని గానె వుండపోవటం—

ఆ వ్యక్తిలో విశేషాలు!

ఆ వ్యక్తికి విశేషణాలు!!

కాలాన్ని ఆపి, వయస్సును వెనక్కునెట్టి నిత్య యౌవనంతో యింకా యింకా ఎన్నో చిత్రాల్లో నటించి స్వర్ణోత్సవం గూడా జరిపించుకోగల దీక్ష, పట్టుదల ఆయనకుంది

తప్పకుండా జరిపించుకుంటాడు కూడా!!

— కె విశ్వనాథ్



అక్కినేని నాగేశ్వరరావు దంపతులు, వారి పిల్లలు

# గండికోట రహస్యం

ద్విపాత్రాభినయంగల చిత్రాలు అనేకం విడుదలయ్యాయి ఈ రకం చిత్రాలను అదిలో విరగబడి చూసినమాట వాస్తవం కథలో కొత్తదనం లేపోవడం రానురాను వీటితో మొహంమొత్తిపోతున్నారు ప్రజలు ఈ తరహాచిత్రాలకు అతీతంగా సరికొత్త టెక్నిక్‌లో భారీఎత్తున 'గండికోట రహస్యాన్ని' తాజాగా నిర్మించారు డి వి యస్ ప్రొడక్షన్స్‌వారు

దర్శకత్వపు విలువ, ఫొటోగ్రఫీ టెక్నిక్, సంగీత సారథ్యం ఒకదానితో



'గండికోట రహస్యం'లో దేవిక

ఒకటి పోటీపడుతూ భారీనిర్మాణాన్ని కనుల పండుగ చేశాయి. చిత్రాన్ని ఇంత పకడ్బందీగా ఆహ్లాదంగా తయారు చేయడానికి ముఖ్యకారణం ఉత్సాహమైన సామూహిక కృషి. అందుకు దోహదం కలిగించిన నిర్మాత ఎంతయినా అభినందనీయులు.

ఈ కథలో నాయకులు ఒక యువరాజు, మరోరాజా. రాజా అభ్యుదయవాది. ప్రజల గోడు యువరాజు కెరిగించుదామని రాజధానికి వచ్చి అతన్ని కలుసుకుంటాడు. ఇద్దరూ ఒకేపోలిక, ఆశ్చర్యం! యువరాజుకి ఆప్తమిత్రుడై పోతాడు రాజా యువరాజు ఆపదల్లో చిక్కుకున్నప్పుడు రాజా ఇబ్బందిలో పడిపోతాడు అందరూ వూహించే విధంగానే రాజా యువరాజుగా మారాడు (ఇదే గండికోట రహస్యం) చివర్లో అపార్థాలూ — అనర్థాలూ దుష్టశిక్షణా అంతా మామూలే అయితే ఇక్కడొక సమస్యాయుత ఘట్టంవుంది అది యువరాజు భార్యని రాజా పవిత్రురాల్ని చేసినవిధం క్లయిమాక్సు నూతన ప్రక్రియలో రసభరితంగా ముగిసే ఈ చిత్రంలో చివరివరకు లెక్కలేనన్ని గంభీరమైన సన్నివేశాలు మనకు అగపడతాయి. ఇవే చిత్రానికి నిండుతనం తెచ్చి సాయిని పెంచి నిలబెట్టాయి.

సంగీతంలో ఎంత మధురత్వమున్నదీ, సంగీతసారథి టి. వి. రాజులో ఎంత చాకచక్యమున్నదీ చెప్పడానికి ఒక్క ఇన్‌స్ట్రుమెంట్ మాత్రమే వుపయోగించిన పాట 'ఎంతొ చక్కనివాడు...' చాలు. సినిమా సంగీతంలో ఇదొక కొత్త పోకడ. మిగతా పాటలుకూడా మనసుకు ఎంతోహాయిని కూర్చుతాయి.

ద్విపాత్రాభినయంలో యన్. టి. రామారావు విశిష్టమైన నటనకి ఈ చిత్రం ప్రత్యక్షసాక్ష్యమవుతుంది. అంతటి నేర్పూ ఓర్పూ ఆయన నటనలో మనకు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. మరింత గ్లామరస్‌గా కనిపిస్తూ తనతోపాటు చిత్రానికి కూడా ఆయన వింతశోభ కూర్చారు. ముగ్ధమోహనమైన జయలలిత నటన, దేవిక సరసమైన పాత్రపోషణ చిత్రానికి ఆభరణాలు. మిగతా ముఖ్యపాత్రలని రాజనాల, రాజ్‌బాబు, త్యాగరాజు, ప్రభాకర రెడ్డి, మిక్కిలినేని మొదలైనవారు పోషించారు.

విఠలాచార్య పటిష్టమైన దర్శకత్వంలో యస్. యస్. లాల్ మాయాఛాయాగ్రహణంలో మనోరంజకంగా తయారయిన ఈ చిత్రానికి రచన జి. కె. మూర్తి.

గగుర్పొడిచే కత్తియుద్ధాలతోనూ, విలువైన సెట్టింగులతోనూ ఆబాలగోపాలాన్ని ఆనందపరిచేవిధంగా సర్వాంగసుందరంగా నిర్మించిన 'గండికోట రహస్యం' నిర్మాత డి వి యస్ రాజు ప్రశంసార్హులు ●

# ప్రేమమనసులు

తమిళంలో 'అన్‌బె వా' బాక్సాఫీసు చరిత్రని కొత్తమలుపు పట్టించిన చిత్రం దాని మాతృక 'కమ్ సెప్టెంబర్' లానే ఈ చిత్రంకూడా పాటలకీ, చిత్రీకరణకీ ప్రజాదరణ బాగా సంపాదించుకున్నది దీనినే ఇప్పుడు రత్నశ్రీ ప్రొడక్షన్స్‌వారు అనిసెట్టిగారినిర్వహణలో 'ప్రేమమనసులు'గా తెలుగువారికి సమర్పించారు

పూర్తిరంగులో నిర్మించిన ఈ



'ప్రేమమనసులు'లో
ఎం. జి. రామచంద్రన్, బి సరోజాదేవి

చిత్రం అనువాదచిత్రమనిపించకుండా చక్కని వినోదాన్ని అందిస్తుంది బి సరోజాదేవి, నాగేష్, యమ్ జి రామచంద్రన్, రామదాసు, నెల్లూరు కాంతారావు, మనోరమ మొదలైనవారు నటించారు

యం. యస్. విశ్వనాథం, ఆర్ రాజగోపాల్ సంగీతం అందించారు యువతీయువకుల్ని బాగా అలరించగల 'ప్రేమమనసులు' నిర్మాత కె సత్యనారాయణమూర్తి.

—సికరాజు ●

కూతురురాంరెడ్డి, జగిత్యాల

ప్ర: ఏమండీ! దేవుడున్నాడా? ఎక్కడున్నాడు? మీరు నమ్ముతారా?

జ: నమ్మేవాళ్ళకి వున్నాడు; లేడనేవాళ్ళకి లేడు; నామటుకు నేను నమ్ముతాను.

బి. ఎస్. కె. వి. ప్రసాద్, గొల్లవానితిప్ప

ప్ర: అక్కయ్య, మీరు రాజశ్రీగారు చాలా స్నేహంగా వుంటారని విన్నాను. మీ రిద్దరూ కలిసి ఏ చిత్రంలో నయినా చేసారా?

జ: నేనామెతోనే కాదు—అందరితోనూ స్నేహంగానే వుంటాను; నేనెవరితోనయినా విరోధపడ్డట్టు మీకెవరయినా చెప్పారా? నేను ఆమె కలిసి "మా మంచిఅక్కయ్య" పి. ఎస్. ఆర్. పిక్చర్‌లో నటిస్తున్నాము. చాలా!

ఎన్ జయలక్ష్మి, హిమాయత్‌నగర్

ప్ర: మీకన్నా వున్నతంగావున్న నటిని చూచిమీరు అసూయ చెందుతారా? లేక ఆ స్థాయికి చేరుకోవాలని ప్రయత్నిస్తారా?

జ. వారి నటనలోని ఔన్నత్యాన్ని మనసారా మెచ్చుకుని ఆ స్థాయిని చేరుకునేందుకు ప్రయత్నిస్తాను,

ప్ర. నటిగా మీ ఆశయమేమిటి?

జ మంచినటి, ఉత్తమనటి, సాటిలేని మేటినటి, మహానటి అని మీచే అనిపించుకోవడమే

జె బాలరాజు, తోటపల్లి

ప్ర మీ జీవితంలో మరపురాని సంఘటన యేది?

జ మావారిని - మొదటిసారి కల్సుకోవడం, కల్సుకోగానే మా మనస్సులు కలవడమే నాకు మరపురాని సంఘటన.

బోగాల రామచంద్రయ్య, విజయవాడ

ప్ర. పెళ్ళయినా యింకా పాత యింటి పేరే వాడుతున్నారేం?

జ మాకు ఆనవాయితీ లేదు. సరేనా!



జి. రాజేంద్రన్, సికింద్రాబాదు

ప్ర. 'కట్టు' 'బొట్టు' 'జుట్టు'— ఈ మూడింటిలో మీరు దేనికి ఎక్కువ విలువనిస్తారు?

జ ఏ స్త్రీకయినా "బొట్టు" ప్రధానం అని మీకు తెలియదా? "బొట్టు" అంటే యేమిటనుకున్నారు? 1. "కుంకుమబొట్టు", 2 "తాళిబొట్టు"— స్త్రీని సుమంగళి అని చాటి చెప్పే దివ్యసాధనం.

ఎల్ వి ప్రసాద్, వెలుగోడు

ప్ర: భర్తను గురించి భార్య, తెలుసుకున్నంతగా, భార్యను గురించి భర్త తెలుసకోడు. ఎందువల్ల?

జ భార్య భర్తనే గమనిస్తుంటుంది, భర్తకు యింటి అవసరాలను గమనించడంలోనే సరిపోతుంది.

టి రంగారావు, పాలకొల్లు

ప్ర. నేడు ధర్మాత్ములకి ఈలోకంలో న్యాయం జరగదని నావుద్దేశ్యం? మీ వుద్దేశ్యం ఏమిటి?

జ ఆత్మలో పరమాత్మని ధ్యానించే ధర్మాత్ములకు న్యాయం జరగితీరుతుంది అనేదే నావుద్దేశ్యం. సరేనా!

పి. నాగభూషణరావు, కొమ్మగుండ్ల

ప్ర: 'ఏకవీర' చిత్రంలో మీరు నటిస్తున్న పాత్ర ఏది? మీకు తీరిక దొరికినప్పుడు ఏం చేస్తుంటారు?

జ: "ఏకవీర"ను నేనే; నా ముద్దుల పాపాయితో ఆడుకుంటూ వుంటాను. స్నేహితురిండ్లకు ఫోను చేసి సరదాగా మాట్లాడుతుంటాను; మా వారితో అలా షికారు కెళ్లి వస్తాను.

ఎం. కల్యాణి, కానాలపోస్టు

ప్ర: నటీమణులు వారి వైవాహిక జీవితాన్ని సుఖప్రదంగా గడపలేరనీ గృహిణిగా, మాతృమూర్తిగా తమ బాధ్యతలను నిర్వర్తించ లేరని కొందరు అంటారు. మీరేమంటారు?

జ: నటీమణులు స్త్రీలు కారని అనుకుంటున్నారా? మీరు అలా అనుకుంటే నేనేమంటాను చెప్పండి

## బహుమతి పొందిన ప్రశ్న

ఎం అనిల్‌కుమార్, గుంటూరు

ప్ర నేను మా అమ్మాయిలో హీ.. రో ..గా ..నటించాలని వుంది?




జ నా కూతుర్నడిగి చెప్తాను.



# "వుయ్ టూ"

—అంజలీదేవి

అది యుగసంధి—కొత్త పాతల మేలు కలయికనందినకాలం — అప్పటికే సినిమా రంగంలో అనన్య ఖ్యాతితో స్థిరపడిపోయిన మేటినటులు విశృంఖల విహారం చేస్తున్న సమయంలో, అనుభవంలేని కొత్త ముఖాలుగా, వర్ధమాన తారలుగా శ్రీ నాగేశ్వర రావ్‌గారు, తరువాత నేనూ సినిమా రంగంలో ప్రవేశపెట్టబడ్డాం — ప్రజలు సమధికోత్సాహంతో మమ్మల్ని ఆదరించారు, ఆహ్వానించారు అది గమనించి పరిశ్రమ మాకు ప్రోత్సాహమిచ్చి ప్రగతి మార్గానికి నెట్టింది. పరిశ్రమ మా భుజాలపై వుంచిన భారాన్నీ, బాధ్యతనూ గుర్తించాం—వారి ప్రోత్సాహానికి మా ఉత్సాహం జతచేశాం—పరిశ్రమకు ఆశాభంగం కలగనివిధంగా మా బాధ్యతల్ని నెరవేర్చాం. ఆనాడు క్రమశిక్షణతో పరిశ్రమ ముందడుగు వేస్తుంది. సినిమాను కళగా భావించే అతిరథమహారథులైన నిర్మాతలు, దర్శకులు మమ్మల్ని అదుపు ఆజ్ఞల్లో పెట్టేవారు కాలం విలువ అత్యంత ప్రధానమైనదని ఆనాటివారికి తెలిసినట్లు ఈనాటివారికి తెలియదా లేక తెలిసే అజాగ్రత చూపుతున్నారా అని పిస్తుంది. మేము ఆ రోజుల్లో పగలూ రాత్రనక పనిచేసేవాళ్లం. షూటింగుకు కాని, రిహార్సల్సుకుకాని టైమ్‌కు హాజరయేవాళ్లం—ఆ రోజుల్లో, డైలాగ్ రిహార్సల్సు, డాన్స్ రిహార్సల్సు, సెట్ రిహార్సల్సు, మేకప్ టెస్టులు జరిగేవి—డిసిప్లిన్ చాలా చక్కగా పాటింపబడేది ఇవన్నీ ఎందుకు చెప్పవలసివచ్చిందంటే, శ్రీ నాగేశ్వరరావ్‌గారు మహామహులు (శ్రీ గూడవల్లి రామబ్రహ్మం, శ్రీ ఘంటసాల బలరామయ్య వగైరా) సారథ్యంలో, క్రమశిక్షణ కలవాటుపడి ఈనాడూ అవే పాటిస్తూ క్రమశిక్షణవలన, వ్యక్తికిగాని, పరిశ్రమకుగాని ఎంత ప్రయోజనమో రుజావు చేస్తున్నారు క్రమశిక్షణ వలనే యింతటి మేటినటులైనారని నా అచంచల విశ్వాసం.

శ్రీ నాగేశ్వరరావ్‌గారు 'హీరో' గా సినిమారంగ జీవితం ప్రారంభించింది 1944 అనవచ్చు. మరో రెండు సంవత్సరాలకు అంటే 1946 లో నేను ఈ రంగంలో కాలుపెట్టేను. మరో రెండు సంవత్సరాలలో, మా ఇద్దరి కాంబినేషన్ గల చిత్రాలంటె ప్రజలకు అత్యంత ఆకర్షణీయంగా వుండేవి అందుచేత డిస్ట్రిబ్యూటర్లు, ప్రొడ్యూసర్లు మే మిరువురం కావాలనేవాళ్లు. మా జంట జనాదరణ పొందిన తొలి చిత్రం 'బాలరాజు'; తరువాతే 'పల్లెటూరిపిల్ల'—'కీలుగుర్రం'—'రక్షరేఖ' వగైరా వగైరా. మే మిద్దరం కలిసి నటించిన చిత్రాలు నాకు జ్ఞాపకమున్నంతవరకు సుమారు 31. వీటిలో తెలుగు 21; తమిళం 9; హిందీ 1.

నాగేశ్వరావ్‌గారిలో నేను కనుగొన్నదల్లా ఉన్నత శిఖరాల నందుకోవాలనే పట్టుదలా, పరిశ్రమా—పాత్ర పోషణలో ఆయన కనబరచే శ్రద్ధ, ఆసక్తి—క్రమశిక్షణ కలవాటుపడిన నడవడిక—మొగమాటంలేని మాటకారితనం—దూరాలోచన, ముందుచూపు ఇవే ఆయన్ని ఈనాడు ఇంత మహోన్నత వ్యక్తిగా రూపొందించేయి. నాగేశ్వరావ్‌గారిలోని విశిష్టత మరొకటి కనిపెట్టాను. ఆయన నటించే చిత్రాలు విజయవంతం కావాలనే సంకల్పంతో త్రికరణశుద్ధితో పనిచేసే నటుడు. ఏదో యింత డబ్బు తీసుకుంటున్నాం అని ఆ సమయాని కొచ్చి, మొఖానికింతరంగు పూసుకొని, తన కిచ్చిన డైలాగ్‌లు కాస్త వప్పజెప్పేసి డబ్బా డవాలా భుజాన వేసుకుపోయేరకం కాదు తాను నటించే పాత్ర ఒక విశిష్టత కలదని తనకు నమ్మకం కుదిరితేనేగాని నటించడానికి ఒప్పుకొనేవారుకాదు. ఇక్కడే మా ఇద్దరికి వచ్చేది అభిప్రాయభేదం. ఇలా ఎన్నోచిత్రాల ఆఫర్లు తిరుగగొట్టిన సమయాలు నాకు చాలా తెలుసు



కుమార్తె సంగీతసాధనని శ్రద్ధగా వింటున్న నాగేశ్వరరావు దంపతులు.

ఈ తలతిక్కదనం ఈనాటికీ వుంది. ప్రొడ్యూసర్లు తనవద్ద తీసుకున్నవి తక్కువ కాల్‌షీట్లయితే, 'అయ్యో, పని అసంపూర్తి అవుతుందే, పాత్ర కూడా దెబ్బతింటుందేమోనని, నిర్మాతలకు బలవంతంగా 'తీసుకోండయ్యా బాబూ, పిక్చరు బాగా తీయండి' అని ఎక్కువ కాల్‌షీట్లు ఇచ్చి పనిచేసిన సమయాలూ, సందర్భాలూ చాలా నాకు తెలుసు. కాల్‌షీట్సు యిచ్చిన తర్వాత, ఇంట్లో పనుందనీ, ఒంట్లో బాగులేదనీ కుంటిసాకులు చెప్పి షూటింగు ఎగవేసే ఆచారం ఆయన జీవితంలో లేదు. నిర్మాతలకు సహకరించడంలో ఆయన చూపే సహనం ఆదర్శనీయమైంది. ముఖ్యంగా కాలం యొక్క విలువ బాగా తెలిసిన వ్యక్తి శ్రీ నాగేశ్వర్రావ్. ఉదయం 7 గంటల కాల్‌షీటుకు కరెక్టుగా 6 గంటలకే హాజరయే అలవాటు ఆయనకు ఆనాటినుండి ఈనాటి వరకు అలవాటూ, పరిపాటీ అయిపోయింది ఈ నియమాన్ని పాటించడం ఏ ఒకరిద్దరికో తప్ప మాలాటి వాళ్ళెవరికీ ఆచరణయోగ్యం కానిపని అని చెప్పక తప్పదు. అందుకే శ్రీ నాగేశ్వరరావ్ ఈనాటికీ సినిమా సామ్రాజ్యానికి మకుటం లేని మహరాజై వెలుగొందుతున్నాడంటే ఆశ్చర్య పడనక్కరలేదు.

భారతదేశం యావత్తూ గాలించినా 25 సంవత్సరాలపాటు 'హీరో'గా ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన ఘనత మన నాగేశ్వర్రావ్‌గారి కొక్కరికే దక్కుతుందనుకుంటున్నాను ఇంకా ఈ మహానటుడు ఎన్నాళ్ళు యిలా విజృంభిస్తాడో కాలమే చెప్పాలి.

మరో విశేషమేమిటంటే పాత్ర నిర్వహణలో ప్రాణాపాయ పరిస్థితుల్ని కూడా ఎదుర్కొనడానికి వెనుకంజవేయని నటుడీయన. నాగేశ్వర్రావ్‌గారూ నేనూ కలిసి నటించిన చిత్రాలలో కష్టమైనపాత్రలు, ఇలవేల్పు, చరణదాసి, పరదేశి మొదలైనవి. భిన్న మనస్తత్వాలుకల ఈ పాత్రలు నటించడంలో మేమెంతో శ్రద్ధా, ఉత్సాహమూ చూపాం. ముఖ్యంగా పరదేశిలో ముసలి పాత్రలు—ఆనాడు కొత్త తారలుగా, తెరపై వెలిగే కొత్త జంటగా, చలామణీ అవుతున్నరోజుల్లో — ముసలి

# "నేనూ-నాగేశ్వర్రావూ"



—కె. ఆర్. విజయ

శ్రీ నాగేశ్వరరావు చిత్రరంగానికి వచ్చి యిరవై అయిదు సంవత్సరాలయింది. ఆయన యెన్నో చిత్రాల్లో చక్కటి నటనను ప్రదర్శించి, అఖిలాంధ్రుల అభిమానాన్ని సంపాదించి, యెన్నో అవార్డులను అందుకుని, భారత ప్రభుత్వంచే పద్మశ్రీ బిరుదాన్ని కూడా పొంది, తనకొక ప్రత్యేకతను యేర్పరచుకున్నారని నాతోపాటు మీరు ఏకీభవిస్తారనుకుంటాను.

ఆయన యిరవై అయిదు సంవత్సరాల నట జీవితంతో దాదాపు వెండి తెర నాయికలందరితోనూ నటించారనుకుంటా. ఆయనతో నేను నటించే అవకాశం యీ సంవత్సరమే సురేష్ మూవీస్‌లో దొరికింది. మేమిద్దరం యింతవరకు పనిచేసింది రెండు షెడ్యూల్సు మాత్రమే; అయినా నేను ఆయనతో అనేక చిత్రాల హీరోయిన్‌గా నటించినట్లు ఫీలయ్యాను.

నాకు తెలుగు డైలాగులను ఒకటి రెండుసార్లు చెప్పి నాచే కరెక్టుగా చెప్పించడానికి ఆయన ప్రయత్నించేవారు. సెట్లో సరదాగా మాట్లాడుతూ, జోక్సు వేసురుతూ, షాట్ రెడీ అనగానే హుషారుగా నటిస్తూ, కాల్‌షీటు అప్పుడే అయిపోయిందా అనేడి భావాన్ని వచ్చేటట్టు చేసేవారు. 'ఏంమ్మా, చెమట వదిలిందా, షాట్‌రెడీ అంటున్నారు, నేను ఒ. కే నీ మాటేమిటి?' అని తమాషాగా మాట్లాడుతూనే వర్కు జరిపించేవారు; సెట్లో నన్ను ఎంకరేజి చేసి నాచే తెలుగు డైలాగులను కరెక్టుగా చెప్పించేవారు. నాగేశ్వరరావుతో నేను నటిస్తున్నది మొదటి చిత్రమే అయినా, ఆయనతో నటించడం ఎంత సులభమో, యెంత హాయో యిప్పుడు అర్థమైంది; ముందుముందు మీ అభిమాన హీరోతో ఎక్కువ చిత్రాల్లో నటించే అవకాశం నాకు కల్గుతుంది అని ఆశిస్తున్నాను. ఈ రజతోత్సవ సంవత్సర సంరంభంలో పద్మశ్రీ నాగేశ్వరరావుకు నేను వ్రాసిన యీ యీ ఆర్టికల్ 'చంద్రునికి నూలు పోగులాంటిది' అని భావిస్తున్నాను

పాత్రలు ధరించడానికి ఉత్సాహపడ్డామూ అంటే ఈనాటి వాళ్ళెవరూ సాహసించని విషయమనే చెప్పాలి. మేమానాడు కోరేది విభిన్న పాత్రాభినయం కారెక్టర్ యాక్టింగ్. ఆనాడు మెదడుకు మేత పెట్టేవాళ్ళం; ఈనాడు అంతా, 'మెకానికల్' అయిపోయింది. నాగేశ్వరరావ్ గారు సముద్రునివలె గంభీరమైన మనిషి—ఎన్ని కష్టనష్టాలు వచ్చినా చలించని వ్యక్తి—సినీ జీవితంలో మేమిరువురమూ అమృతం సేవించిన రోజులూ వున్నాయి. హాలాహలం మ్రింగిన రోజులూ వున్నాయి. అభినందనలుచేస్తే పొంగి పోనూలేదు. అభిశంసనచేస్తే క్రుంగిపోనూలేదు. మా జీవిత సుభూతులు స్ఫురణకు తెచ్చుకొని

## హాయ్ టూ

నవ్వుకుంటాం.

శ్రీ నాగేశ్వరరావ్ గారితో కలిసి 'మాయలమారి' చిత్రం నిర్మిస్తున్నప్పుడు మేము చాలా సన్నిహితులమయాం. ఒకే మాట ఒకే బాటగా కలిసి మెలిసి తిరిగాం. ఆ సుహృద్భావంతోనే మేమిరువురమూ ఒకేచోట మా భవనాలు ఒకదాని నాను కొని ఒకటిగా, మా ఆత్మలు ఎలా ఆనాడు సన్నిహితమై వుండేవో చెప్పటకా అన్నట్లుగా నిర్మించుకున్నాం. మా రెండు కుటుంబాలూ, పసిపిల్లల హృదయాలలా ఏ అరమరికలూ, పొరపొచ్చమూ లేకుండా కలిసిమెలిసి వున్నాం. హైదరాబాదు తరలి



"క్రితకరణశుద్ధిగా పనిచేసే నటుడు"

వెళ్ళేనాడు ఆయన కన్నీరు గ్రుక్కుకుంటూ మాకు వీడ్కోలు చెప్పారు. దూరమైనా భారం కాలేదు. మా ఇరువురిమధ్యా ఆనాటి సుహృద్భావం, గౌరవమర్యాదలు ఈనాటికీ అలాగే నిలిచివున్నాయి.

నాగేశ్వరరావ్ గారి ఆశయాలు పెద్దవి. జీవితంలో ఏదో మహత్కార్యాన్ని చేయాలనీ, సాధించాలనీ ఆయన సంకల్పం. ఆదర్శవంతంగా జీవించాలనే మహదాశయం. ఈ సంకల్పబలమే ఆయన కళాశాల నిర్మాణానికీ, తదితర ప్రజోపయోగమైన ఉద్యమాలకూ దారితీసి తననింత మహోన్నత వ్యక్తిగా పైకి లేవదీసింది.

అందుకనే అభిమానులంతా ఆయనకీనాడీ సన్మానం చేయడం మనందరికీ మాననీయమైంది. ఒక మహానటుణ్ణి, ప్రజాభిమానాన్ని పొందిన కళాకారుణ్ణి సన్మానించడం మనకు గర్వకారణం—విద్యుక్తధర్మం.

ఆంధ్రమహాజనులాయనకి కట్టబెట్టిన ఉన్నత పీఠంపై ఆయన్ని ఆసీనుణ్ణి గావించి ఆయనచేత ప్రజోపయోగమైన మహత్కార్యాలు మనం చేయించుకోవాలి. ఆయన కృషి శాశ్వతంగా నిలిచిపోవాలి. అప్పుడే ఈ సన్మానాలకు అర్థమూ, పరమూ, పరమార్థమూ! ●

## సినిమా డైరీ

● శ్రీ అక్కినేని నాగేశ్వరరావు చలనచిత్ర జీవితంలో 25 ఏళ్ళు గడచిన సందర్భంగా మే 9వ తేదీన జరుగవలసిన రజతోత్సవాన్ని తెలంగాణా అల్లర్ల కారణంగా నిర్వాహకులు వాయిదావేశా.

● విజేతా పిక్చర్ 'జరిగిన కథ' అవుట్‌డోర్ షూటింగు ఏప్రిల్ 25 నుండి కాకినాడ అమలాపురం ప్రాంతాల్లో జరిగింది. శ్రీ బాబూరావు దర్శకత్వంలో కాంచన, జగ్గయ్య, కృష్ణ పాల్గొన్నారు.

● నవభారత్ కంబైన్స్ నిర్మిస్తున్న 'ఉక్కుపిడుగు' షూటింగు వాహిని స్టుడియోలో ఏప్రిల్ 15 నుండి 30 వరకు జరిగింది. ఈ షెడ్యూలులో కాంతారావు, రాజనాల, రాజశ్రీ, విజయశ్రీ రాధిక పాల్గొన్నారు.

● లక్ష్మీనారాయణ కంబైన్స్ 'కదలడు వదలడు' షూటింగు వాహినిలో ఏప్రిల్ 16 నుండి 22 వరకు జరిగింది. శ్రీ ఎన్. టి. రామారావు, జయలలిత, సత్యనారాయణ, మిక్కిలినేని, బాలకృష్ణ పాల్గొన్న సన్నివేశాలను శ్రీ విఠలాచార్య చిత్రీకరించారు.

● మిత్రా ప్రొడక్షన్స్ 'జీవనాంశం' తెలుగు చిత్రం షూటింగు శ్రీ పి. ఎస్. రావు దర్శకత్వంలో గోల్డెన్ స్టుడియోలో జరిగింది. కృష్ణ, విజయనిర్మల, ప్రభాకరరెడ్డి, అనిత, నాగయ్య, హేమలత, ఉదయచంద్రిక పాల్గొన్నారు.

● వీనస్ స్టుడియోలో ఎస్. వి. ఎస్. పిక్చర్స్ 'ప్రొడక్షన్ నెం 3' షూటింగులో ఎన్. టి. రామారావు, శోభన్, చలం, సత్యనారాయణ, చంద్రకళ పాల్గొన్న సన్నివేశాలను దర్శకులు శ్రీ కె. విశ్వనాథ్ చిత్రీకరించారు.

● మహాలక్ష్మి ఆర్ట్స్ పిక్చర్స్ నిర్మించిన 'గజదొంగ గంగన్న' చిత్రాన్ని మే 7న జ్యోతి పిక్చర్స్, విడుదల చేస్తారు.

● మే 1 న డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ 'గండికోట రహస్యం' విజయా పిక్చర్స్ ద్వారా విడుదలవుతున్నది.

మీమనసును పదే పదే
పుల్కిళ్లూరించగల ఆటపాటలకు ఆటపట్టు




డి.వి.యస్.ప్రొడక్షన్స్ వారి

# గండికోట రహస్యం





ఆంధ్ర: విజయ
నైజాం: ఉషా
సీడెడ్: జయలక్ష్మి
మైసూర్: పారిజాత





దర్శకత్వం:
బి. విఠలాచార్య
నిర్మాత
డి.వి.యస్. రాజు

STUDIO Kotha

# సినిమా

పగటికలలు కంటున్న మామయ్యా
గాలిమేడలెన్ని నీవు కట్టావయ్యా

అంటూ విజయలలిత నాగేశ్వరరావును ప్రశ్నించే సన్నివేశాన్ని దర్శకుడు తాతినేని రామారావు 'భలేరంగడు' చిత్రానికిగాను ఏప్రిల్ నాల్గవ వారంలో సారధి స్టుడియోలో చిత్రీకరించారు, ఒఫీసుకు వెళ్లినప్పుడు నిర్మాత ఒట్ వెల్లడించిన వివరాలను మీకు అందవేస్తున్నాము

'భలేరంగడు' యిన్‌డోర్ షూటింగు మే మొదటి వారంలో పూర్తవుతుంది, నాగేశ్వరరావు తన సంపూర్ణ సహకారాన్నిచ్చి చిత్రాన్ని సకాలంలో పూర్తి చేసేందుకు తోడ్పడ్డారు, అవుట్ డోర్‌లో రెండుపాటల చిత్రీకరణ మిగిలివుంది ఆ పాటలను మద్రాసు పరిసర ప్రాంతాల్లో చిత్రీకరించ దల్చుకున్నాము చిత్రాన్ని జూన్‌లో విడుదల చెయ్యాలను కుంటున్నాము, మా రెండవ చిత్రంలో కూడా నాగేశ్వరరావు హీరోగా నటించడానిక అంగీకరించారు' అని ఒట్ చెప్పారు

## అగ్రికల్చరల్ రిసర్చర్‌గా నాగేశ్వరరావు

సారది స్టుడియోలో నిర్మితమయిన ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్స్‌వారి 'ఆదర్శ కుటుంబం' మే 9 న నవయుగా ద్వారా విడుదలౌతుంది నాగేశ్వరరావు అగ్రికల్చరల్ రిసర్చర్‌గా నటించిన ఒూ సాంఘిక చిత్రం నేటి సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడే కథాంశం కల్గివున్నదని తెలుస్తుంది, ప్రత్యగాత్మచే వ్రాయబడ్డ కథకు ఆత్రేయ సమకూర్చిన సంభాషణలు బిగువుగాను, గంభీరంగాను, అందరికీ అర్థమయ్యేట్టుగాను వున్నాయని తెలుస్తుంది, కథను గుణ్యంగా రాజేశ్వరరావు సంగీతం అతికినట్టు తెలుస్తుంది చిత్రంలో కన్పడే కథాపాత్రలను ఖచ్చితమయిన నటీనటులు నటించడంచేత మనం చిత్రం చూసేప్పుడు అవి మనకు దగ్గరౌతున్నట్టు అనిపిస్తుందని వూహించబడుతుంది

ఇది నాగేశ్వరరావు నటించిన రజతోత్సవ చిత్రం కావడంచేత, చిత్రానికి సంబంధించిన ప్రతి అంశం అతి జాగ్రత్తగా నిర్వహించబడినట్టు తెలియవస్తుంది, చక్కటి సాంఘిక చిత్రాలను నిర్మించి ప్రజలలో తమకొక ప్రత్యేక స్థానాన్ని యేర్పరచుకున్న ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్స్ నిర్మాత అనుమోలు వెంకట సుబ్బారావు 'ఆదర్శ కుటుంబం' చిత్రాన్ని ఆదర్శప్రాయంగా వుండేవిధంగా నిర్మించారని తెలుస్తుంది, ప్రత్యగాత్మ తన



'బంగారు కుటుంబం'లో సచ్చు

ప్రతిభావిశేషంతో 'ఆదర్శ కుటుంబం' చిత్రాన్ని మీరందరూ మెచ్చుకునేవిధంగా చిత్రీకరించినట్టు విశ్వసనీయవర్గాలద్వారా తెలియవచ్చింది.

## మద్రాసులో 20 రోజులు నాగేశ్వరరావు ఏం చేశారు?

ఏప్రిల్ 1 నుండి 19 వరకు నాగేశ్వరరావు మద్రాసులో వున్నారు అని వ్రాసాము. ఆ సమయంలో ఆయన యేం చేసారో మీకు తెలుపుతున్నాను :

మొదటి తారీఖునుండి ఎనిమిదవ తారీఖు వరకు సురేష్‌మూవీస్ షూటింగులో పాల్గొన్నారు. తొమ్మిది, పది తేదీల్లో 'ఆదర్శ కుటుంబం' చిత్రానికి సంబంధించిన అవుట్‌డోర్ షూటింగులో పాల్గొన్నారు; మరలా 11 నుండి 18 వరకు సురేష్‌మూవీస్ షూటింగులో పాల్గొన్నారు; సురేష్ షూటింగులో పదహారు రోజులు పనిచేసి పది రీళ్ల చిత్రం నిర్మిత మయ్యేందుకు తోడ్పడ్డారు. ప్రతిరోజూ రెండు వేషాల్లో కన్పడేవారు. ఒకటి కెప్టెన్; రెండోది పెదచిన్నయ్య; ఒక ప్రక్క ఎండలు మండుతున్నా, నాగేశ్వరరావు విసుగు, విరామం లేకుండా షూటింగులో పాల్గొని తన కర్తవ్యాన్ని సక్ర



'త రాశి శాంతి ము'లో దేవిక, శోభనబాబు

మంగా, సలక్షణంగా నిర్వర్తించి అందరి ప్రశంసలకు పాత్రులయ్యారు. నాగేశ్వరరావు సెట్లోవుంటే పొద్దు తనంతట తానే పోతుంది అనేది భావాన్ని నేను కలసిన ప్రతివ్యక్తి వెల్లడించడం ఆశ్చర్యాన్ని కల్గించింది. సెట్లో ప్రతి ఒక్కరికి హుషారు గొలుపుతూ, మధ్య మధ్యన జోక్సు విసురుతూ ఎండ అనిపించకుండా షెడ్యూలును పూర్తిచేసారట.



'కన్నుల పండుగ'లో శోభన్‌బాబు, కె ఆర్ విజయ

## జయలలిత ఎవరో ఎరుగనట్లు నటించిన ఎన్. టి. రామారావు

జయలలిత రాకను ఎన్. టి. రామారావు గమనించి సంతోషంగా పిలువబోయి ఆగిపోతారు ఆమె యెవరో తనకు తెలియనట్లు నటిస్తూ...

ఎన్. టి. ఆర్: ఎవరూ?

జయలలిత: (తికమకపడుతూ) అబ్బే. నేను...మీరు...తమరూ.

రామారావు: ఏం కావాలి !

జయలలిత: ఏమీలేదు మా బావ...మా బావకోసం వచ్చాను.

రామారావు: మీ బావ? వాడెవడు? యిక్కడెందుకు వుంటాడు?



'ఖిలేరంగడు'లో నాగేశ్వరరావు, వాణిశ్రీ

జయలలిత అవును యిక్కడెందుకుంటాడు! పొరపాటయింది మన్నించండి (వెళ్ళబోతూంది)

రామారావు ఆగు, రావడం పోవడం అంతా నీ యిష్టమే అనుకుంటున్నావా? నిజం చెప్పు, మీ బావను నీవు నిజంగా ప్రేమిస్తున్నావా?

జయలలిత చిరుకోపంతో ఆ విషయం మీకెందుకు?

రామారావు ఒక వేళ ప్రేమించకపోతే నన్ను ప్రేమించమని

జయలలిత ఏమిటి?

రామారావు అబ్బబ్బ ఏం కోపం ఏం కోపం కోపంలో ఎంత అందంగా వున్నావ్

'కట్ ఫ్యాన్స్ ఆన్' అన్నారు దర్శకుడు విఠలాచార్య ఈ సన్నివేశం డి వి ఎస్ ప్రొడక్షన్స్ 'గండికోట రహస్యం' చిత్రంలో చూస్తారు ఎన్ టి రామారావు ద్విపాత్రాభినయం చేసిన యీ చిత్రం విజయా పిక్చర్స్‌ద్వారా మే 1 న విడుదలయింది, ఈపాటికి మీరు చిత్రాన్ని చూసేవుంటారని నమ్ముతున్నాను అన్ని హంగులు సమపాళ్ళలో రంగరించుకున్న యీ జానపదచిత్రాన్ని డి వి ఎస్ రాజు భారీ ఎత్తున నిర్మించారు.

## కాంతారావు హంతకుడని. రాజశ్రీ సాక్ష్యం!

సత్యనారాయణ ఠీవిగా కూర్చుని వుంటాడు, కాంతారావును గొలుసులతో బంధించి తీసుకొచ్చారు రాజశ్రీ మూలగా కూర్చుని వుంటుంది, బందించబడ్డ కాంతారావుకు, సత్యనారాయణకు జరిగిన వాదోపవాదాన్ని మీరూ తెలుసుకోండి

సత్యనారాయణ ఈ కైజారు ఎవరిది?

కాంతారావు, ఇది నాదే మికెక్కడ దొరికింది?

సత్యనారాయణ మరణించిన మహాసేనాని మయూరవర్మ (త్యాగరాజు) వెన్నులో దొరికింది, నీ తండ్రికి జరిగిన పరాభవానికి ప్రతీకారం చెయ్యాలని వెళ్ళి, కయ్యానికి కదిపి, కత్తిదూసి అన్యాయంగా హత్యచేశావు

కాంతారావు హత్య, కాదు కానేకాదు. మా యిద్దరిమధ్య జరిగింది ధర్మయుద్ధం.

సత్యనారాయణ ధర్మ యుద్ధం — ధర్మయుద్ధమయితె యీ కైజారు హతుని వీపున దిగివుండటానికి కారణమేమిటి?

కాంతారావు దొంగచాటుగా వెన్నులో పొడిచేంత నీచుణ్ణికాదు నేను

సత్యనారాయణ మరెవరు పొడిచారు ఆ మందిరంలో మీ యిద్దరుతప్ప యితరులెవ్వరూలేరని హతుని కుమార్తె, నీ ప్రేయసి

సాక్ష్యం చెప్తున్నదే (అని రాజశ్రీని చూస్తారు. ఆమె మౌనంగా తల (కిందకు వాల్చుతుంది) 'కట్' అన్నారు దర్శకుడు జి. విశ్వనాధం; 'షాట్ ఓకే' అన్నారు కెమరామెన్ గోపాలరావు; ఈ సన్నివేశం టి. సి. సుబ్బన్న నిర్మిస్తున్న 'జన్మభూమి' చిత్రంలోనిది. కాంతారావు నిజంగానే హత్యచేసి బుకాయించారా? లేక త్యాగరాజును మరెవ్వరయినా చాటుమాటుగా కత్తితో పొడిచి ఆ నేరాన్ని కాంతారావుపై వేసారా? అనెడి సందేహాలను 'జన్మభూమి' చిత్రమే తీర్చాలి.

**రాజనాలపై కత్తిదూసిన కాంతారావు**

భయంకరాకృతిలోవున్న రాజనాల కాళీ విగ్రహానికి అర్చనచేస్తూ సుందరాంగులయిన రాజశ్రీ, విజయశ్రీలను అర్పణ చేసేందుకు సిద్ధపడుతున్న తరుణంలో రాజసం పుట్టిపడే కాంతారావు అడ్డు తగిలారు; కలకలలాడే అతని ముఖారవిందాన్ని రాజనాల మెచ్చుకుంటూ యిలా చెప్పసాగారు.

రాజనాల: అద్దిర! దేదీప్యమానంగా వెలుగు ముఖ మండలమును చూచితిరా! అంబ మెచ్చెనురా!

కాంతారావు: అంబ మెచ్చుకొనుట కాదురా! నీవంటి నీచుణ్నికూడా కన్నందుకు నొచ్చుకొనుచున్నది.

కాంతారావు కంఠాన్ని విన్న రాజశ్రీ, విజయశ్రీలు ప్రియా, హర్షాసుకాడా అని యెలుగెత్తి పిలుస్తారు.

కాంతారావు: మీరు...యిక్కడ...?

రాజనాల: నీ ప్రేయసీమణుల మరణమును కనులారా కాంచ వచ్చినావటరా?

కాంతారావు: మృత్యువు వరించునది వారిని కాదు; నిన్ను ఆ దేవి సమక్షంలో వధించి నీ నీచ చరిత్రను అంతం చేస్తాను, అంటూ రాజనాలపై కత్తి దూస్తారు; కాంతారావు రాజనాలలకు జరిగిన యుద్ధంలో యెవరు నెగ్గారు? రాజశ్రీ, విజయశ్రీలు ఆ గుహకు యెలా వచ్చారు? రాజనాల సాధించ దల్చుకున్నదేమిటి? అనెడి ప్రశ్నలకు నవభారత్ కంబైన్స్ నిర్మిస్తున్న 'ఉక్కుపిడుగు' సమాధాన మిస్తుంది.

**విజయనిర్మలని అనుమానించి పుట్టింటికి పంపిన కృష్ణ**

నాగయ్య కుమారుడు ప్రభాకరరెడ్డిని, కుమార్తె విజయనిర్మలను కన్నందుకు అమితానంద భరితుడయ్యారు; తనకుమారుడు ప్రాజ్ఞుడయినందుకు, తన కుమార్తెకు తన పూర్వోన్నే మంచి సంబంధం దొరికినందుకు మురిసిపోయారు; కాని నాగయ్య కట్టుకున్న గాలిమేడ కూలిపోయింది; కారణం యేమిటని మీరు

**మీకు తెలుసా?**

ప్రసాద్ ఆర్టు పిక్చర్స్ నిర్మించిన 'ఆదర్శ కుటుంబం' శ్రీ అక్కినేని నటించిన 135 వ చిత్రం.

శ్రీ దేవర్ యిటీవల విడుదలచేసిన 'అక్కా తంగై' చిత్రంలో మృగ దర్శనం లేకపోవడాన్ని విచిత్రంగా చెప్పుకుంటున్నారట!

తెలుగు చిత్రాలలో అధిక భాగం మద్రాసులో నిర్మించ బడుతున్నా, నగరంలో రిలీజు గాకపోవడం విడ్డూరమేగా!

తమిళదేశంలో శ్రీ ఎం.జి.ఆర్.ను 'మక్కళ్ తిలగం' అని పిలిచేవిధంగా హింది చిత్రరంగంలో రాజకపూర్‌ను 'పీపుల్స్‌స్టార్' అని పిలుస్తారట!

ప్రస్తుతం హింది చిత్రరంగంలో మేటి తారగా ప్రకాశిస్తున్న హేమమాలిని 'ఇదు సత్తియమ్' అనెడి తమిళ చిత్రంలో నటించినట్లు చాలా మందికి తెలియదట!

అడుగుతారుగా? వచ్చుని తన కుమార్తె సంసారంలో చిచ్చు రేగింది; మనసారా ప్రేమించి పరిణయమాడిన కృష్ణ విజయనిర్మలను అనుమానించి, పుట్టింటికిపంపించేస్తారు. ఒక తండ్రికిగాని, తల్లికిగాని యింతకంటె దుర్భరం మరేదయినా వుంటుందా? అందుకే నాగయ్య, హేమలతలు లోలోన కుమిలిపోయారు. ఈ సన్నివేశాన్ని మిత్రా ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'జీవనాంశం' తెలుగు చిత్రానికిగాను దర్శకులు సి. ఎస్. రావు గతవారం గోల్డెన్‌లో చిత్రీకరించారు. ఆరుద్ర రచన సాగించిన యీ సాంఘిక చిత్రంలో కృష్ణ, కృష్ణంరాజు, ప్రభాకరరెడ్డి, నాగయ్య, రేలంగి, రాజబాబు, మిక్కిలినేని, విజయనిర్మల, అనిత, హేమలత, నిర్మల ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు. శ్రీ సూర్యనారాయణ నిర్మిస్తున్న యీ చిత్రంయొక్క ఛాయాగ్రహణాన్ని జి. కె. రాము, సంగీతాన్ని కె. వి. మహదేవన్, కాస్ట్యూమ్సును నారాయణరావు, కళా దర్శకత్వాన్ని వెంకట్రావు నిర్వహిస్తున్న యీ చిత్రాన్ని ఆంధ్రాలో జూపిటర్‌పిక్చర్స్ విడుదల చేస్తారు.

—శ్రీనివాస్



'గండికోట రహస్యం'లో జయలలిత, రామారావు

# నాగేశ్వరరావు గొప్పవాడు

"అమ్మా! ఆ అబ్బాయి ఎవరే? భలేగున్నాడు."

"నాగేశ్వరరావు, నాయనా."

—సినిమా చూచి వచ్చిన తల్లీ కొడుకులు.

"అబ్బ! హీరో నాగేశ్వరరావు ఎంత రొమాంటిక్‌గా ఉన్నాడో!"

—అమ్మాయిల వేడి నిట్టూర్పులు.

"నాగేస్వరరావు బాగా నటించాడహె!"

—రిక్షాబండివాని మెచ్చుకోలు.

"ఆ నాగేశ్వర్రావు పోజులు తగ్గించవాయ్!"

—కాలేజీకి పోయే కొడుకుతో తండ్రి.



"దేవదాసు 20 సార్లు చూశాను. ప్రేక్షకుల్ని ఏడిపించటం ఆయనకు యిష్టం. అందుకనే నేను నాగేశ్వరరావును లైక్ చెయ్యను."

—తమిళ సోదరుని నింద.

"నేను యిక్కడ బాగా మిస్సయినవి — కజ్జికాయలు, ఉలవచారు, అబ్బా....



నాగేశ్వరరావు సినిమాలు."

—చికాగో మిత్రుని బాధ.






"ఏమండీ! నాగేశ్వరరావు బాగా యాక్టుచేశాడు కదాండీ."

—పడకగదిలో ముచ్చట్లు.

"నాగేశ్వరరావు కారణజన్ముడు."

—న్యూయార్కు శాస్త్రిగారు ఫోనులో.

"పాత్రలకు జీవం పోయటం నాగేశ్వరరావుకు పుట్టుకతో వచ్చిన విద్య."

—పత్రికల ప్రశంసలు.




"అందర్నీ ఆకర్షించడం నాగేశ్వరరావు గొప్పతనం."

—ఆంధ్రులు ఒప్పుకొన్న సత్యం.

"నాగేశ్వరరావుగారు చాలా కోఆపరేటివ్‌గా వుంటారు."

—ప్రొడ్యూసర్ల స్టేటుమెంట్లు.

రిటైరుమెంటు లేని ఈ ఉద్యోగంలో ఆయన సర్వీసు 25 ఏళ్లు.

రాసినవారు: నిమ్మగడ్డ భవానీప్రసాద్.

బొమ్మలు గీసినవారు: లక్ష్మి.

# పు స్త కా లు

**చా సో క థ లు**

రచన: చాగంటి సోమయాజులు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, వెల: మేలుప్రతి రు. 4-00 సాధా(రణ)ప్రతి: రు. 3-00.

187 పేజీల యీ పుస్తకంలో మొత్తం 23 కథలున్నాయి. ఏ కథ నీడా మరొక కథ మీద పడకుండా ఒక్కొక్క కథలో ఒక్కొక్క విషయం వుంది. కొన్ని కథావస్తువులు బాగా పరిచయమున్న ఇతివృత్తాలలోనే అయినా, కొన్ని మాత్రం కేవలం క్రొత్తవి. (ఎంపు వగైరా) కొన్ని కథలు కథలుగా లేక ఏవో చిన్న సంఘటనలుగా వున్నాయి. (ఉదా దుమ్ములగొండి) ఇక 'లేడీ - కరుణాకరం'లో, కరుణాకరం వంటి వాడు కనుపిస్తే మనం చీదరించుకుంటాము. అల్లుడి పై చదువుల కయ్యే ఖరు　　　, అత్తమామలు అతని భార్యను (క　　　గం వృత్తి (!) లోకి దింపుతారు అది　　　చూసిన కరుణాకరం తన భార్యను తనతో　తీసుకుపోతాడు. అతని భార్య శారద తన అలవాటును పుట్టింట్లో వదిలేయక, కూడా పట్టుకుపోతుంది. తన ఇంట్లోంచి ఓ నాయుడు రావడం చూసి పెళ్ళాన్ని కేక లెయ్యబోయేసరికి "నాయుడు డబ్బెట్టి చదువుకున్నావు అందు　యీ వెధవ వుద్యోగమయినా చేస్తున్నావు వాణ్ణి దోచి నీకు పెడుతున్నాను. పుస్తె ముడి వేసిన మొగుడివి కదాని నాకే ద్రోహబుద్ధి వుంటే వాడితో లేచిపోనూ" అంటూ వుపన్యాసమిస్తుంది. "వచ్చినపుడల్లా రెండేసి మూడేసి నోట్లు యిస్తున్నాడు కక్కుర్తి పడ్డా కడుపు నిండుతోంది(!)" అంటుంది కరుణాకరం వుద్యోగం మానేసి, పెద్ద చదువు చదువుకుని (ఆమె సంపాదన మీదే) బ్యాంకులో పెద్ద వుద్యోగి అవుతాడు. అతను మరో విదేశీ బ్యాంకిలో ఇంకా వున్నతోద్యోగి అయిన్నాడు శారద మొగుణ్ణి తీసుకు వెళ్ళి ఫోర్డ్ కారు కొని బహుమతి చేస్తుంది (ఇంకేం కావాలి కరుణాకరానికి!) తన పిల్లలను చూసి, "పెద్దవాడు నాయుడు కొడుకు, రెండో పిల్ల లాయరు పోలిక." అని లెక్కలు వేస్తాడు. పరాయి దేవతలకు పిల్లల్ని కన్న కుంతీదేవి పతివ్రతే! భర్త అనుమతిస్తే తప్పు లేదన్నారు ఎవరి అనుమతీ లేకుండా "బెస్టు కేసు" కింద కర్ణుణ్ణి కని, భ్రూణ హత్య చేయబోయింది కుంతి, వీళ్ళు పతివ్రత లైతే నా భార్యేనా కానిది అని సమాధానపడుతాడతను "శారదా! నువ్వు శారదవి నాకు విద్యా దానం చేశావు శారద వెయ్యి మందిని వరిస్తుంది దానికి దోషం లేదు. అడ్డు పెట్టినా బ్రహ్మదేవుడికి చెల్లదు" అని భార్యాస్తవం చేస్తాడు ఈ కథలో కరుణాకరం తత్వం లోకంలో ఎంత మంది కుంటుంది, అంత మందికి వుంటే లోకం ఏ తీరులో వుంటుంది— అసలుంటుందా అన్న ఆలోచనలు రానీకుండా చదివితే, కథను కథగానూ, కాలక్షేపానికి చదివితే బాగుంటుందంతే! 18 ఏళ్ల కుర్రాణ్ణి ఓ ఆడిటరు గారి పడుచు పెళ్ళాం (తన కోర్కె తీరుస్తే) సైకిలు కొనిస్తాను, ఉంగరం చేయిస్తాను— అని ముఖమంతా ముద్దులతో నింపేసి, రేపు గెడ్డం గీసుకోడం ఆరంభించు "నున్నగా పువ్వులా వుండవలసిన ముఖం గజ్జి కాకరకాయిలా గుంది" అని గడ్డం తడిమి, "మొదటిసారి వెంట్రుకలు, మెత్తగానే వున్నాయి" అంటూ ముఖాన్ని .. ఆ మాణిక్యమ్మగారు తొమ్మిదేళ్ళ తరువాత మళ్ళీ కథానాయకుడికి రైల్లో కనబడి, ఓ తొమ్మిదేళ్ళ కుర్రాణ్ణి చూపించి, 'నీ వరప్రసాదం ఉండబట్టి ఆయన గడించిన డబ్బు, పిత్రార్జితం దఖలు పడ్డాయి లేకపోతే నామరుదులు ముండనిచేసి, మూల కూర్చోపెడుదురు' అంటుంది ఆవిడ— ఇది ఏలూ రెళ్ళాలి కథలోని ఘట్టం - సారాంశం! కుంతీ పరాయి మగవాళ్ళకి పిల్లల్ను కన్నదన్న విషయం యథాతథంగా తీసుకుని, అదే ఆదర్శంగా పెట్టుకుని ఈ రెండు కథలనీ మలచినట్టనిపిస్తుంది ఇక "ఎంపు" కదలో వొ ముష్టిపిల్ల తండ్రి ఆమె ప్రేమించిన కుంటివాడిని కాదని, గుడ్డివాడిని చేసుకోమని, "గుడ్డివాడికయితే యిన్ని బియ్యం దొరకడానికి ఎప్పుడూ లోటుండద"ని హితవు చెప్తాడు—అంతే!

—భూపతి

**ఆ ట లు**

## నాలుగో ప్రణాళికలో ఆటలకి 2.32 కోట్లు

భారత ప్రభుత్వం నాలుగో ప్రణాళికలో ఆటలకోసం రు. 2.32 కోట్లు కేటాయించింది. ఇందులో ముఖ్యంగా స్కూల్‌లో చదివే విద్యార్థుల్లో ఆటలలో నేర్పరులైన వారికి స్కాలర్‌షిప్ యివ్వడానికి 8 లక్షలు కేటాయించారు. ఈ సంవత్సరంలో 50 మంది యువతరంలోనివారికి నెలకి రు 100 వంతున యివ్వడానికి రు 50,000 ఖర్చు చెయ్యబడుతుంది ఆటల అభివృద్ధికోసం ఈ గ్రాంట్‌ని ఎక్కువమంది విద్యార్థులకి యివ్వడానికి క్రమంగా ఎక్కువ చెయ్యడం జరుగుతుందని ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్ అధ్యక్షుడు శ్రీ రాంనివాస్‌మిర్ధా ఇటీవల అహమ్మదాబాద్‌లో వివరించారు.

జాతీయ, అంతర్ కళాశాలల పోటీలలో ప్రతిభావంతంగా ఆడిన అబ్బాయిలకి, అమ్మాయిలకి ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్, యూనియన్ టెరిటరీ స్పోర్ట్స్ కౌన్సిల్‌లు ఇంతకిముందే స్కాలర్‌షిప్‌లు యిచ్చాయి. ఢిల్లీ అధికారులు విద్యార్థుల ఆర్థిక పరిస్థితిని ఆరా తీసి సరైన అభ్యర్థులకే స్కాలర్‌షిప్‌లని యివ్వడం అన్నది గమనించ దగినది గ్రాంట్‌లని సక్రమంగా వినియోగించడానికిది సరైన పద్ధతి.

ఇంతకుముందు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వృద్ధులైన, క్రీడారంగంనుంచి విరమించిన ప్రముఖ ఆటగాళ్లకి పెన్షన్‌లు యిచ్చే పథకాన్ని రూపొందించింది అలాగే యిప్పుడు ఎ. ఐ. ఇ. ఎస్ పథకం కూడా వయసుమీరిన, క్రీడారంగంనుంచి విరమించిన ప్రముఖక్రీడాకారులకి తోడ్పడుతుందని ఆశించవచ్చు

రాష్ట్ర, జిల్లా స్పోర్ట్స్ కౌన్సిల్స్‌కి కేటాయించిన నిధులు సరైన సమయంలో ఖర్చు అవటం లేదన్న సంగతి వ్యక్తిగతంగా నాకు తెలుసు ప్రయివేటు రంగం కూడా ఆటలని బాగానే ఆదరిస్తున్నది. ప్రముఖ క్రీడాకారులకనేక మందికి ఉద్యోగాలనిచ్చి ఉత్సాహ పరుస్తున్నది అలాంటి క్రీడాకారులు కూడా తాము ఆఫీసులో ఉన్నప్పుడు తమ పనిని నలుగురితోపాటు సక్రమంగా నిర్వర్తించడం అన్నది ముఖ్యం ..

ప్రణాళికలో కేటాయించినదాంట్లో రాష్ట్ర స్పోర్ట్స్ కౌన్సిల్స్‌కి రు. 35 లక్షలు, నేషనల్ స్పోర్ట్స్ ఫెడరేషన్‌లకి రు 50 లక్షలు నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్స్‌కి, నేషనల్ కోచింగ్ స్కీమ్‌లకి రు 35 లక్షలు ఇండియన్ మౌంటెనీరింగ్ ఫెడరేషన్‌కి రు. 9 లక్షలు ఉన్నాయి. క్రీడలకి సంబంధించిన సంస్థలు ఈ గ్రాంట్‌ని పూర్తిగా ఉపయోగించుకొని శక్తిసామర్థ్యాలు గల ఆటగాళ్లని ఉత్సాహ పరుస్తాయని ఆశించవచ్చు.




—కె. యస్. నరసింహన్

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA